# భారతి

మాసపత్రిక



సంపాదకుడు:
శివలెంక శంభుప్రసాద్



ఏప్రిల్ 1969



సంపుటము : 46 : సంచిక : 4 :

విడిప్రతిక వెల ఒక రూపాయి



30—3—69 చైత్రశుద్ధ ద్వాదశి ఆదివారం

శ్రీ దేశోద్ధారక కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారి 31-వ పుణ్యవర్ధంతి

ప్రవిమల జీవిత ప్రసృమర ప్రథితాకృతు లాత్తధర్మసా
ర వివశచిత్తు లార్యగుణరంజనమంజులదానవీరులువ్
తవులరు నిమ్నబోలు మహితాత్మకు లెచ్చటు; నీవొకండవున్
అవగుణ సత్త్వహా తెలుగునాట వెలింగితి సత్యమూర్తివై

# విషయానుక్రమణిక

## ఏప్రిల్ 1969

# మధులీల

## శ్రీ శనగన నరసింహస్వామి

జలజలరాలు పర్ణముల సవ్వడులా! శిశిరర్తు మీన సం
చల నయనా వినిష్క్రమణ చాలిత నూపుర శింజితంబులా!
లలిత నవీన మాధవ విలాస సమాగమ హర్ష సంభ్రమా
కలిత వనేందిరావిధుముఖా కరకంకణనిక్వణంబులా!

ధనదదిశాసమీరణవితానము లెప్పుడు నిష్క్రమించెనో
ఘనమిహికాలసజ్జవనికాపట మెప్పుడు చీలిపోయెనో
జనతనుపీడక ప్రబలశైత్య మదెప్పుడు వీగిపోయెనో
కనుగొనరాని వేగమున క్రమ్మెను పువ్వులకారు కమ్మగా.

మామిడిపూల బాణములు మానవతీహృదయైకలక్ష్యము
లై, మృదుకింశుక ప్రసవకార్ముక మెక్కిడుకొంచు, షట్పద
జ్యామధురారవంబులు రసాస్థలి నించుచు వచ్చె మన్మథ
స్వామి: వసంతసారథికచందనశైలమరుద్రథంబుపై.

వచ్చెను ముందు మాధవుడు, వచ్చెను పుష్పశరుండు ముందుగా,
వచ్చెను చందనాద్రిభవవాయుకుమారుడు ముందు, ముందుగా
వచ్చెను కోకిలప్రభువు; వచ్చినవారలయందు ముందుగా
వచ్చినవార లెవ్వరనువాదము తేల్పగరానిశీఘ్రతన్.

తోరణమట్లు పల్లవము తోచెను తత్తరుశాఖలందు, మా
లారచనం బొనర్చెను విలాసముగా కుసుమంబు లీ నవో
ర్వీరుహజాతి, కిట్లు వనవీథుల చెట్లు పరస్పరంబు స్వ
ర్ద్వారమణీయవృద్ధిగని క్రాలు, నిదెట్టి వసంత వేగమో.

గురుతరశైశిరావసరకోపబలంబున పత్రభోగమున్
దొరగి ప్రియోపగూహనము దూరముగాఁ గృశియించు వల్లికా

వరములు మేదినీజములు పల్లవ కైతవ రోమహర్షణ
స్ఫురణమునూనె; కౌగిళుల సొంపు ఘటించు వసంతవేళలో.

భూరుహజాతు లెన్ని యెటు పొంచి చిగిర్చిననేమి, పుష్ప సం
సార వికాసహాస మనిశంబును జిందిననేమి, వాసనా
భారము నెల్లదిక్కులకు పంపి రహించిననేమి; మార తూ
ణీరము నించు భాగ్యము గణించిన ద్రాక్ష రసాలసాలమే.

చందనశైలమందు కొనసాగును సుం, దటు పై తటాక వా
ర్బిందు కణాంతశైత్యము హరింపనును, మీద మహీజవల్లికా
సుందరపుష్పసౌరభము సూరగొనున్, భరమున్ గనున్. మరుద్
బృందము లల్లనల్ల విహరించును కాముకదుర్ధరంబులై.

ఒకయెడ చంచరీకనికరోత్కటగానము విందొనర్పగా
నొకయెడ కాకపుష్టనివహోన్మదగీతము తుష్టి నింపగా
నొకయెడ శారికాసముదయోచ్చలగేయము హాయిగూర్పగా
సకలవనంబు గానసభ సల్పు ప్రకారము తోచె నామనిన్.

తవిరి తావులీను, మఱి యూసన తేనియ యూరవెట్టు, నీ
పూపొదడంతి వన్నెలు ప్రభూతముగా మెఱయించునంచు సం
భావనసేయుచున్ భ్రమరసంఘములు రేపునమాపు మోదమో
హావృతహృద్గతిన్ దిరుగులాడెను పుష్పనికుంజవీథిలో.

సహకారకిసలము లాస్వాదించి మత్తెక్కి
        పికమొండు రాగగీతికలు పాడె
కొసరి బాలకులు కోకోయన్న వెలరేగి
        కోకిల మొక్కండు కుహూవు విసరె
చూతాసవం బాని సోలి శాఖికమీద
        కాకపుష్టంబొండు కన్నునెగాడ్చె
పరభృతం బొక్కండు పనిలేనిపనిగ నా
        కలి తీఱ మావిమొగ్గలు తునిమెను

చిరముగా గొంతులోపల చిక్కుకొన్న
పంచమస్వర విభవంబు బాహిరించు

మధుమహారాజునకు వందిమాగధత్వ
మును భజించెను కొన్నికోయిలకులములు.

గత శిశిరర్తుధర్మము సగంబు బలంబున చెందెనో, యునా
గతశుచికాలధర్మము సగంబు వరంబుగ పొందెనో, మహో
ష్ణత బెదరింపకుండ, హిమశైత్యము చూపక జీవకోటికిన్
సతము సుఖంబు గూర్చెను వసంతశుభాగతి జీవగఱ్ఱయై.

ప్రథమముగ పక్వఫల మావి
తథముగ రుచిచూచి పిదప తాను మనుష్యా
తిథి కిచ్చె శుకము మును దశ
రథసూతికి శబరి పండు రవిలించుగతిన్.

ప్రతిభావత్కృతివిస్ఫృతి శా
శ్వతనవ్యోన్మేషగరిమ పొరలించు గతిన్
ప్రతివర్షము తోచెడి యీ
ఋతువు వెలువరించు నూత్నశృంగారంబుల్.



# కవిత్వము - ఇతివృత్తము

శ్రీ కాఘూరి హనుమంతరావు

ఇతివృత్తమంటే కథ. 'ఇతివృత్తంతు నాట్యస్య శరీరం పరికీర్తితమ్' అని భరతుడన్నాడు. ఇతి వృత్తం దృశ్య కావ్యమునకు శరీరం వంటిదని, రసం ప్రాణమని అభిప్రాయం.

శరీరం లేనిదే ప్రాణం ఉండదు. ప్రాణానికి శరీరం ఆధారమైనట్లు కవితకు ఇతివృత్తం ఆధారం. శరీర ప్రాణాలలో ప్రాణం ప్రధానమైనట్లు కావ్యంలో ఇతివృత్త కవిత్వాలలో కవిత్వం ప్రధానం.

ప్రాయికంగా కవిత్వం ఇతివృత్తాన్ని అవలంబించుకొని ఉంటుంది. భారతాది మహాకావ్యాలలో ఇతి వృత్తం పెద్దది. మేఘసందేశాదులలో చిన్నది. ఆధునిక ఖండ కావ్యాలలో ఇంకా చిన్నది. అసలు ఇతి వృత్తమే లేని కవిత్వం వర్ణనలు, నీతిపద్యాలుకూడా ఉంటాయి.

ఇతివృత్తం వేరు, కవిత వేరు. భారత రామాయణాది మహాకావ్యాలలో గొప్ప ఇతివృత్తం, గొప్ప కవిత్వం సమ్మిళితమై ఉన్నాయి. ఇతివృత్త రచన అంటే కథా కల్పనం; నేటి నవలా రచనవంటిదన్న మాట. టాల్‌స్టాయ్, డికెన్స్ మొదలైనవారు గొప్ప ఇతివృత్త రచయితలు. కథా సన్నివేశ కల్పనం, ఆయా సంఘటనలలో ఆయా పాత్రల స్వభావ పరిశీలనం, మానవ హృదయాల లోలోతులను పరిశీలించడం—ఇది ఇతి వృత్త రచన.

కవిత్వ మిది కాదు. ప్రపంచంలోని కొన్ని విషయాలు కవి మనస్సులో పుట్టించిన తహతహల యొక్క ఉద్విగ్న పూరిత ప్రకటనం కవిత్వం. ఇది భావనాత్మకంగానూ వర్ణనాత్మకంగానూ ఉంటుంది.

ఇది నిలువునా ఒక గీతగీచి ఇతివృత్త కవిత్వాలను వేరుచేసి చూపడం. కాని సాధారణంగా ప్రతి ఇతివృత్తంలోనూ కవిత్వం, ప్రతికవిత్వానికి అవలంబనంగా ఇతివృత్తం ఉంటాయి. కవితా వాసనలేని ఇతివృత్తాలు, ఇతివృత్త కల్పనా గంధంలేని కవితలూ విరళం.

రామాయణ భారతాలలో ఇతివృత్తమూ కవిత్వమూ రెండూ గొప్పవిగా ఉన్నాయి. కాని కేవల కవిత్వంయొక్క విలువని నిర్ణయించవలసివస్తే ఇతి వృత్త నిరపేక్షంగానే నిర్ణయించవలసి ఉంటుంది. కనుకనే క్రొత్త ఇతివృత్త కల్పనం లేకపోయినా ఆంధ్ర భారత భాగవత కర్తలని గొప్ప కవులుగానూ, బృహదితివృత్తాన్ని కల్పించిన కళాపూర్ణోదయ కర్తని అంతకన్నా అవరుడుగానూ సహృదయులు నిర్ణయిస్తున్నారు. ఎంతో ఇతివృత్తం కల రఘు వంశంకన్నా అల్పమైన ఇతివృత్తంకల మేఘసందేశం కవితా గుణంలో తీసిపోదు కదా! మహాభారత స్థిత కథనే ఈషత్పరిణామాలు చేసి కాళిదాసు శాకుంతలం రచించాడు. ఆదివరకున్న నాటకకథనే తీసుకొని కొన్ని మార్పులని చేసి షేక్స్పియర్ హేమ్లెట్‌ను రచించాడు. ఇవి రెండూ ఉత్తమోత్తమ కవితా నిలయాలైన నాటకాలు. అత్యుత్తమ కవిత్వంకల షేక్స్పియర్ సానెట్లలోకూడా ఇతివృత్తం అత్యల్పమే.

కనుక ఇతివృత్తం హెచ్చుగా ఉన్నది కనుక ఒకటి గొప్ప కావ్యమని, ఇతివృత్తం తక్కువగా ఉన్నదని వేరొకటి అధమ కావ్యమనీ నిర్ణయించ తగదు. ఆంధ్రప్రబంధాలను పలువురు ఆధునిక విమర్శకులు ఇతివృత్త హీనములని తెగడడం పరిపాటి అయిపోయింది. ఆంధ్రప్రబంధాలలో ఇతివృత్తాలు అల్పమే. కాని నృసింహపురాణం, ఆముక్తమాల్యద మొదలైన ప్రబంధాలలో కవితాగుణంమాత్రం అల్పంకాదు. ఇతివృత్త లోపంచేత ఆంధ్ర కావ్యాలలో కథావైవిధ్యం, వివిధ పాత్రల విభిన్న మన

స్తత్వ పరిశీలనం కొరవడినా కవిత్వంమట్టుకు కొరవడలేదు.

రామాయణంలో ఏ కాండలు ఉత్తమ మైనవి? అంటే జవాబు చెప్పడం కష్టం. ఏకాండ కాకాండే ఉత్తమమైనది. అయినా కిష్కింధా, సుందరకాండలు మన దృష్టిని ఎక్కువగా ఆకర్షిస్తాయి. ఈ కాండలలో కథ అంత ఎక్కువ కాదు. వర్ణనలే ఎక్కువ. వాల్మీకి రామాయణాన్ని తలచుకొనేసరికి కిష్కింధా కాండలోని వసంత వర్షా శరద్వర్ణనలు, సుందర కాండలోని హనుమత్కృత సముద్రలంఘన వర్ణన— ఇవే మనకి ముందుగా జ్ఞప్తికి వస్తాయి. కనుక గొప్ప కవిత్వానికి గొప్ప ఇతివృత్తం తప్పనిసరిగా ఆవశ్యకం కాదు.

అయినా గొప్ప ఇతివృత్తంలోని విశిష్ట సన్నివేశాలలోనుండి మంచి కవిత్వం ఉత్పన్నం కాగల అవకాశం ఉన్నది. రామాయణ భారతాలలో కథాభాగాలలోనూ, భాసకాళిదాసుల నాటకాలలోనూ, షేక్స్పియరు నాటకాలలోనూ కల ఉత్తమ కవిత్వం ఇతివృత్తాలని సన్నిహితంగా ఆశ్రయించుకొని వచ్చినదే.

సాహిత్యంలో ఇతివృత్తం ఎటువంటిదై ఉండాలి? ఇతివృత్తం సాహిత్య యోగ్యమై ఉండాలి. పాత్రల మనోంతరాలని తడవి జీవితపు లోతులని చూపజాలినదై ఉండాలి. ఈ పనులను చెయ్యగలిగిన ఇతివృత్తం ఎవరిని గురించి రచితమైనదైనా సరే సాహిత్య యోగ్య మవుతుంది. ఆధునిక విమర్శకులు ప్రాచీన సాహిత్యమంతా రాజాలని గురించి విరచితమైనదనీ, నవ్యులు సాహిత్యాన్ని రాజాశ్రయ శృంఖలల నుండి విడిపించి సార్వజనికంచేసి ఉద్ధరించారనీ అంటారు. పూర్వం రాముణ్ణీ, లక్ష్మణుణ్ణీ, దుర్యోధనుణ్ణీ, ధర్మరాజునీ ఇతివృత్త పాత్రలని చెయ్యగా, నేటి సాహిత్యంలోని నిత్యజీవిత సమస్యలతో సతమతమవుతున్న సర్వప్రజలూ పాత్రలే, ఇది సాహిత్యంలో జరిగిన అభివృద్ధి అంటారు.

కాని అత్యుత్తమమైన ప్రాచీన పాశ్చాత్య సాహిత్యమంతా, రామాయణ భారతాలూ, షేక్స్పియరు నాటకాలూ రాజుల గాథలనే వర్ణిస్తున్న వన్నది గమనార్హం. ఎవరి జీవితాలలో సంఘర్షణ, పరీక్ష ఏర్పడతాయో అవే సాహిత్య నిబద్ధములు కాజాలతాయి. జీవితంలో గొప్ప సంఘర్షణ, కఠిన పరీక్ష సాధారణ మానవులలోకన్నా; దేశాన్ని పాలిస్తూ, ప్రజలకోసం ఆత్మత్యాగంచేస్తూ, యుద్ధంలో ప్రాణాన్ని కోల్పోతూ రాజులలో ఏర్పడడానికి అవకాశం ఎక్కువకదా! రాముడు, దశరథుడు, ధర్మరాజు, భీష్ముడు, దుర్యోధనుడు, సీజరు, మేక్బెత్, సీత, శర్మిష్ఠ, క్లియోపాత్రా—వీళ్ల జీవితాలలో జరిగిన ప్రచండ సంఘర్షణ, ఆఫీసు ఉద్యోగులు, వారి భార్యలు, కూలీలు మొదలైన సాధారణ మానవులలో ఏర్పడడానికి అవకాశం తక్కువకదా! రాజుల ఉదాత్త గంభీర సంకీర్ణ జీవిత చరిత్రలని వర్ణించిన వ్యాస వాల్మీకి కాళిదాస షేక్స్పియర్ల కృతులకీ, సామాన్యులను గురించి రచిస్తున్న నేటి సాహిత్యానికీ హస్తిమశకాంతరం లేదా?

సామాన్య మానవులు సాహిత్య యోగ్యులు కాజాలడానికి వారిలో ఏదో ప్రత్యేకత, గాంభీర్యం ఉండాలి. రాజులూ, రాజ్యాలూ గతించాయి. రచయితకు సామాన్య మానవునితోనే పరిచయం ఉంటున్నది. ఎవరితో రచయితకు పరిచయం ఉంటుందో వారిని గురించే ఇతివృత్తం రచించగలడు. కనుక ఏదో ఒక ప్రత్యేకతగల సామాన్య మానవులను, వాళ్ళ ఆశయాలను, ఆలోచనలను, సమస్యలను గురించి సమర్థులైన రచయితలు మంచి సాహిత్యం వ్రాశారు. ఇది సాహిత్యంలో వచ్చిన మార్పు. అభ్యుదయమని చెప్పలేం. కాగా, పూర్వం రాజులని గురించి రచితమైన సాహిత్యం రాజుగారి వర్ణన, వేటవర్ణన, నాయికా వర్ణన—ఈ తీరున ఎట్లా గతానుగతికమై క్షీణించి పోయిందో; నేడు సామాన్య ప్రజలను గురించి వ్రాస్తున్న సాహిత్యంకూడా ఏవిధా విశేషం, సారం లేక రానురాను గిడసబారి పోతున్నది. కారణం నేటి యాంత్రికమైన జీవితంలో మనిషిలో కథానాయకుడు కాగల గాంభీర్యం ఉండడం లేదు; ఇతివృత్తం కాగల సన్నివేశాలు జీవితంలో ఏర్పడడం లేదు. అయినా రచయితలు ఏదో వ్రాసి పత్రికలు నింపాలి కనుక, స్లీపర్కోచ్లో ఎవడో ఎవర్తెకాలో త్రొక్కి లెంపకాయ తినడం, పొద్దున్నే నిద్రకళ్లతో మిల్క్ బూత్ దగ్గర తంటాలుపడడం ఇటువంటివి కథలుగా వ్రాస్తున్నారు.

కనుక ప్రాచీన సాహిత్యమంతా రాజుల జీవితాలకే పరిమితమై ఉంది, అధునిక సాహిత్యం సామాన్య మనుష్యులనుగూర్చి చెబుతున్నది కనుక సాహిత్యంలో అభ్యుదయ మేర్పడిందని తలంచడం పొరపాటు. రాజుగాని, ఇతరుడుగాని—ఏదో విశేషం, గాంభీర్యం ఉన్నవాడిని గురించే ఇతివృత్తం రచింపబడగలదు. విశేష మున్నంతమాత్రాన చాలదు. దానికి సంఘర్షణ, పరీక్ష ఏర్పడాలి. సీతా, ఊర్మిళా ఇద్దరూ ఉత్తమ స్త్రీలే. అయినా సీతాదేవి జీవితంలో పరీక్ష ఏర్పడింది కనుక కావ్యనాయిక అయింది. ఊర్మిళాదేవి జీవితంలో అంతగొప్ప పరీక్ష ఏర్పడలేదు కనుక కావ్యంలో అల్పపాత్ర అయింది.

కవితా వస్తువులో అధునికకాలంలో వచ్చిన నవ్యతను గూర్చి—'కుక్కపిల్లా, సబ్బుబిళ్లా, రొట్టెముక్కా, అరటితొక్కా'—వీటిలో ఏదీ కవిత్వానర్హం కాదని శ్రీశ్రీగారు వ్రాక్కుచ్చారు. శ్రీశ్రీగారు చెప్పినదానిలో క్రొత్త ఏమీలేదు.

> 'రమ్యం జుగుప్సిత ముదార మథాపి నీచ
> ముగ్రం ప్రసాది గహనం వికృతంచ వస్తు
> యద్వాఽవ్యవస్తు కవిభావక భావ్యమానం
> త న్నాస్తి య న్న రసభావ ముపైతి లోకే.'
>
> (దశరూపకం)

(రమ్యమైనదైనా, రోత గొలుపునదైనా; ఉదారమైనదైనా, నీచమైనదైనా, భయంకరమైనదైనా, ప్రసన్నమైనదైనా; గంభీరమైనదైనా, వికారమైనదైనా; వస్తువు, లేక అవస్తువు; లోకంలో కవిచే భావితమై రసభావాన్ని కలిగింపనిది లేదు.) అని మన ప్రాచీనాలంకారికులు చెప్పనే చెప్పారు. కుక్కపిల్లను గురించి మన ప్రాతకవులే కవిత్వం వ్రాశారు. కాగా సబ్బుబిళ్ల, రొట్టెముక్క, అరటితొక్క—ఇవి కావ్యవస్తువులు కాజాలవని ఎవరూ అనరు గాని; శ్రీశ్రీగారు గాని, ఇతర అభ్యుదయ కవులుగాని వీటినిగురించి ఇంతవరకూ ఎవరూ కవిత్వం వ్రాసినట్లులేదు. ఏదో ప్రాసకోసం వాడబడిన మాటలాగ కనిపిస్తాయి. సబ్బుబిళ్ల స్నానానికీ, రొట్టెముక్క తినడానికీ పనికివస్తాయి. అరటితొక్క పనికిరాదు, పారేస్తాం. ఈ వస్తువులకు మానవ హృదయాన్ని ఉద్వేగపరిచే శక్తి ప్రాయశః లేకపోవచ్చును. కనుక ఈ వస్తువులు బహుశః కవిత్వానికి అనర్హాలు కావచ్చును. అయినా ప్రతిభాశాలి అయిన ఎవడైనా కవి వీటిలో ఏదో విశేషాన్ని చూసి కవిత్వం చెప్పవచ్చును. సృష్టిలో పిపీలికాది బ్రహ్మపర్యంతం, మట్టిబెడ్డ మొదలు మాణిక్యం వరకు సర్వం కవితాయోగ్యమే.

మానవుని హృదయంలో ఉద్వేగాన్ని కలిగించేదేదైనా కవిత్వార్హం కాగలుగుతుంది. ఎవరి జీవితంలో విశేషం ఉండి, అది పరీక్షిత మవుతుందో వారికథ కావ్యేతివృత్తం కాజాలుతుంది.

---



# ప్రాచీనాంధ్రదేశంలో వైదుష్యం

శ్రీ మారేమండ రామారావు

ఆంధ్రదేశ చరిత్రలో క్రీ. పూ. 3 వ శతాబ్ది నించి క్రీ. శ 11 వ శతాబ్దివరకూగల కాలాన్ని ప్రాచీనయుగం అని చరిత్రకారులు వ్యవహరిస్తారు. ఈ కాలంలో క్రీ. పూ. 3 వ శతాబ్ది నించి క్రీ. శ. 220 వరకూ ఆంధ్రశాతవాహన రాజులు పరిపాలించినారు. క్రీ. శ. 220 నించి 624 వరకూ వివిధరాజ వంశీయుల రాజులూ, క్రీ. శ. 624 నించి క్రీ శ. 1076 వరకూ వేంగీ చాళుక్యులూ పరిపాలన సాగించారు. సాతవాహన యుగానికి సంబంధించినంతవరకూ హాలుడు సంకలనం చేసిన 'సప్తశతి' తప్ప ఆ నాటి కవిత్వ పాండిత్యములను గురించి తెలియచేసే ఆధారములు లేవు. శాసనములు ఈ సందర్భంలో నిరుపయోగములు. అందువల్ల ఈ వ్యాసం క్రీ. శ. 220—1076 నడుమగల కాలానికి సంబంధించి ఉంటుంది. నన్నయ భారతానికి పూర్వపువీ అని నిస్సందేహంగా చెప్పదగిన గ్రంథములు ఏమీ లేనందున ఈ వ్యాసరచనకి సాహిత్యంయొక్క ఉపయోగం లేదు. ఈ కాలపు వైదుష్యాన్ని గురించి తెలుసుకోడానికి సమకాలికములైన శాసనములే ముఖ్యాధారము. ఈ శాసనములన్నీ తామ్రశాసనములే. వీటిని పురస్కరించుకొని ఆ నాటి వైదుష్యం ఏ విధంగా ఉండేదో తెలియచెయ్యడం ఈ వ్యాసంయొక్క ఉద్దేశం.

ఏ కాలంలోనైనా అప్పటి దేశ కాల పాత్రల ప్రభావం నాటి వైదుష్యంమీద విశేషంగా కనిపిస్తుంది. ప్రాచీన యుగంలో క్రీ. పూ 3 వ శతాబ్దినించి క్రీ శ. 3 వ శతాబ్దివరకూ బౌద్ధమతం, ముఖ్యంగా మహాయాన బౌద్ధం ప్రబలంగా ఉండేది. కాని రాను రాను దాని ప్రభావం సన్నగిల్లి, తుదకు అంతరించి పోయింది. తంత్రయాన, వజ్రయానాదులు ఆ మతంలో బయలుదేరడం ఇందుకు ఒక కారణం. కాని అంతకంటే ప్రబలమైన కారణం క్రీ. శ. 220 నించీ అవిచ్ఛిన్నంగా సాగిన వైదిక ధర్మోద్ధరణోద్యమం. ఈ మహోద్యమాన్ని సాతవాహనుల అనంతరం ఆంధ్రదేశాన్ని పరిపాలించిన ఇక్ష్వాకు రాజులకు మూలపురుషుడైన మొదటి చాంతమూల మహారాజు ప్రారంభించాడు. ఇతడు అశ్వమేధ, అగ్నిష్టోమ, వాజపేయ యాగములను చేసి, స్వామి మహాసేన భక్తిని ప్రచారం చేశాడు.[1] ఇతని తరవాత వచ్చిన రాజుల కాలంలో శైవవైష్ణవ దేవతల ఆరాధన విరివిగా సాగింది. ఇక్ష్వాకుల తరవాత ఏలుబడి సాగించిన రాజులు ఈ ఉద్యమాన్ని భక్తిశ్రద్ధలతో సాగించారు. పల్లవులు తమ శాసనములలో 'కలియుగ దోషావసన్నధర్మోద్ధరణ నిత్యసన్నద్ధులమనీ'[2], 'ధర్మ మహారాజాధిరాజుల'మనీ[3] చెప్పుకున్నారు. వీరిలో కుమారవిష్ణువనే రాజా అశ్వమేధం చేశాడు.[4] మహారాజ విజయస్కందవర్మ సర్వశాస్త్రజ్ఞుడు.[5] విష్ణుగోపవర్మ పరమ భాగవతుడూ, ధర్మజిగీషువూను.[6] ఈ పల్లవులకు సమకాలికులైన ఆనందగోత్రపురాజు అత్తివర్మ పంకేశ్వర శంభుభక్తుడు.[7] బృహత్పలాయన జయవర్మ మహేశ్వరపాదభక్తుడు.[8] శాలంకాయన గోత్రికులైన రాజులు భగవచ్చిత్రరథస్వామి భక్తులూ, పరమ మాహేశ్వరులూ, పరమదైవతులూను. వారిలో దేవవర్మ అశ్వమేధయాజి.[9] విష్ణుకుండిన వంశపు రాజులు శ్రీపర్వతస్వామి పాదానుధ్యాతులు. వారిలో మాధవవర్మ అనే రాజా ఏకాదశాశ్వమేధములూ, బహుసువర్ణ పుండరీక పురుషమేధ వాజపేయ యుధ్యాషోడశీ రాజసూయ ప్రాధిరాజ్య ప్రాజాపత్యాది సహస్ర క్రతువులు చేశారు.[10] ఈ కాలంలో కళింగమును ఏలిన రాజులు పరమమాహేశ్వరులూ, పరమ భాగవతులూను.[11] వేంగీ చాళుక్యుల వంశకర్త భగవన్నారాయణునీ, నందాభగవతినీ, విష్ణువునూ ఆరాధించి రాజ్యాన్నీ, వరాహలాంఛనాన్నీ సంపాయించాడు. ఇతని సంతతి వారిలో చాలామందికి పరమ భాగవత, పరమ

బ్రహ్మణ్య బిరుదులు ఉండేవి. కళింగాన్ని ఏలిన తూర్పుగాంగులు గోకర్ణస్వామి భక్తులూ, పరమ మాహేశ్వరులూను. ఈ విధంగా ఈ యుగంలో వైదికధర్మం బహుముఖములుగా విజృంభించింది. ఇప్పటి రాజుల మతనిరతి వారు వేసిన ధర్మశాసనములలో ప్రతిబింబించింది.

ఈ ప్రాచీనయుగపు తామ్రశాసనములనించి వాటివాటి ప్రతిగృహీతలని గురించీ, వారి వైదుష్యాన్ని గురించి ఎన్నో విశేషములు తెలియవస్తాయి. పల్లవ విజయస్కందవర్మ అగ్నివేశ్య గోత్రజులూ, వేదవిదులూ అయిన ఇద్దరు బ్రాహ్మణులకి విరిపర గ్రామం దానం చేశాడు.[12] రెండవకుమార విష్ణువు కౌండిన్యగోత్రుడూ, ఛాందోగ్యశాఖీయుడూ అయిన భావస్కందత్రాత అనే పండితుడికి చందలూరు గ్రామం ఇచ్చాడు.[13] విజయస్కందవర్మ వద్దనుంచి ఒంగోడుగ్రామాన్ని ప్రతిగ్రహించిన కాశ్యపగోత్రుడైన గోళశర్మ ద్వివేదీ, వేదాంగ పారగుడూను.[14] కాశ్యపగోత్రుడూ, తైత్తిరీయశాఖీయుడూ అయిన విళశర్మకి పల్లవ సింహవర్మ వికిరగ్రామం దానం చేశాడు[15] గౌతమగోత్రుడూ, ఛాందోగ్యశాఖీయుడూ అయిన విష్ణుశర్మ పైరాజు ఇచ్చిన విలవట్టి దానశాసనానికి ప్రతిగృహీత.[16] అలాగే విష్ణుగోప మహారాజు దానపూర్వకంగా సత్కరించిన చెషమిశర్మ వేదవిదుడు.[17] ఆనందగోత్రపు రాజయిన అత్తివర్మ కాశ్యపగోత్రుడూ, ఆపస్తంబ సూత్రుడూ, ఋగ్యజుస్సామవేద పారగుడూ అయిన కొట్టిశర్మకి భూదానం చేశాడు.[13] శాలంకాయన విజయదేవవర్మ బభురసగోత్రుడయిన గానశర్మని సత్కరించాడు.[19] ఈ వంశీకుడే అయిన నందివర్మ మౌద్గల్యగోత్రుడైన స్వామిచంద్రుడికి భూదానం చేశాడు.[20] విష్ణుకుండినరాజుల శాసనములలో గౌతమగోత్రుడయిన శివశర్మా, వత్సగోత్రుడయిన అగ్నిశర్మా, మండిరసగోత్రుడూ తైత్తిరీయ శాఖీయుడూ అయిన నగ్నశర్మా వేదవిదులుగా పేర్కొనబడినారు.[21] కళింగరాజయిన శక్తివర్మ స్వరగోత్రీయుడూ, వాజసనేయ శాఖీయుడూ అయిన కుమారశర్మకి రాకలువ గ్రామం దానం చేశాడు. అనంతశక్తివర్మ అనే రాజుచేత శకునకగ్రామం దానం పట్టిన ఇద్దరు వేదవిదులు కాత్యాయనగోత్రానికీ, తైత్తిరీయశాఖకీ చెందినవారు.[22] అనంతవర్మ మహారాజు తోంటపరగ్రామం దానం చేసిన ఎనిమిదిమంది బ్రాహ్మణులు యజనయాజనాధ్యయనాధ్యాపన దాన ప్రతిగ్రహణ నిరతులు[23] శ్రీరామ కాశ్యపగోత్రుజుడయిన పృథ్వీ మహారాజు దానప్రతిగృహీత అయిన భావశర్మ వేదవేదాంగ న్యాయోపనిషద్యోగ పారగుడూ, త్రిసహస్రవిద్యులూ, వింశతి వ్యాఖ్యానములూ తెలిసినవాడూ, కామకాయనసగోత్రుడూ, ఛాందోగ్యశాఖీయుడును. అతని తండ్రి పృథ్వీశర్మ మూడువేల విద్యలనువేర్చి అధ్యయనాధ్యాపనలు చేసినవాడు. అతని తాత విన్నశర్మ శ్రుతిస్మృతి పారద్రష్ట.[24] ఉమావర్మ అనే రాజు ఔపమన్యుసగోత్రుడూ, బహ్వృచుడూ అయిన హరదత్తుడిని ఆదరించాడు.[25] దేవరాత గోత్రీయుడయిన హరిశ్చంద్రస్వామి నంద ప్రభంజనవర్మ అనే రాజుచేత దేయవాటిగ్రామాన్ని దానంగా పొందాడు.[26] నేటి కోనసీమని పాలించిన పృథ్వీమహారాజు ఉపాధ్యాయకులస్థులూ, అథర్వవేదాధ్యాయులూ అయిన 43 మంది బ్రాహ్మణులకి మాయిపాకగ్రామం దానం చేశాడు[27]

క్రీ. శ. 624–1076 మధ్య పరిపాలన చేసిన వేంగీచాళుక్యులు కూడా వేదవిద్యలని ప్రోత్సహించారు. వారిలో కుబ్జవిష్ణువర్ధనుడు వేదవేదాంగ పురాణేతిహాస ధర్మశాస్త్రాగమవేత్తలూ, గౌతమగోత్రీయులూ, తైత్తిరీయులూ అయిన ఇద్దరు బ్రాహ్మణులకు చీపురుపల్లిగ్రామం దానం చేశాడు.[28] ఈ సోదరుల తాత అయిన బ్రహ్మశర్మ వేదవేదాంగ విదుడు. ఈ రాజే పాటునూకగ్రామ వాస్తవ్యులూ, ఛాందోగ్యశాఖీయులూ అయిన 40 మంది వేదవేత్తలకి కుములూరుగ్రామం దానం చేశాడు.[29] మొదటి జయసింహవల్లభమహారాజు భారద్వాజగోత్రుడూ, తర్కశాస్త్రమునకు సంబంధించిన 70 వ్యాఖ్యానములు తెలిసినవాడూ అయిన గుప్తశర్మకి పెణుకపర్రుగ్రామం దానం చేశాడు.[30] ఈ ప్రతిగృహీత తండ్రి తాతలు ఇద్దరూ ద్వివేదులు, ఈ రాజు మోపర్రు శాసనప్రతిగృహీతా, వత్సగోత్రుడూ అయిన మండశర్మ వేదవేదాంగ పండితుడు.[31] ఈరాజే తన నిడుపర్రుశాసనంద్వారా హారీతగోత్రుడూ, తైత్తిరీయశాఖీయుడూ, రెండు వేదములలోనూ, ఇతిహాస పురాణ ధర్మశాస్త్రాగమోపనిషత్తులలోనూ పండితుడూ అయిన కటిశర్మకు నిడుపర్రు

గ్రామం దానం చేశాడు.[32] ఈ కటిశర్మ తాత పదక్రమానుక్రమ సహితంగా వేదాభ్యాసం చేసినవాడూ, కల్పపురాణేతిహాస ధర్మశాస్త్రోపనిషత్పారంగతుడూను. ఈ జయసింహుని పెదవేగిశాసన ప్రతిగృహీత అయిన సోమశర్మ వేదశాస్త్రవిదుడూ, గార్గ్యగోత్రుడూ, తైత్తిరీయ శాఖీయుడూను.[33] రెండవ విష్ణువర్ధనుని పమిడిముక్కల శాసన ప్రతిగృహీత వత్సగోత్రుడూ, వాజీచరణుడూను.[34] ఈ రాజుచేత పల్లివాడ శాసనాన్ని ప్రతిగ్రహించిన ధ్రువశర్మ వేదవేత్త. అతని తండ్రి దోణిశర్మ వేదవేదాంగ పారగుడు. తాత అయిన ధ్రువశర్మ వేదవేదాంగేతిహాస పురాణ న్యాయ ధర్మశాస్త్రవేత్త; అగ్నిష్టోమ పౌండరీకాది యాగములు చేసినవాడూ, కాశ్యపగోత్ర తైత్తిరీయ శాఖీయుడూను.[35] మంగి మహారాజు చందలూరు గ్రామాన్ని కౌండిన్య గోత్రులూ పంచయజ్ఞ షట్కర్మ నిరతులూ, వేదవిదులూ అయిన ఆరుగురు బ్రాహ్మణులకి దానం చేశాడు.[36] ఈ రాజే కాశ్యపగోత్రాపస్తంబసూత్ర తైత్తిరీయ శాఖీయుడయిన కుండ దోణశర్మ అనే వేదవిదుడికి నూతులపర్రు గ్రామం దానం చేశాడు[37] రెండవ జయసింహుని పెణుకపర్రు దానప్రతిగృహీత ఎర్రదోణశర్మ చతుర్వేదములూ, సర్వశాస్త్రములూ తెలిసినవాడు[38]. మూడవ విష్ణువర్ధనుడు ఆత్రేయగోత్రుడూ హిరణ్యకేశిసూత్రుడూ అయిన కేశవశర్మకి 20 ఖండికల భూమిదానం చేశాడు.[39] ఆ రాజే చతుర్వేది అయిన కేశవశర్మకి పసుపుబర్రు గ్రామం ఇచ్చాడు.[40] ఆ రాజు అరియేరు దానప్రతిగృహీత అయిన సూరిశర్మ అథర్వవేదాధ్యాయీ, పతంజల గోత్రికుడూను.[41] మొదటి విజయాదిత్య మహారాజు భారద్వాజ గోత్రుడయిన మాధవశర్మ పౌత్రుడూ, వేదవేదాంగ పారగుడయిన శివశర్మ పుత్రుడూ, ద్వివేదీ అయిన మాధవశర్మకి భూదానం చేశాడు.[42] ఈ రాజే మాధవ చతుర్వేది అనే పండితుడికి దినకాడు గ్రామం దానం చేశాడు[43]. తుర్క శర్మ త్రివేది పౌత్రుడూ, ద్రోణశర్మ ద్వివేది పుత్రుడూ, అయిన పల్లభట్టారకుడనే వేదవిదుడు రెండవ విజయాదిత్యుని ఈడేరు శాసన ప్రతిగ్రహీత.[44] మూడవ విజయాదిత్యుడు కొండపర్రు, పొడెగు గ్రామములను 105 మంది వేదవిదులకు బ్రహ్మదేయాలుగా ఇచ్చాడు[45]. ఈ మహారాజే సంతగ్రామాన్ని 100 మంది వేదవేత్తలకి దానం చేశాడు.[46] ఈ బ్రాహ్మణులు వేదవేదాంగ పురాణములలోనూ, 64 కళలలోనూ పండితులూ, బ్రహ్మవేత్తలూ అని తెలియవస్తుంది. రెండవ చాళుక్య భీమ మహారాజు వేదవిదుడయిన విద్దమయ్యకి కులమన్నాడు గ్రామంలో కొంత భూమిని దానం చేశాడు[47] ఈ దాన ప్రతిగృహీత విద్దమయ్య మాధవ సోమయాజి మనుమడూ, త్యక్కయక్రమకుని పుత్రుడూ. ఈ విద్దమయ్య పుత్రపౌత్రులు వారగోష్ఠీ సభ్యులూ, పంచవార సభ్యులూను. రెండవ అమ్మరాజు నంబూరు శాసన ప్రతిగృహీత అయిన విష్ణుశర్మ వేదవేదాంగములు తెలిసినవాడనీ, అతని తాత విష్ణుశర్మ సకలకళనూ, ఆగమములూ తెలిసినవాడనీ తెలుస్తుంది. చరిత్ర ప్రసిద్ధుడయిన రాజరాజు నందంపూడి గ్రామాన్ని నారాయణభట్టుకు దానం చేశాడు. ఈ నారాయణభట్టు ఆపస్తంబసూత్ర హారీతగోత్రికుడయిన కంచెన సోమయాజి ప్రపౌత్రుడూ, కంచెనార్యుని పౌత్రుడూ, శౌచాంజనేయుని పుత్రుడూ అని వర్ణింపబడినాడు. ఇతడు సంస్కృత కర్ణాట ప్రాకృతపైశాచికాంధ్రభాషలలో నిపుణుడు. కవిభవజ్రాంకుశుడు.[48]

పైన చెప్పబడిన వివరములనుబట్టి ప్రాచీనాంధ్రదేశంలో సమకాలికమయిన వైదికధర్మోద్ధరణోద్యమం యొక్క ప్రభావం వైదుష్యంమీద ఎంత ప్రబలంగా ఉండిందో తెలియవస్తుంది. నాటి వేదవేదాంగ వేత్తలయిన పండితులు అగ్నివేశ్య, కౌండిన్య, కాశ్యప, గౌతమ, బభురస, మౌద్గల్య, వత్స, మండీరస, స్వర్ణ, కాత్యాయన, కౌసుకాయన, ఔపమన్యు, దేవరాత, భారద్వాజ, హారీత, గార్గ్య, ఆత్రేయ, పతంజల గోత్రములకు చెందినవారు. వారిలో చాలా మంది ఛాందోగ్య తైత్తిరీయశాఖలనూ, ఇతరులు వాజసనేయ, బహ్వృచ శాఖలనూ అభ్యసించినవారు. కొందరు ఆపస్తంబసూత్రులూ, కొందరు వాజీచరణులూ, మరికొందరు హిరణ్యకేశిసూత్రులూ అవి తెలియవస్తుంది.

---

1. M. Rama Rao—Iksvakus of Vijayapuri.
2. E. I. VIII, pp. 233—236.

3. Cf. E. I. pp. 1—10.
4. E. I. XV, pp. 249—252
5. Ibid.
6. I. A. V, pp. 50—53.
7. I. A. IX, pp. 102—108.
8. E. I. VI, pp. 315—319.
9. E. I. IX, pp. 56—59.
10. E. I. IV, pp. 193—198, XVII, pp. 337—339.
11. C. P. I. of MER 1931—32.
12. E. I I, pp. 1—10.
13. E. I. VIII, pp 233—236.
14. E. I. XV, pp. 249—252,
15. E. I. VIII, pp. 159—163.
16. E. I. XXIV, 296—303.
17. Ibid pp. 137—143.
18. I. A. IX, pp. 102—103.
19. E. I. IX, pp. 55—59.
20. JAHRS V, pp. 21—32.
21. C. P. 7 of MER 1914; E. I. XVII, pp. 334—337; E. I. XII, pp. 133—136.
22. C. P. 24 of MER 1934—35.
23. C. P. 1 of MER 1931—32.
24. E. I. XXIII, pp. 88—99.
25. E. I. XII, pp. 4—6.
26. I. A. XIII, pp. 48—50.
27. JBBRAS XVI, pp. 204.
28. I. A. XX, pp. 15—18.
29. E. I. IX, pp. 317—319.
30. I. A. XIII, pp. 107—138.
31. C. P. 9 of MER 1919—20.
32. E. I. XVIII, pp. 55—58.
33. E. I XIX, pp. 256—261.
34. C. P. 15 of MER 1917.
35. I. A. VII, pp. 91—92.
36. E. I. VIII, pp. 236—241.
37. I. A. XX, pp. 104—106.
38. E. I. XVIII, pp. 313—316.
39. Ibid pp. 58—60.
40. C. P. 9 of MER 1913—14.
41. C. P. 4 of MER 1923—24.
42. C. P. 19 of MER 1934—35.
43. C. P. 20 of MER 1934—35.
44. E. I. V. pp. 118—121.
45. C. P. 3 of MER 1908—09.
46. JAHRS V, pp. 101—116.
47. E. I. V, pp. 134—139.
48. E. I. IV, pp. 300—309.



# పద్మప్రాభృతకము

సంస్కృత మూలము :
**మహాకవి శూద్రకుడు**

తెలుగుసేత :
**శ్రీ బాలాంత్రపు రజనీకాంతరావు**

[‘చతుర్భాణీ’ అనే పేరుతో పాట్నాలోని శివపురీ ముద్రాక్షరశాలవారు 1922లో నాలుగు సంస్కృత భాణాలను కలిపి ఒక పుస్తకంగా ప్రచురించారు. భాణం సంస్కృతంలోని దశవిధరూపకాలలో ఒకటి. ఒకే పాత్రతో సాగే ఏకాంక రూపకం భాణం. కథ చిన్న ఏకాంకనాటికకి సరిపోయేదిగా ఉండే ఒకే సంఘటన. కథలో వచ్చే మిగిలిన పాత్రలకు సంభాషణ లుండే, రంగంమీద కనబడేపాత్ర ‘ఓహో అలా అంటున్నావా?’ అని ఆ మాటలను తిరిగి చెప్పాలి ఆ పాత్రలలాగ అభినయించడంకూడా ఉంటుంది. ఈ ‘చతుర్భాణీ’లో శూద్రకుడు రచించిన పద్మప్రాభృతకమూ, వరరుచి రచించిన ఉభయాభిసారికా, ఈశ్వరదత్తుని ధూర్తవిటసంవాదమూ, శ్యామిలకుని పాదతాడితకమూ—అనే నాలుగు భాణాలు ఉన్నాయి. ఈ నాలుగింటిని పరిష్కరించి సంపాదకులుగా ఉపోద్ఘాతం వ్రాసిన వారు మాననీయులూ కీర్తిశేషులూ అయిన మానవల్లి రామకృష్ణకవిగారు. ఈ నాలుగింటిలో దేనినీకూడా ఇంతవరకూ ఎవరూ అనువదించలేదు.

వసంతసేన నాయికగాగల మృచ్ఛకటికం నాటకంద్వారా దానిని రచించిన శూద్రకుడిపేరు మన దేశంలోనే కాకుండా సంస్కృత సాహిత్యం ప్రచారం పొందిన రష్యా, అమెరికా, ఇంగ్లాండ్, జర్మనీ మొదలైన పాశ్చాత్య దేశాలలోకూడా చాలా ఘనంగా ప్రసిద్ధి పొందింది. ఈ పద్మప్రాభృతకంతప్ప శూద్రకుడిపేరుమీద మరొక రచన ఏదీ లేదు.

శూద్రకుడే సాహసాంకుడు లేక విక్రమార్కుడు అనే బిరుదుగల ఒక మహారాజు అనికూడా కొన్ని ప్రాచీన సంస్కృత గ్రంథాలలో కనబడుతుంది. శూద్రకుడి సాహస గాథలను చారణులు గానం చేసేవారట. ఇతడు భాసమహాకవికి కొంచెం తరవాతివాడూ, కాళిదాసుకు పూర్వుడూ అయి ఉండాలని పరిశోధకుల నిర్ణయం. దండి అవంతిసుందరికథలోను, సోమదేవుడి కథాసరిత్సాగరంలోను, శూద్రకుడి కథా, ప్రశంసా కనబడతాయి. పాశ్చాత్య పండితుడు ఎ. బెరిడేల్ కీత్‌గారు తన గ్రంథంలో శూద్రకుడు అనే పేరు పుక్కిటి పురాణాలుగాను, జానపద గాథలుగాను చెప్పుకునే కథలలోని ఒక ప్రాచీన మహారాజుదనీ, భాసకాళిదాసులకు మధ్యకాలంలో వెలసిన ఒక అజ్ఞాతకవి తనకు ప్రాచీనత్వం ఆపాదించుకోడానికి శూద్రకుడనే పేరు పెట్టుకున్నట్లు తోస్తుందని వ్రాశారు. భాసుడు వ్రాసిన దరిద్రచారుదత్తము అనే కథలోని చారుదత్తుడు, వసంతసేన, సంస్థానక శ్యాలకుడు మున్నగు పాత్రలను తీసుకుని ముఖ్య కథకు ఉపాంగముగా, పాలకరాజు చెరలో ఉంచిన ఆర్యకుడు ప్రజావిప్లవంద్వారా పాలకుని రాజ్యాన్ని ఆక్రమించుకోడమూ, చారుదత్తుడికి సహాయం చెయ్యడమూ అనే సంఘటనలను జోడించి, మృచ్ఛకటికాన్ని శూద్రకుడు సొంత నాటకంగా దిద్ది తీర్చాడు. ఇది చాలా ఉదాత్తంగా చెయ్యడంచేత గ్రంథచౌర్యం అనడానికి మొహమాటపడ్డారు పండితులు. వసంతసేనవంటి సౌజన్యవతియైన వేశ్యలు, తరుణ వేశ్యా తపస్వినులు ఒకరిద్దరి ప్రశంస పద్మప్రాభృతకంలో ఉంది. అందుచేత అతని పేరు శూద్రకుడు అయినా, కాకపోయినా మృచ్ఛకటిక రచయితే పద్మప్రాభృతకంకూడా రచించి ఉండవచ్చని చెప్పగలం. పద్మప్రాభృతకంలో ఒక తరుణ వేశ్యాతపస్విని ప్రేమించిన మౌర్య రాకుమారుడు చంద్రోదయుడు సామంతులపైకి దండయాత్రకు వెళ్ళిన ప్రశంస ఉంది. అప్పటికి, బౌద్ధసన్యాసులలో సాంఘికంగా నైతికంగా ఒక క్షీణదశవచ్చి, సమాజంలో తిరిగి ఆర్య సంప్రదాయాలవైపు మొగ్గుదల కనబడుతున్నట్లు పద్మ

ప్రాభృతకాన్నిబట్టి తెలుస్తుంది. వీటినిబట్టి, మృచ్ఛకటికమూ, పద్మప్రాభృతకమూ రచించిన కవి శూద్రకుడైనా, ఎవరైనా, క్రీస్తుకు సుమారు ఒక శతాబ్దం అటో ఇటో ఉండినట్లు ఊహించవచ్చు

మిగిలిన ప్రసిద్ధ సంస్కృత నాటకాలలోలాగ ఏ పౌరాణికగాథో, ఏ ధీరోదాత్త రాజకుమారుని కథో కాక, ప్రకరణమూ, ప్రహసనమూ, వీధి, భాణమూ అనే రూపకాలలోని ఇతివృత్తము మధ్యతరగతి మనుష్యులకుచెంది, సాంఘికమై ఉంటుంది. గ్రంథకర్త కాలపు సాంఘికజీవితం అందులో ప్రతిబింబితమౌతుంది. మృచ్ఛకటికం ప్రకరణం అనే రూపక రీతికి చెందినది. పద్మప్రాభృతకం భాణము.

భాణాలలో రంగంమీదికి వచ్చే పాత్ర విటుడు. వీడు కథానాయకుడుమాత్రంకాడు. కథానాయకుడికీ, నాయికకీ, ఆబాల్యమిత్రుడు; నర్మసచివుని వంటి వాడు. కథానాయకుడు ఎటువంటి వాడంటే—

'పెద్దయింటివాడు, పేరుపడినవాడు,
వింతలేక నవ్వు వెలయు మోము,
మాట, రూపు, వయసు, మంచివై ఒడలెత్తు
మరుడు'.........

అయిఉంటాడు అయితే నడతచేత ధూర్తాచార్యుడూ శఠుడూ అనిపించుకుని, సకల కళాశాస్త్రపారంగతుడయికూడా, వేశ్యాస్త్రీలోలుడూ, పైగా, ఒకతె తర్వాత ఒకతెగా అందమూ చందమూ యౌవనమూ పస్నెవాసీగల కొత్తనాయికలను (అంతా సామాన్యలే) ప్రేమించి ప్రేమింపజేసుకునే ధీర లలితుడు. అతడుకాని, నాయికగాని, రంగంమీదికి రాకుండానే విటుని సంభాషణద్వారా వారికథ ద్యోతకం అవుతుంది. పాత్ర—విటుడూ; రంగం—రాజవీథి; రాజవీథిగుండా పూలబంగళీదాటి, వేశ్యా వీథిలోని నాయికగృహోద్యానందాకా ఈ భాణం లోని దృశ్యం సాగుతుంది. అసలు కథ ప్రారంభించడానికి ముందు ప్రస్తావన - దానిలో సూత్రధారుడు వచ్చి, శివప్రార్థనచేసి, శృంగార రసానికి ఉద్దీపన కారియైన వసంత ఋతువును వర్ణించి, నిష్క్రమిస్తాడు. ఆ తర్వాత అసలు భాణం.]

## (నాందికాగానే సూత్రధారుడు ప్రవేశించి)

(నాంది కాగానే సూత్రధారుడు ప్రవేశించి)

తనయనుగ్రహమున క్రోధధాటిచేత
కాంతల విలాసమూర్తియు, కామదేవు
కాంతతర తను వొదవంగ కారణమగు
నట్టిదైవమ్ము రుద్రున కగుత జయము!

అంతేకాదు.,

(గేయం) పూయునవే కురవకాలు, కూయును కోకిలలు,
చివురులతోపూవులతో చెలగు నశోకాలు,
అదె అళిరొద, అదే మావిపూలతావి మోయు గాలి,
కదలునదే ధనుర్ధారి, మదనమూర్తి కాననాల!

మరీ యేమంటే,

(గేయం) తరురసాల మత్తిలినకోకిలలు
పక్షిసంఘముల వాద్యగోష్ఠితో పాటపాడు నదిగో!
వనములోని అంతఃపురనారి
వాతాచార్యోపదేశమున లత నాట్యమాడు నదిగో!
పల్లవాగ్రతర్జనుల కొనలతో
ప్రసవ ముదితతరుపంక్తి నర్తకిని తిద్దితీర్చెడు నదే!
అదె వచ్చె వసంత శ్రీమంతుడు
అలముకొన్న సిహారతుషారము లంతరించిన వదే!

వేరు చూచినా, నడుమ చూచినా,
చివురు చూచినా, మాకు చూచినా,
లోభివాని లోగుట్టు పోలికను
విరియబూచిన దశోక మంతటా!

ఓహో ఇది—

కొసరి కూయు పుంస్కోకిలాలతో,
కుంద చూతముల సిందువారముల కుసుమరాజితో
మదన మదముతో, మలయ వీచితో
యౌవన హృదయరంజని వసంతము.

(నిష్క్రమిస్తాడు.)

—(ఇది స్థాపన)—

(అప్పుడు విటుడు పవేశిస్తాడు.)

విటుడు: బలేబలే! ఎంత బాగుంది! సంవత్సరం అనే విలాస పురుషుడికి చలికాలపు ముసలితనంలో సర్వమూ ఉడిగిపోయాయి; అయినా, హిమరసాయనం సేవించడం చేత మళ్లీ వసంతకిశోరత్వం లభించింది! ఇప్పు డెలా ఉందంటే,

(గేయం) చిపురుకొన లల్లాడ చెట్లు నృత్తముసేయ
పూచిన తీవలు పొందు జవ్వనము!
తిలకతరు శిరసుపై కోకిలే క్రొమ్ముడి,
కుంద కుసుమముపైని కూర్చున్న తుమ్మెద
సుందరి క్రీగంటి చూపు తలపించు!
అప్పుడే తలసూపు అరుదు గుబ్బలకన్నె
అనిపించు ఆకుపచ్చని తమ్మి మొగ్గ!
వలపు చెలగాటాన అలిసి చెమర్చిన
జవరాలిస్తనముల సంస్పర్శనోతె
కొంటెగా వీచు ఆమని కోడెగాలి!

ఈలాగే మన్మథ బాణాలు తగిలి తగిలి మోటువారి బలిశాడీ వసంతుడు. ఏమంటే, దేవదత్తతోపోయి యవ్వనోత్సవం జరుపుకున్న కర్ణీపుత్రుడైన ఆచార్య మూలదేవుడికి ఆమె చెల్లెలు దేవసేన అప్పుడే కుర్రతనం వదిలి,వయస్సు పొంగి పుష్పవతియైన లేమావికొమ్మగాను వసంతుడు తనలాగ ఆకొమ్మను దాటిపోయే మదనభ్రమరుడుగాను కనిపిస్తున్నారు. లేకపోతే కర్ణీపుత్రుడికి తప్పుతుందా ఋతుప్రభావం? నెయ్యీ తేనే కలిపిన అన్నం కూడా పక్కని నంచుకోడాని కుంటే బాగా రుచిస్తుంది. అందుచేతనే దేవదత్తతో సాంగత్యం అనే మధుపానానికి పక్కనంజుడు కూరలాంటిది దాని చెల్లెలి పొత్తు. కుర్రవయస్సు మూలాన నవ్వూ, నవనవా, అందమూతప్ప అది ఏ కూరాలేని కూడులాంటిదయినా కన్నెపిల్లతో కలయికంటే మరో విలక్షణమైన ఆనందాన్నిస్తుంది కదా అని కోరుకుంటున్నాడేమో అనిపిస్తోంది నాకు.

అమ్మబాబోయ్! ఈ మదనజ్వరం అనేది అంత తేలికగా కనబడుతున్నా మహచెడ్డ బలమైనది. ఏమంటే,దాని మూలాన్నే కదా, అనేక శాస్త్రాల్లో గడితేరిన మహాబుద్ధిశాలీ, అన్ని కళలలోని మంచీ చెడ్డా ఆకళించుకొన్న వాడూ, నెరజాణలైన యువతులతో కామతంత్రానికి సూత్రధారిత్వం నెరపగలవాడూ అయిన ఆచార్య మూలదేవుడికి కూడా ఎటువంటి అవస్థ పట్టిందంటే

కునుకు పట్టక వాది కను లెఱ్ఱబారినవి;
ప్రత్యూషశశిలాగె పాలిపోయెను మొగము;
ఇంద్రియములన్నింట ఎడతెగని తాపమ్ము;
తలపుల ఆవులింతల పొరలు దేహమ్ము;
ఆమని, జాబిల్లి, పూవూల, సంగీత
చందనాదుల తనకు సంతాపమే హెచ్చె!

పోనీ, దేవసేనను గురించి గనక, దీనికంత ఆశ్చర్య పడనక్కరలేదు. శ్లాఘ్య మన్మథ మనోరథ క్షేత్రం ఏదయ్యా అంటే ఆ పిల్లే! దాని రూపయవ్వన లావణ్యాలు కర్ణీపుత్రుడికి పిచ్చెత్తించడానికి అన్ని విధాలా తగినవే! అదెలాగంటే,

ఇఱ్ఱి చూడ్కులు, కొరుకు డొక్కింత వడక
కోరికల రేపు పెదవులు, చేరెడేసి
చెంపల మొగమ్ము, కొనలారి చెలగురొమ్ము;
పూలతీవ జంటనుబోలు కేలుదోయి;
కనియు కనరాని నూగారు మొనయు కడుపు;
ఎచటనుండి ఏర్పడె శ్రోణి యెరుగరాదు
తలపు తీపెక్కునై జమ్ముదాపలేక.,
ఇన్నిటికి పిచ్చియెత్తదో యెవరికైన!

(ముందుకి సాగి)

అతని కిప్పుడు దేవసేనవల్ల ఒళ్లు హూనమయేటంత మదనజ్వరం వచ్చింది. అందుకని ఆమెని కలుసుకునే ఆశతో హార తాలవృంత చందనాది శైత్యోపచారాలద్వారా ప్రాణాలు నిలబెట్టుకుని పడుకుని ఎలాగో కాలక్షేపం చేస్తున్నాడు. ఈనాడు తెల్లవారకముందే పుష్పాంజలికుడనే దేవదత్త పరిచారకుడు వచ్చి, నమస్కరించి కర్ణీపుత్రుడితో ఇలా అన్నాడు.

"అయ్యా, నమస్కారం, మాయక్క దేవదత్త తమతో ఇలా మనవి చెయ్యమంది! 'తరచు వస్తూండక పోవడం చేత అయ్యవారు నామన్ననకి దూర మవుతున్నారు. మా చెల్లెలు దేవసేనేమో ఎందుకో సుస్తీగా ఉంది. దాని మీది యావకొద్దీ నాకు బెంగగా ఉంది. అయినా,ఇదిగో ఇప్పుడే వద్దామనుకుంటున్నాను' అని."

అప్పుడు పుష్పాంజలికుడికి జవాబుచెప్పి, వాణ్ణి సాగనంపిన కర్ణీపుత్రుడు నన్ను పట్టుకుని ఇలా అన్నాడు. 'ఒరేయి శశా, నువ్వు కూడా విన్నావు కదా — ఇప్పుడే వద్దామనుకుంటున్నానన్న దాని సందేశం? క్షేమం తెలిసికోడానికి నాదగ్గరకి దేవదత్త వచ్చినప్పుడు ఒంటరిగా ఉండే దేవసేన ఆంతర్యం కనుక్కొని దాని బెంగకి కారణం ఏమిటో తేల్చుకోడానికి ఇదే సమయం! అందు కిదే నీకు నా నమస్కారం, దేవసేన మూలాన్ని గుండెలో పిడిదాకా దూసుకుపోయిన కామబాణశల్యాన్ని పైకి లాగివేయడానికి దేవానాంప్రియుడవైన నీవే అన్ని విధాలా తగుదువు' — అని.

నవ్వుతూ వెంటబడ్డ నే నన్నాను గదా: 'ధూర్తాచార్యా, పగటి దివిటీ వెలిగిస్తావెందుకోయ్? నాకు తెలియదనుకున్నావా మీయిద్దరిమధ్యా చూపుల్లో నడిచిన మూకరాయబారాల సంగతి? అదీకాక నేనేవ రనుకున్నావు? మూలదేవుడిమిత్రుడైన శశుడిని. దాన్ని బుట్టలో వెయ్యకుండా తిరిగిరావడమేనా' అని చెప్పి బయలు దేరాను.

అందుకని, రాజమార్గాన ఎదురయ్యే స్నేహితులను పలకరించుకుంటూ వెళ్లాలి. దేవదత్తపక్కని లేకుండా ఒంటరిగా ఉన్న దేవసేనను కలుసుకోడాని కిదే మార్గం!

(ముందుకి సాగి)

ఓహోహో! వసుంధరావధువుకి జంబూద్వీపం వదనకపోలం అయితే ఆ కపోలం మీద చిత్రించిన పత్రలేఖనమూ అనిపించే అవంతిసుందరి యీ ఉజ్జయిని అపరలక్ష్మీదేవిలా విరాజిల్లుతోంది.

(గేయం) వీనులవిందగు వేదపాఠములు,
వీధులరథాశ్వగజధనుర్ధ్వనులు,
విద్వచ్చర్చల శ్రావ్య దృశ్యములు,
చతుస్సాగర ప్రోత్థిత విపణులు,
గీతవాద్యములు, ద్యూత హాస్యములు,
సకల కలానురక్తవిటగాథలు
క్రీడా పక్షుల ఆకలి కేకలు,
గలగలమను గాజుల గృహపంక్తులు!
(ముందుకు సాగి)

సరే, వెళ్ళేపని పర్యవసానం ఎలా ఉంటుందో తెలియడానికి ఏదైనా శకునం పరిశీలిద్దాం. (అంటూయిటూ చూసి.)

ఆఁ. ఇడుగో—కవిత్వకండూతిగల కాత్యాయనగోత్రుడు, శారద్వతపుత్రుడు, సారస్వతభద్రుడు, తనయింటి ముని వాకిట్లో ఆలోచిస్తూ కూచుని, పాలిపోయిన చెయ్యి ముందుకు చాపి, ఒళ్ళూ, చూపులూ, బ్రమముడీ అదేపనిగా కదుపుతూ, తన్మయంగా తకిలీ తిప్పడంలో మునిగిపోయి ఉన్నాడు. ఈరోజుల్లో తమ తెలివి తేటల ప్రవాహానికి అడ్డు తగిలే కాస్త బుర్రఉన్న స్నేహితుడిమీదకూడా కవులు అసూయ పడడం కద్దు కనుక ఈసరస్వతీలతను పూచిన వాక్పుష్పాలను నాచెవుల్లో చెరివికోకుండా వెళ్లడమే నాకర్తవ్యం. అయినా, వీణ్ణి ఒకసారి పలకరించి చూస్తాను.

ఏమోయ్, కాత్యాయన, ఎందుకో గాలినెమరువేస్తున్నట్లున్నావేం? ఏమిటంటావు? 'నన్ను కవిత్వపు దయ్యం పటుకోలేదులే' అనా! అలా అనకు. పూర్వ కవులు లొడిగిపారేసిన చెప్పుల లాటి పాతమాటలతో గొడారి పని చేసి చేసి గుడ్డివాడవై, దారితప్పిన ఆలమంద పాలికాపులాగా కొత్తమార్గం ఎలా తొక్కుతావు? అయితే నువ్వు కూర్చిన గేయానికి వస్తువేమిటి? ఏమిటంటావు? 'ఇదిగో ప్రస్తుతం ఇలా రమణీయంగా వ్యాపించిన వసంతఋతువును గురించే వ్రాశా' ననా? ఏదీ వినిపిస్తావూ? 'ఆఁ. ఆ గోడమీద వ్రాసిఉంది చదువుకో' అంటావా! సరే!

(గేయం) 'పకపక నవ్వే పువ్వులతో మరి
మదమెక్కిన మధుకరాలతో,
తెగకూసే కోకిలతో సిరియై
చెమటలోడు అవతారముతో,
చల్లగ సాగు సమీరముతో
కర్కశుడై పైకొను కామునితో,
మైమరపించుచు ఈకాలము
వగలేమి యెరుంగని ముద్దరాలినే
త్రోయగలదు కాముని కౌగిలికి
చేయగలదు నెరజాణ దూతికల
వేయిమంది ననునయ నిపుణులుగా!'

బలే బాగుందోయ్! నీకుశుభం! మిత్రమా, సత్పుత్రుడిలాగ ఈ గేయం నీకు కీర్తిని ప్రసాదించుగాక. వాగ్దోషాలను కెలికే విమర్శకుల బారినుండి నీకు శ్రీరామరక్ష!... ఆఁ. ఎవరా నవ్వింది? ఓహో! పేరమర్దుడయిన దర్దరకుడు కూడా ఉన్నాడే యిక్కడ? ఏమిటోయ్ దర్దరక నీకు నవ్వు తెప్పించే విషయం? ఏమంటావు? 'వాగీశ్వరుడిని వాక్కులతో అర్చించడ మేమిటి? సముద్రుడికి నీళ్లతో అర్ఘ్యం ఇచ్చినట్లు?' అంటావా? వోరి నీకు జ్ఞానం లేనట్లుంది. 'పూవులఋతువైన వసంతుడికి పుష్పోపహారం ఏమిటని నీవిమర్శ' అవునా? ను వ్విదెప్పుడూ వినలేదా?

'దీపికలతోడ సూర్యు, నబ్ధిని జలమ్ము
తోడ, పూజింత్రు, పూవులతో వసంతు;
నటులె భగవాను వాగీశు నర్చనమ్ము
వాక్కులను పేర్చి సేయగా వలయు మనకు!' అని.

సరేలే – తెలిసింది. నీస్వభావం పోనిచ్చుకున్నావుకావు. ఇంతకంటె యేమిటోయ్ నీకు కావలసిన మర్యాద? నీవంటి పరభృతాల ప్రలాపాలకు వసంతకాలమే తగును. నువ్వలాగే వర్ధిల్లు నాయనా! నేను వెడతాను. (ముందుకు నడిచి, చూసి) ఇదిగో—ఇక్కడ నీడోకడు - విపులామాత్యుడు—కామదత్తా ప్రాకృతకావ్యం ద్వారా పేరుపడ్డవాడు. వేశ్యయింటి నుంచి బయట పడ్డం మూలాన్ని కాబోలు ముఖం దించుకు చక్కా పోతున్నాడు. ఆఁ తెలిసింది. మూలదేవుడికి దేవదత్త సౌభాగ్యం సంక్రమించడం తన శిష్యురాలు విపులకి పెద్ద అవమానంగా భావించి, చిన్నపుచ్చుకుని కోపంతో దహించుకు పోతున్నాడు. కానియ్యి, వీడిని కాస్త ఏడిపిస్తూ పలకరించాలి.

ఏమిటోయ్— కలువపేస్తాలను మేలుకొలపని పగటి చంద్రుడిలాగ దాటుకు పోతున్నావేం? నిన్నొక టడగనా?

కళలు, విజ్ఞాన సంపత్తి, కలిగి గర్వ
శీలయౌ విపులమతి నేడేల సఖుడ,
అంత అత్యంతధీర కానట్లు మిగుల
దిగులుతో విన్నవోయిన వగను దోచు?

ఏమి టంటున్నావు? 'నష్టపోయినసొమ్ము ఎవడికి దొరికింది; ఆచార్యమూలదేవుడు నీకు తెలుసు కదా' అనా? ఆ దేవదత్త పొందులో చిక్కుకున్న తనకు కూడా హృదయం నీశిష్యురాలు విపుల మీదకి పోయింది. అవునా? ఏమిటంటావు? అది కూడా అతని మోసమేనంటావా? సరేలే, ప్రణయకోపం తీర్చడానికి అతని దగ్గరికి పోయిన నీశిష్యురాలు విపులని మందలింపక పోయిన నీపెద్దమనిషితరహా నే ననాలో!

వాన, బురద, చేరి వరదయౌ నది శుభ్ర
పరచుటకు శరత్తు వచ్చునెట్లు?
విసరునట్లు కాదె వెర్రిగా ఏడిచలి
వేళ వ్యర్థముగను విసనకర్ర?

ఏమిటంటావు? అదేలాగనా? మిత్రమా—విను. మొన్ననే కదోయి నాతో కలిసి కర్ణిపుత్రుడు విపులను అనునయించ

డానికి వెళ్ళాడు? అప్పుడు తను గుమ్మం ఇవతల నిలబడిపోయి దానికోసం అంచనా వెయ్యడానికి నన్ను పంపించాడు. అప్పుడు నేను ఆమెని చేరి ప్రియవచనాలతో ఒక ఉపన్యాసం దంచాను. ఆమె అసూయవల్ల అందగించిన చూపులతో 'ఎందుకీ ప్రయాస' అంటూ ముఖం అవతలికి తిప్పుకుంది, నేను నవ్వుతాలుగా ఇలా అన్నాను:

(గేయం) 'నీతో యెవ రేమన్నారో నీ ప్రత్యుత్తర మెవరిమాటకో—
అది స్మరించి వెన్నెల లొలుకవె నీవదనచంద్రుద్వారా కలికీ!
ప్రసన్నురాలగు నిన్ను చూడ నా ప్రణయ మ్మతివేలమ్మగునే
క్రుద్ధభుజంగిని నీదు భ్రుకుటి నా గుండియ గగ్గోలు
పరచునే!'

—ఆ తరువాత ఆ అవంతిసుందరితో ఆమెసఖి ఇలాఅంది:

(గేయం) కనుబొమ్మ లలలొచు కదలాడు నెందుకో
కందు రోషాన ముఖ మెందుకో!
పెదవి వేడెక్కు నిట్టూర్పుతో ప్రియసఖుడు
పజ్జ చేరిన కూడ పలుకాడ వెందుకో!
కలికి ప్రోడతనంపు గరువమ్ముతో నేల
శత్రుత్వము వహింతు సౌభాగ్యమునమించి!
మానవే కోపమ్ము మానినీ సర్వమ్ము
హెచ్చులాగిన తంతి యెరుగవే తెగు నంచు!

అటుపైని కర్ణిపుత్రుడు కూడా అక్కడికి చేరుకోడంతో ఆ సమావేశం సార్థకం అయింది. అప్పుడు సానునయంగా కాళ్ళ మీద పడిన కర్ణిపుత్రుడు గడగడలాడేట్లుగా ఆమె యిలా అంది:

(గేయం) ఆడిజగడము, వచ్చినాడవీడకు, నిన్ను
తరిమివేయుటె మిగుల తగు నామెకు!
మే మెంతసేపు నీకు విరామ సమయాల
మెరమెచ్చు మాటల వినోదమునకె!
ఆశ, కుతుక మ్మణగి, ఆకులవమ్మె మన
స్సల్లకల్లోలపరుపంగ దగునా?
ఇంత యేదైన చేదగుమందు సేవింప
ఈడ సుస్వాగత మ్మెయనగునా?

ఏమంటావు? 'అటయితే మరి దాని పొగరుకు తగ్గట్టు చివాట్లు పెట్టాలి-వెడతా'నంటావా? నీ యిష్టం. అది చెప్పినట్లు వినాలని దీవిస్తున్నా! నేనింక బయలుదేరతాను. (పరిక్రమించి) చచ్చాంరా దేవుడా! మళ్లీ మనం పోయేపనికి విఘ్నం వచ్చేట్టుందే!

ఇదుగో— వీడు పాణిని తమ్ముడూ నాగజాతివాడూ అయిన దత్తకలశి నామధేయుడైన వైయాకరణి నా యెదుట పడ్డాడు. వీడి వ్యాకరణ శబ్దాల వలలో నుంచి ఏ చిక్కూలేకుండా బయటపడాలి. ఏదో తొందరలో ఉన్నట్టున్నాడు. వాదంలో చావు దెబ్బ తినడమే వీడికి తగ్గ శాస్తి. ఏమంటే వాదపుకండూతిగల వీడి వాక్కు ఏమాత్రం తట్టినా కోవెల ఘంటలాగ మోగుతుంది. గణికాప్రియు డీ ఆసామి. వీడు నూపురసేన కూతురు రశనావతికను పిలుస్తున్నాడు. పాపం! ఏనుగు గున్న నోట చిక్కిన వీణ అనిపిస్తుంది నాకు ఆ కోమలంగా ఉండే రశనావతికను చూస్తే! ఆఁ. ఇదిగో— గట్టిగా ఏదో నాతో అనబోతున్నాడు... ఏమిటన్నావ్— (అపి సుఖ మశయిష్ఠాః) 'సుఖంగా పండుకొంటివా'' అనా?— వ్యాకరణ పాండిత్యం వెలగబెడుతున్నాడు— ఏంగతి?— సరే కానీ, నేను తిన్నంతా పెట్టాలి వీడికి! స్వాగతం అక్షరాలబందెలదొడ్డికి! మిత్రమా దత్తకలశీ! తొందరలో ఉన్నట్టున్నావు. ఏదో కుశలమే అనుకో. ఏమిటి అంటున్నావు? 'బలిభుక్కులయిన కాకులచేత సంఘాతబలివలె— కాతంత్ర వ్యాకరణ పండితులతోటి వివాదంలో దెబ్బ తిన్నవాణ్ణి నేను' అనా! పాపం, కాకీ గుడ్లగూబల సంవాదం అయిందన్నమాట. మిత్రమా చూస్తే నీ రెక్కలేమీ దెబ్బ తిన్నట్లు లేనందుకు సంతోషం! ఏమిటంటావ్?— ''ఇప్పుడు నాకు వైయాకరణ కులటాపుత్రులైన కాతంత్రికులపై కక్ష యేమిటో'' అంటావా! నువ్వలాగే ఉండు, నే వెడతాను— ఏమంటావు? ''ఆగు అక్కడ— ఎక్కడికోయి — నీ సంచిబీర్చ ?— ఏం దుర్దూషుపై పోతావా? (అంటే ''ఎక్కడికి వెడదామని నీ ఉద్దేశం? ఏం పారిపోదామని చూస్తున్నావా?') అనా!— ప్యుర్రోయి— నన్ను రక్షించు. ఈ కాష్ఠ ప్రహార నిష్ఠుర వాక్కుల పిడుగులతో నన్ను చంపడం తగదు నీకు! వ్యావహారిక భాషలో మాటాడు నాయనా! చెవుల్లో పడినంతనే విషమయి పోయి ఏనుగులు కూడా మింగడానికి వీలులేని నీ వైయాకరణ వాక్పిండాలపాలు చెయ్యకు నన్ను. ఏమిటీ?— ''అనేక వాచాల వృషభాలను చితు వేసి సముపార్జించిన అనేక ధాతు శతఘ్నియైన ఈ వాక్శక్తిని విడిచిపెట్టి, మాధుర్య కోమలమైన స్త్రీ శరీరంలాగా ఎలా చెయ్యను''— అంటావా? ఎంత దిక్కు మాలిన వాడి వయావు?

''స్త్రీ[illegible]లాపమునన్ వరప్రణయినీ
సమ్మోహసంబందు కా
ర్యారంభంబుల యందు, ప్రాకృత జన
వ్యాహారమందెన్నడే (న్)
స్వారస్యశ్రుతిసౌఖ్యఘాతుకముతో
శబ్దాక్షరాల్ గూర్చుచో
హారంబౌ ప్రసవాలు జుట్టుముడి ము
శ్లో గుచ్చు చందంబగున్''

ఏమిటంటావ్— ''ఆ సానికూతురుందే, దాని మీద నా శబ్ద కుఠారాలు ప్రయోగించేసరికి దానికి వల్లమాలిన కోపం వచ్చిం''దంటావా! ఎవతె అ సానికూతురు ?— ''ప్రియురాలి పేరు ఎవడు చెపుతా'' డంటావా! (ఆలోచించి) ఆఁ. తెలిసిందిలే. రశనావతిక కాదూ! ఎంత కష్టం! మామిడి చెట్లలో తిరిగే కోకిల మోటయిన మారేడు చెట్టు నాశ్రయించిందంటే కష్టం కాదూ? నవ్వుకోడాని కింతకంటె పరిహాస విషయం ఉంటుందా? నవ్వుకుందాం.

మిత్రవూ దత్తకలశీ! స్వభావం చేత దక్షిణ నాయకుడివైన నీకు ఈ కామినీవిరక్తి యెలా కలిగిందో వినాలనుంది నాకు. కాస్త విపులంగా చెపుతావూ?—ఏమన్నావూ? "సర్వదినం వాటి తెల్లవారుఝామున హవిస్సులను వ్రేలుస్తున్న నా దగ్గరకు ఆ సానికూతురు సాభిప్రాయంగా చేరుకుని హవిస్సుల కమ్మదనం వాసన చూస్తున్నదానిలా పక్కనే కూర్చుంది. అప్పుడు నేను దానితో అన్నాను గదా. 'వోసి కులం తక్కువదానా, హవిస్సులను వ్రేలుస్తున్న నన్ను ముట్టకోకుమా'" అని.

బలే, ఇదే కాబోలు దుష గాంధర్వం అంటే! కామినీ సంపర్కగ్రహణం చాలా సుకుమార కార్యం లే. ఈ కలహం కూడా ప్రయోజనకారే. తెలివి తక్కువవాడా, నిన్ను కామించి వచ్చిన ఆడదానికి విరక్తి పుట్టించడమూ? కష్ట శబ్ద నిష్ఠురాలూ, వ్యాకరణవిస్ఫురితాలూ అయిన నీ మాటలతో ఆడవాళ్లు పారెత్తిపోతారు. నువ్విదివరకు ఇది వినలేదా?—

> "పొత్తు కోరిన సుకుమార చిత్త, తీయ
> నగు నుడుల లాలనీయయౌ మగువ చెవుల
> నింపు నేకాంతమున పల్కు నిష్ఠురవల
> కొరవితో రక్తి వీణ మీటు రసికుండు!

రసనావతిక ఎప్పుడూ అసాధ్యమైన పనులే చేస్తూంటుంది. అది వీణ్ణి భిక్షుణ్ణి చేసుకుందా సరి, లేదా దాని కర్మ!! ఆ! మిత్రవూ దత్తకలశీ! చెవుల తుప్పు వదిలించేశావ్!— నీకు శుభం! నేను పోతాను. (పరిక్రమించి)

ఇడుగో ఇక్కడ మరో అడివి మాలోకం దాపరించాడు. వీడు ధర్మాసనికుడి కొడుకు; పేరు పవిత్రకుడూ, చేసేవి చాటుగా దొంగి తిరుగుళ్లు! రాజమార్గాన్న పోయే యెరుగున్నవాళ్ల కంట పడకుండా ఉంచడానికి కాబోలు తడి బట్టలు కట్టుకుని, అవయవాలన్నీ ముడుచుకుని, రెండు వేళ్లతో ముకుపుటాలను మూసుకుని, నాలుగు దారుల కూడలిలో శివాలయపు అరుగుమీద కూచున్నాడు. వీడి తపస్సు చూస్తే నవ్వొస్తోంది. ఏమంటే మత్తకాశిని కూతురు వారుణిక అనే బంధకి బాహుబంధాలలో చిక్కాడని విన్నాను. అందుకే కాబోలు వీడిప్పుడు దిగులుగా ఉన్నాడు. కుండ పగల గొట్టినట్లు వీడి వడతి ఒట్టబయలు చెయ్యాలి.

ఏమోయ్ పవిత్రకా, ఏమిటలా ఉక్క నేలపై తాబేలులాగా తిష్టవేశావ్! ఏమంటావ్? 'రాజమార్గంలో సులువుగా గుర్తుపట్టే వాళ్లని తప్పించుకోడానికి'— అంటావా? అయితే పాపం, గుర్తు పట్టలేని వాళ్లని మాత్రమే తప్పించుకుంటున్నావనుకుంటాను. వారుణీ జఘన పాత్రమైన గంగాతీర్థంలాగ పరమ పవిత్రమైన వాడవు కదోయి?

ఏమిటీ?— "అదేం కాదనా?" గొల్లపేటలోనటోయ్ పెరుగమ్మడం? దొంగల మధ్యనే దొంగతనమా? ఏమంటావూ? 'క్షమించు బాబూ, నీ వేగుల వాళ్లు బలే నేర్పరు'లంటావా! ఎవరి వేగుల వాళ్లు? వేగుల వాళ్లెక్కడ? సూర్యుడు చీకట్లు చొచ్చుకు పోవడానికి దీపంతో పనేమిటోయ్? నాకు వేగుల వాళ్లతో పనిలేదు. ఇటువంటి వ్యవహారాలలో నేను సహస్ర చక్షువునే! కనక, నీ కపటప్రచారకంచుకం తీసి అవతలపారెయ్. ఆకారానికి పెద్ద మనిషి, చేసేదంతా అనాచారం! ఏమోయ్ సజ్జనసహపాఠీ! విటవృత్తి పేరుతో పిశాచంలా ఇతరుల్ని హింసించడమూ— వేశ్యాసంగమూ ఇవి విరుద్ధాచారాలుగానూ నిషిద్ధ వస్తుభోజనంగానూ అనిపిస్తాయి నాకు. పరహింసకి అలవాటు పడిపోయి, పట్టుకారుతో విరజాజి పూలు కోస్తున్నావు. ఏమిటంటావు? "విభవాల కన్ని విధాలా దూరంగా ఉంటున్నా" నంటావా? పేరుకి ఉపవాసవూ చాటున తినేది పాయసవూ అన్నట్లు ఎవడోయి ఇవన్నీ పాటించేది? ఆ — ఏమిటీ? "నీ కిష్టమైతే నన్ను నీ శిష్యుడుగా తయారు చేసుకో" అనా! సంతోషం., అలా దారిలోకి రా! విటత్వం స్వీకరించడానికే నిశ్చయించుకుంటే, వేశ్యాస్త్రీని ప్రణయంతో బాధించడం అనే అబద్ధపు ముసుగు చించిపారెయ్! విట శబ్దానికి గొంతెత్తి జయం పలుకు!

ఏమిటీ— 'ప్రణామాలా?' ఇయ్యవలసిందేదో ఇయ్యడం అయింది. ఇంక స్వేచ్ఛగా ఏ నిర్బంధమూ లేకుండా మసులుకో. ఇప్పు డిదిగో నీ కాశీర్వాదం!

> 'ఓడు వసనమ్ము పైకెత్తి యొడలు కప్పు;
> సడల మొలనూలు; విడకోక ముడి జడినను
> బడయకేల్; దాచు రొమ్ముల నడిమిలోయ,
> వళుల యెడమున గల నాభిదళము, రెండు
> చేతులను జాపి; సిగ్గున చేష్టలుడుగు;
> వద్దు వద్దోయి వదు లనుచు వనరు వనిత
> శయ్య జేర్చి సుఖోదిత సన్య భాగ్య
> మందగదవోయి నిర్భరానందసిద్ధి!'

ఏమిటంటావ్— 'నా వెర్రి కుదిరింది; ఇది నా మందికే' — అనా? అయితే యిప్పుడు ఆచార్యుడు కోరే దక్షిణ కూడా ఇదే! ఆ? 'ఇదిగో అంజలి' అంటావా? అదన్నిసార్లు వెచ్చపెడితే యెలా? సరే లే. ఇప్పటికి శిష్యులు సిద్ధం ఆయారు మాకు. నువ్విప్పుడు ఆచార్యుడివే కాని శిష్యుడివి కావు. సగర్వంగా, నిరాటంకంగా నీ యిష్టం వచ్చినట్లల్లా తిరుగు. నే వెడతాను.

హాయి హాయి, పువ్వు లంగడిలోగిటిలో నుంచి వెలువడుతూ, రకరకాల సువాసనలు మేళవించి, వసంత మధ్యాహ్న స్వేదాపహారమైన నన్ను తాకి, స్వాగతం చెపుతున్న విపణి వాయువు ద్వారా పుష్ప వీధి చేరుకున్నా నన్నమాట. నానా కుసుమ సముదాయం అంగప్రత్యంగములుగా రూపుదాల్చిన వసంత వధువులాగ ఉంది ఈ పుష్పవీధి.

(గేయం) విరిసిన తామర సిరిగల మోము,
విరజాజి మొగ్గలే పలువరుస,
కలువలే కన్నులు!
ఎర్రమదిపూ వదరు వాతెర,

తుమ్మెద రొద పలుకు తేనె తేట,
విరిచెండ్లు రొమ్ములు!
సిగచుట్టు దండలే నగలు,
పేర్చిన ప్రసవాలే వసనాలు,
మాలలు మేఖలలు!
ఈ రీతిగ పూవులతో అమరిన
నారీ రూపు ధరియించు సుమవిపణి
వసంతుని రాణియే!

ఈ రకరకాల కుసుమపరిమళాలకు లొంగిపోయిన హృదయంతో నేను చూసి చూసి ఈ పుష్ప వీథిని దాటిపోలేక పోతున్నాను కాబోలు! (పరిక్రమించి)

ఇదిగో మరొక పరిహాస వస్తువు. వీడిపేరు మృదంగ వాసులకుడు — వీడు పురాణ నాటకాలలో విటుడు. 'భావ జరద్గవుడు' (అంటే ముసలి ఆబోతుబావ) అని గణికాజనం ద్వారా బిరుదు పొందినవాడు; సుకుమార గాయకుడైన ఆర్య నాగదత్తుడి ఇంట్లోంచి బైలు దేరాడు. తలంటుకోసం నూనె రాచుకుని వణుకుతున్న వీడు చింకిపాత చుట్ట బెట్టుకున్నాడు.

ఈ ఆసామికి 'సర్వసఖు'డనే 'బిరుదు కూడాను. పలకరించకుండా వీడిని దాటి పోడానికి వీలులేదు. వీణ్ణి ఎగతాళి చెయ్యాలి. ఏం బావ, జరద్గవా, ముసలితనం బాగా పంట పండుతోంది గదా.... ఏమిటన్నావ్? 'ముదిసిన పాములాగ ముసలితనపు కుబుసం వదల గొట్టు కుంటున్నాను' — అనా? ప్రాణాలతోసహా యేమో, అని పిస్తోంది నాకు. ఏ వయినా, బావది కొత్త యౌవనంలే! ఏ మాయచేతోగాని యౌవనకాయకల్పం సిద్ధించింది నీకు! ఎలాగంటే —

వర్ణలేప ప్రభూతయౌవ్వన వికాస
వస్తుసంఛన్న కృతకము మస్తకమ్ము,
గొరగని కపోల పాళిని, కొరుకుడువడి
తరుగు నోష్ఠమ్ము మీదను, నెరయు మోము
కలిగి నీ దేహ మీ స్నాన కళ వెలుంగు
వెల్లచే ప్రాతయిల్లు శోభిల్లునటులు!

ఏమిటీ అంటున్నావు? 'పాతకల్లు బాగా మూరాలి' అనా? అదీ బావగారి మనోరథం! సర్వథా — త్రిఫలగోక్షుర లోహచూర్ణ సమృద్ధి రస్తు! నే వెడతాను. (పరిక్రమించి)

అరే- వీడెవడు? అనుకోకుండా నేను కనబడ్డానని, ద్యూతగృహందేవిడీముందు వంగి, రాతి స్తంభం వెనకాల నక్కాడు. (చూసి) సరే — తెలిసింది; వీడు శైషిలకుడు. నా కంట బడకుండా ఉండడంలో వీడి ఉద్దేశ్య మేమిటో! మాలతిక చెలికత్తెను తాను పట్టుకున్నందుకు ఇదవుతున్నాడా? ఐతేకానీ! ఎగతాళి చేసి వీడిలోతు కనుక్కోవాలి.

ఏమోయ్ బ్రాహ్మణబ్బాయి! వెన్నెల్ని తప్పించుకుని గొడుగులో తలదాచుకున్నట్లు స్నేహితుణ్ణి తప్పించుకుని స్తంభం చాటున చేరా వెందుకు? — బయటపడి నవ్వుతున్నాడు— ఏమిటంటావ్? 'సుహృత్కర్ణధారికి స్వాగతం' అనా? ఎక్కడి కర్ణధారిత్వమోయ్- నీ ద్వంద్వ సాహసాల నుంచి నన్ను బహిష్కృతుణ్ణి చేశాక? ఏమంటావ్? 'అలా కాదు' అనా? ఎంగిలి మెతుకుల మేట వద్దొద్దు సుమా! శ్రీషిలకుడి యింట్లో శాక్య భిక్షుకి యెలా తిప్ప వేసిందో అంతా తెలిసిపోయిందిలే. నీ మీద మరులుగొన్న పూలదండలల్లేవాడి కూతురు మాలతిక దాన్నే కాదూ దౌత్యానికి పంపింది? దానికి కూడా అప్పటికి నువ్వు రుచి చూడని రూప యవ్వన లావణ్యాలు గల కమ్మని మాంసం కుతి దీరడానికి నువ్వే కావలసి వచ్చావు-ఏమంత లాభసాటి కాదా? ఏమిటంటావ్? 'అందని కోరికలు పొందేలోగా అందిన సుఖాలను త్యాగం చెయ్యడం ఏమంత పురుష లక్షణం కాదు; నిప్పు వెదకడానికి దీపం కావాలా?' అనా? బలే బాగాచేశావ్. ఇది కొంచెం వివరంగా చెప్పకపోతే ఈ రహస్యం కాస్తా బట్ట బయలవుతుంది. ఇప్పుడే వివరంగా చెప్పాలి. ఏమిటన్నావు?

'తన అనాచారాన్ని ఎవడు బట్టబయలు చేసుకుంటాడు! క్లుప్తంగా విను మరి. నన్ను చటాలున పట్టుకుని అదే ఇలా అంది.

'నేల విడిచి యెగురు నీ స్వభావమ్ముచే
శఠుడ మోసగింప జాలు దీవు;
మాన్యమైన బ్రదుకు మాది, దూతికనోయి,
స్థిరత లేనివాడ తెగువ వలదు;
చుట్ట బెట్టునొప్పి; చొచ్చితి విజనపు
చోటు; వద్దు; కరుణ చూడుమోయి,
ప్రియుడ వదలు మోయి, వేరెవ్వరో అదే
వచ్చువారు లోన చొచ్చువారు!'— అని'

బలే! మృదంగం లేకుండా భామకలాపం! ఇలాంటి సంధి చ్ఛేదాలను పురస్కరించుకునే వాసిష్ఠీపుత్రుడు విటశబ్ద లక్షణాన్ని స్థిరంగా నిర్ణయించాడు. మిత్రమా, నీ సౌభాగ్యం వర్ధిల్లు గాక, నే వెడతాను. (పరిక్రమించి) – ఓహో! సర్వాతిథి సన్నివేశ స్థలమైన వేశ్యాగృహం సమీపించాను.— ఇది -

పంచశరు నిల్లు, జూదరి పాఠశాల,
మాయలకు నిక్క, వంచనామయుల చక్కి,
ద్రవ్యహీనులకిట స్వాగతము హుళక్కి,
వెతలు కూడ రమ్యమయేటి వేశ్య గృహము!

(ముందుకు సాగి)— వీ డెవడో మాసిన దుప్పటి ముసుగులో సర్వాంగాలూ ముడుచుకుని వేశ్యాగృహంలో నుంచి త్వర త్వరగా నిష్క్రమిస్తున్నాడు. అరే, తొందరలో ముసుగుపాటు నుంచి కాషాయపు కొంగు బైటపడింది. ఆ. వాడే. ధర్మారణ్యంలో ఉండే సంఘిలకుడు అనేదొంగ సన్యాసి. కృ. కృ. ఇటువంటి అర్థంలేని బోడిగుండ్ల దొంగ సన్యాసులచేత మైలపడిపోతున్న బుద్ధ ధర్మాని కెటువంటి దుర్గతి పట్టిందో! కాకుల యెంగిలికి తీర్థ జలం మైలపడటం లేదూ? అలాగే! ఓహో. వీడు నన్ను చూసి కూడా ముసుగు ముఖంపైకి లాక్కుని చక్కా పోతున్నాడు. సరే— నా వాగ్బాణాలు తగులకుండా ఎలా వెడతాడు? — చెప్పు

తాను! (పాత్రను ఉద్దేశించి) ఏహోయ్ విహార భేతాళ! పగటికి ఇంకే గుడ్లగూబలా ఇప్పుడు పోతున్నా వెక్కడికి? ఏ వంటావు? 'ఇప్పుడే విహారం నుంచి వస్తున్నా'నవా? భదంతుల వారి విహార శీలం భూతకాలానికి చెందిందని మాకు తెలుసులే. వేశ్యా వాటిక లోని దిగుడు బావి దగ్గిర ఇప్పుడే వాలిన కొంగలాగ దొంగ అడుగులువేస్తూ పోతావేం? ఏదో చీకటితప్పు చేసి చెంప కడుక్కోడం కాదుగదా?

ఏఁ వన్నావు? 'తల్లి పోయి యేడుస్తున్న సంఘదాసిని బుద్ధవచనాలతో ఊరడిద్దామని' వచ్చానంటావా? మదన భ్రమ చేత శుద్ధాచమనం లాగ నీ వల్ల బుద్ధ వచనం భ్రష్టం అయింది. ఎంత కష్టం!

కాంక్ష చేగాని యాదృచ్ఛికముగగాని
వేశ్యయిలు సొచ్చు సౌగత భిక్షుకుండు
జైన సూత్రాల నోంకార శబ్దము ఎలె
విఫలుడే గాని సుంతైన వెలుగబోడు!

ఏఁవిటన్నావు? 'క్షమించు బాబు, సకల జీవులయందూ ప్రసన్న చిత్తంతో వుండాలికదా మరి'అనా! ఆ! ఆ! తగినట్లుగానే నిత్యప్రసన్నుడైన భదంతుడికి అనగా నీకు తృష్ణావిచ్ఛిత్తి ద్వారా పరినిర్వాణం లభిస్తుంది...వీడు చేతులుజోడిస్తున్నాడు... ఏఁవిటంటావ్? 'మంచిది, దాన్ని వదిలిపెడతా'ననా! సరే వృథా శ్రమెందుకు గాని, నీకు మోక్షం ఏనాడూ దుర్లభమే. ఏఁవిటీ? 'వెడతా న్నేను, అకాలభోజనం కూడా మానుకోవలసి వస్తుం'దనా! హి, హి, అంతా ముందే అయింది. ఈఅవ శిష్టమే పంచశిక్షాపరుడైన భిక్షువుగారి కాలభోజనాన్ని దాట బెడుతోంది. నాశనమయిపో నాకేం! వ్యర్థంగా తల గొరిగించు కున్న వాడికి పై తిరుగుళ్ల వల్ల సిగ్గేఁవిటి? సాక్షాత్ బుద్ధుడవు! చెడ్డావుపో—......ఇప్పుఁడీ చెడిపోయిన శాక్య భిక్షువుదర్శనంవల్ల మైలపడ్డ కళ్లు కడుక్కోవాలి.

(పరిక్రమించి).

బలేబలే! దీన్ని చూడడానికి విటజనులకళ్లు పుణ్యం చేసుకున్నాయని చెప్పాలి. ఇదిగో వసంతవతి కూతురు వన రాణి—అందానికి అచ్చంగా వనరాణే! ఒంటినిండా పూలతో ముస్తాబయి, పూజాసామగ్రితో కామునిగుడిలోనుంచి దిగు తోంది. శ్రద్ధగా పుష్పాలంకరణ చేసుకు దిగడంచూస్తే ఇది ప్రియుణ్ణి కలుసుకోడానికి వెడుతోందనుకుంటాను. దీనికి ఇచ్చకాలతో ఎదురుకో లిస్తాను. (పాత్రనుద్దేశించి) పిల్లా వనరాణి! వసంతకుసుమాలంకరణ చేసుకున్న నీకు అతిథిలోపం ఉండదులే. ! ఏఁవిటి నువ్వంటావ్? 'అయ్యవారికి స్వాగతం, చేమోడ్పు' అనా! దాక్షిణ్య పల్లవుణ్ణి అనుగ్రహించావన్న మాట! మరి అయితే, ఇప్పుడే వచ్చిన వసంతఋతువు నీవంటిపైని కొలువు తీర్చినట్టుంది. 'ఏఁవిటి? ఎలా'గనా! విను:

(గేయం) 'కుంద కురవకము లందందు గురువిందలును,
పొందించి జడపాయలందు,
అందముగ ధమ్మిల్లమం దశోకము, సిందువార
హార మురమ్మునందు,
మొనదేరు మావిమొగ్గలను కదలాడు కెంజివురు
లను చెరివి చెవులందు,
నిండుదోసిట పూలదండతో సుందరీ
నిలుతు వామనిగ నాముందు!'

ఏఁవిటన్నావ్ ? 'ఇదిగో బహుమాన'మనా! సరి. నువ్వి చ్చేది నీ వంటిమీదనే ఉండనీ, సమయం వచ్చినప్పుడు తీసుకుందాం. నీకు సుఖమౌగాక — వెడుతున్నాను.

ఓహో! ఇది శ్రీహరమ్యుడి ప్రియురాలు తాంబూలసేన యిల్లు. వాడు ఎప్పుడూ దాని పక్కనే తిష్ఠవేస్తాడు. లోపలికి వెడదామా? (ఆలోచించి) పలకరించకుండా వెళ్లలేనే! లోపలికి వెడతాను. (వెళ్లి) ఎవరైనా ఉన్నారా లోపల? —నేనూ శశుణ్ణి. ఈ యింటి నేస్తాన్ని. అరే అదిగో తాంబూలసేన—నన్ను మర్యాద చెయ్యడానికే కాబోలు త్వరత్వరగా అంగలు వేసు కుంటూ తొందరలో జారే పైట సర్దుకుంటూ పెద్దగుమ్మం దాటివస్తోంది. అంత పెద్ద మర్యాదెందుకో! కాదుకాదు—నేను లోపలికి రావడం ఇష్టంలేక బైటినుంచే మర్యాదచేసి పంపేద్దా మని ఇవతలికి వస్తోంది. ఆ వచ్చే తీరు చూస్తే ప్రణయ కలాపంలోనుంచి అప్పుడే బయటపడ్డట్టు తోస్తుంది. ఈ శ్రీహరమ్యుడు పట్టపగటి ప్రణయ కళాపట్టభద్రుడు. కానీ. దీ న్నేడిపించాలి. ఏం తాంబూలసేన! ఏకంగా అంత దయ చూపించేస్తున్నావ్. ఏఁవిటి? ప్రణయకలాపపు సందిటిలోనుంచి బయటపడ్డ ఆయాసంలోనా 'స్వాగతం ప్రియవ్వాయ స్యుడికి' అంటున్నావు? విసుగు లేకుండా ఉంటే విసనకర్ర తీసుకురా! వ్యాయామం వల్ల అలిసినట్టు కనబడుతున్నావు! పిల్లా కుశలమేనా? ఏవంటావు? 'ఏం చిక్కిపోలేదు లెండి.' అనా? అదిగో ప్రియజన పరిష్వంగంలో కట్టుబడి కరిగిపోయిన వక్షస్థలం! నిష్ఠీక టడుగుతాను. మావాడు శ్రీహరమ్యుడి నిరం తర నిశావిహారాలతో తనివితీరకనా పగలు కూడా వాడిని, విశ్రాంతి తీసుకోనియ్యవు? పొద్దుటా సాయంత్రమూ హోమాలు సాగుతున్నట్లేనా? ఏఁవిటంటావు? 'అదేం లేదు పోదురూ! ఎప్పుడూ ఎదటివాళ్లని ఎగతాళి చెయ్యడమే బావ గారి పని' అనా! ఓసి అతితెలివిదానా—వినలేదా — ఆకారంపైని వేసిన ముసుగుకూడా ఆ ఆకారాన్నే ధరిస్తుందని? 'ఎలాగో చెప్పం'డంటావా! విను, కథలో తేడా ఉంటుందనుకోను — ఎలాగంటే,

తునియలైరాలు పత్రలేఖనపు ననలు,
కరగి తరిగెడు తిలకమ్ము కాటుకయును
చెవులలోలకులం జిక్కు చెంపకురులు
కందు పెదవులు, అలసిన కనులుచూడ,
ఇంతి పగటికాలక్షేప మెవ రెరుగరు?

ఏఁవంటావు? 'ఇప్పుడే నిద్రపోయి లేచాను. ఇంకా యేమేమి ఊహించుకుంటున్నారు బావగా'రనా? సరే! జ్ఞాపకం

వచ్చింది. ఇందులో తెలిసిపోకుండా ఊహించుకోవలసింది కొంచెమైనా ఉంటేగా? ఏమంటే?

ఎట్టి తీయని కల ప్రసాదించె నీకు
కాయ మందిట్టె దంతనఖక్షతాల?
ప్రీతు లగుదురు స్వర్గస్థ పితరులైన
వెలది, అపసవ్యముగ పైటవేయు కతన!
ఎట్టితొందరలోనొ గుర్తింప డెట్టి
మూఢు డాశిల్పి నీపాదములను రెంట
నెడమకాలి పాదుకలనే తొడగజేసె!

పిల్లా, పెనిమిటితో సహా దొరికిపోయావ్, ఎక్కడికి పోగల వింక? అరే, (విని) ఇది లోపలికిపోయి మొగుడితో పగలబడి నవ్వుతోంది. (చెవి అటుపెట్టి) అడుగో ప్రహీరవ్యు డేదో అంటున్నాడు. 'ఏమోయ్, ధూర్తాచార్య, లోపలికిరావచ్చు' అని! అబ్బాయి, నడుస్తున్న కామరథంకాడికొడగొడతాడా యెవడైనా? ఇదేవిధంగా అవిరతకామోత్సవోస్తు! గార్గి గారబ్బాయి, వెళ్ళొస్తాను. (పరిక్రమించి)

ఆఁ? వీథి గుమ్మంముందు నిలబడి ఎవరుచెప్మా దేవతలకు ఉపాహారా లిస్తోం దీవిడ?

బరువగుమోము, వంతవసి
వాడెడు, కాటుకలేని కళ్ళుదు
మ్మురలెడు కట్టుచీర, పెన
యున్చమురంటనికేశపాశమున్,
అరచేయివైపు జారు వల
యాల్, పువులెండిన దండతోరమున్
తరుణ వియోగినీ తపన తన్వి
తనుత్వముపెంచు తద్దయున్!

ఓ ! ఈవిడ ఆ భాండీరసేన కూతురు కుముద్వతి! పాపం! ఈమె తపన్సులో పడిపోయి, పోల్చడానికి వీల్లేకుండా మారిపోయింది. లేకపోతే, వేశ్యవాటికకి విరుద్ధమైన వియోగినీ వ్రతం మరెవత్తెకి సాగుతుంది.? ఆఁ తెలిసింది. ఈమెకి వౌర్య కుమారుడైన చంద్రోదయుడిపై ప్రేమ అని విన్నాను. ఆ బుద్ధిశాలి సామంతుర్ని దండించే ప్రయత్నంలో ఉన్నాడు. పాపం! సరిగ్గా సరిపోయింది. చంద్రోదయ విరహంవల్ల కుముద్వతి శోభ తగ్గిపోయింది. కులవధువు లీమె దగ్గర ఎంతైనా నేర్చుకోవాలి. ఆమేడ చాందినీ మదురుపై నిలబడి రాలే బలిపిండాలవైపు అపేక్షగా చూస్తున్న కాకిని ఆవిడ సాదరంగా పిలుస్తూ అంటోంది!

'మేడ చాందిని మదురుపై మెడను చాచి
నిలిచి శ్రద్ధగా ఉపహారముల భుజించు
అతిథివర! కాకమా! భద్ర మగును గాక!
ఇందు నే జీవము ధరించి కుందుచుండ
అరిగె నా ప్రియు డెటకొ నిత్యప్రవాసి—
తా దిరిగి వచ్చువరకును తదితరమగు
ద్వారతోరణమును చేర దగదటోయి!

ప్రియతముని గూడి శోకమ్ము వీడి నీకు
'పెట్టగలనోయి తృప్తిగా పెరుగుబువ్వ!'

ఆహాహా! ఎంతకపటంలేని అనురాగం! రాజప్రేమకు పాత్రురాలైన ఈమెను అపహాస్యం చెయ్యడానికి కుదరదు. ఈవిడకు మహారాణి మేలిముసుగు సంప్రాప్తించునుగాక, నేనిలా కనబడకుండా తప్పించుకుపోతాను. (పరిక్రమించి)

ఏమిటీ—ఇప్పుడీ కుడివైపు తోటలో నగలసవ్వడికి బెద రిన పక్షుల కలకలంలాగ వినబడుతోంది. సరే, ఇదిగో! తోటద్వారం తెరుచుకుంది. చూస్తాను. (చూసి) హాయిహాయి! కన్నుల పండువుగా ఉందే! అదుగో పాంచాలదాసి కూతురు ప్రియంగుయష్టిక! తమ నితంబ సౌభాగ్యగర్వంతో యవ్వనం వచ్చిన రాకుమారుల నెందరినో వలలో వేసికోగల నానాహావభావ విలాసాలుగల సఖీజనంతో కలిసి ఈ ప్రియంగుయష్టిక కందుకకేళిలో మునిగి ఉంది. ఎలాగంటే—

ఆడు కెంజాయవ్రేళుల హస్తములను
యెర్రమణిశిలబంతి పైకెత్తు నాతి
తన చివురు కొనలతో గోయ తన విరులనె
ఎ త్తెరగు నీపలత వోలె ఎసక మెసగె!

ఈమె సందర్శనం వల్ల కలిగిన లాభం ఇంతాఅంతా కాదు. సరే, అసలే సంతుష్టులై ఉన్నవారికి అమృతంవల్ల ఎంత తృప్తి అని అడగడమేమిటి? ఇక ఆమెతో మాటాడ తాను. (చేరుకుని)

పిల్లాఁ, ప్రియంగుయష్టికా, ఏమిటిలా కందుక క్రీడ పేరు చెప్పి, నీ చెలికత్తెల నృత్తకౌశలాన్ని ప్రదర్శిస్తున్నావే! ఎలా నిల్చున్న పాటున మాటకు జవాబు చెప్పి మరీ ఆడు తోందో! ఓహో, బంతి ఉత్పాతాలను పరిచారికలు లెక్కిం చడం బట్టి ఆమె చెలికత్తెలతో ఏదో పందెం వేసి ఆడు తోందనుకుంటాను. పందెం వేస్తే ఎంత రంజుగా ఉంటుందో ఆట! అదే పనిగా వంగడం, లేవడం, గిర్రున తిరగడం, ఎగిరి పడడం, ఇంకొకళ్ళున్నచో టాక్రమించడం, పరుగులెత్తడం— ఇలాటి చిత్రమైన కదలికలతో మనోహరమైన దృశ్యం మావంటివాళ్లకి యాదృచ్ఛికంగా లభిస్తుంది. అదంతా, యెందుకు? ఆ వాయువు చేష్ట లెలా ఉన్నాయి? ఆ సుడి తిర గడం, వెనక్కి మళ్లడం, పైకీ కిందకీ యెగిరెగిరి పడడం, పదేపదే వీచడం, లోపలికి చొరబడాలని బట్టల్ని ఎగరగొట్టడం ఇవన్నీ చూస్తే వాయువుకి కూడా వీళ్లంటే పిచ్చెక్కి వెంట బడ్డట్టు తోస్తుంది. వాయువయితే మహాబలుడు. అందుకే యౌవనం పీట వేసుకున్న పయోధరాల బరువు చేత సన్నబడిన ఆమె నడుమును పోల్చాలంటే, అది ఒక్క పిడికిట్లో చిక్కే దయినా స్వతహాగా దుర్బలుడి నయిన నాకు భయం! అయితే, ఆమెను చూస్తూ ఉపేక్షించి ఉరుకోలేను. చెపుతాను. ఏమోయ్, యౌవనోద్రేకంలో నీ పొకువూర్యానికి విరుద్ధమైన పని చేస్తున్నావు. అవు అవు అంతటితో! ఆరే వికే చెపుతూంట!

సాపం! ఆమె ఉత్సాహం ఎలా తగ్గిపోయిందో! ఇలా ఊరడిస్తాను:

(గేయం)

> కుండబంతిలా యెగిరెగిరి పడే
> కుండలాలుకలదానా
> బలముగ వెలువడు బంతిపాటులో
> వెర్రియెత్తు నెరజాణా,
> విసరి పరచు కేల్దోయిదాన,
> తూలిపడే కురుల విరులదానా
> గిరగిర సుడితిరిగే వేగములో
> కదలుమొలనూలు కలదానా,
> ఉరుకు రొమ్ములకు జడిసి సన్నగిలు
> నడుముదాన, క్షేమ మగుత నీకు!

ఈమె పూర్తిగా నూరుసార్లు కొట్టింది. పిల్లా, ప్రియంగుయష్టికా, సఖులపై విజయం సాధించినందుకు సంతోషంతో వర్ధిల్లు! ఏమిటాంవ్? 'అయ్యగారికి స్వాగతం, శుభంగా వచ్చి నన్ను గెలిపించినందుకు—' అనా! పిల్లా, నీ దర్శనం వల్ల ఎంతో లాభం కలిగింది. మమ్మల్ని మరిచిపోకు, వెళ్ళొస్తాం. (పరిక్రమిస్తాడు)

ఇదిగో మరొక సుహృద్వినోదగృహం. ఇది చంద్రధరుడి ప్రియురాలైన శోణదాసి, నాగరికకూతురిల్లు. లోపలికి వెడతాను. పలకరించకుండా వెళ్ళడానికి వీల్లేదు. (చూసి) అరే, ఇదుగో శోణదాసి, ఏదో ఆలోచిస్తూ వీధి గుమ్మం మీదే కూచుంది. ఇది ఏంచెప్మా ఇప్పుడిలా నగలన్నీ తీసేసి శరీరలావణ్యం బోసిగా కనబడుతూ, మాసిన చీర సగం వంటిని మాత్రం చుట్టబెట్టుకుని, నుదుటి పైని రక్త చందనం పూసుకుని తలపైని తెల్లని గుడ్డ పట్టీతో, ముఖం దించుకుని, తొడపై ఉంచిన వీణ మీద వేతులో కాస్త కాస్త మోగిస్తూ, కాకలీమంద్రమధురస్వరంతో కైశికాశ్రయ గీతి ఆలపిస్తూ కూచుంది. ఇది యెందుకో బెంగ పెట్టుకుని ఉండాలి. కైశికాశ్రయగానానికి పర్యాయపదం శోకగీతం! ఏమిటిది—చంద్రోదయం అయాక దీని దగ్గర ప్రణయ కలహం అన్నమాటే వినలేదే యెన్నడూ! ప్రియుడి రాక ఆగిపోవడంతో విరహతాపంలో పడి ఉంటుంది. సరే, ఎగతాళి చేస్తాను దీన్ని. పిల్లా, శోణదాసి, ఏమిటిది? వేశ్యాతపస్విని వేషం ధరించావు? చంద్రధరుడేమైనా అపరాధం చేశాడా? ఏమిటలా కన్నీళ్ళేనా జవాబు? కన్నీళ్ళాపుకో, అంతా చెప్పు. ఏమిటంటావు? 'పట్టుదలతో కోపంతో ఒక స్నేహితురాలే నాకు కష్టం కలిగించింది.' అనా? ఏమిటీ అందరి కంటే నీకు ఇష్టురాలైననేస్తం, నీకు, శోణదాసికే ఇబ్బంది కలిగించిందా? ఏమిటీ అంటావు? 'దాని దురాలోచన మూలాన్నే ఈ ఆపదను ఎదుర్కోవలసి వచ్చింది' అనా! ఎంత తెలివి తక్కువదానివి? ఇలా చెప్పలేకపోయావా?!

> 'చలికి గురితప్పె కాబోలు, క్షణముకూడ
> కోప మోదూతి, సైపగానోప నుమ్మ!
> ఇట్టి ఘోరమ్ము నాకు కల్గించి మదను
> పోల్కి నెట్లు లనార్యవై కుల్కెదిపుడు?
> జారి కరవైన నీ స్వాతిశయపు సందుల
> కడరి వ్రీలు మేఖల హస్తమందుదాల్తు!'

అని చెప్పాలిసింది.

ఏమంటావు? 'ఇప్పుడా స్వాతిశయానికి మదనుడే ఓడిపోయాడు; ఆ సౌభాగ్యం పులుముకుని నీ స్నేహితుడే ఇప్పుడు స్తంభించాడనా? అయితే మరి యిప్పుడు అతని దగ్గరికి పరుగన పోవేల? సుందరి—చాల్చాలు నీ సిగ్గు;

(గేయం)

> ఊర్పు తలవాల్చి ఊహల సంచరింతేల
> పర్యాకులములాయె బాష్పలతో కనులు!
> నగల తొడుగుల వీడినను సుందరీ నీవు
> సహజ లావణ్యమున చక్కగా తోచెదవు;
> ఏ పక్షమునకు చెందని యుచ్చకములతో
> వలపించుకొనవేల నిమిరి ప్రియతము కేల!
> ముద్దరాలా వలపు ముమ్మరమౌ వేళ
> మానావమానాల మాట తలపగనేల?

ఏమిటంటావు? 'స్త్రీకి పురుషుడు అనునయింప తగ్గవాడే. అయితే పౌరుషం ఇంతా అంతా కాదు' అనా? అలాకాదు. మంచి మనస్సు దానవు, గంగా సాగరానికి పోవడం లేదు గద. చాల్చాల్లే నీ సిగ్గు. లేదా నీ ఆశతో నువ్వుండు. నేను చంద్రధరుడినే దారికి తీసుకొస్తా. ఇన్ని మాటలెందుకు. మీయెడబాటుచేత రగుల్కొన్న మదనాగ్నిహోత్రాన్ని నా సాయకమ్ముతో ఎగసన తోస్తాను. సరేనా!... ఆగకుండా వచ్చే కన్నీళ్ళలో ఆమె నవ్వెలా ఉందో! వర్షర్తు జ్యోత్స్నా దర్శనం అంటే ఇదే! అమ్మాయి, చాల్చాలు—ఏడవ్వద్దు. దగ్గరలోనే శుభం అవుతుంది. ఏమిటంటావు? 'బావగారి ప్రతిజ్ఞ నెరవేర్చుకోవాలి' అంటావా! పొద్దుటే తెలుసుకుంటావులే! కన్నీళ్ళు ఆగిపోయాయి కదా!..సరే, వెడతాను.

(పరిక్రమిస్తాడు)

ఓహో! ఇక్కడ మరో శృంగార ప్రకరణం సిద్ధంగా ఉంది. ఈమె నాగరిక కూతురు. మగధసుందరి అనే గణిక. శరచ్చంద్రికలాటి చల్లని ముఖం. నల్లగా మెత్తగా ఉంగరాలు చుట్టుకుని, పరిమళంతో మెరిసిపోయే కేశపాశంతో, విచ్చిన కలువ పూవుల్లా కదలాడే కనోయితో, పగడం కంటె యెర్రనైన పెదవుల సంపర్కం వల్ల లేత కెంజాయ విరజిమ్మే పలుకుదురుతో, జాజి మొగ్గలలా తెల్లనై తిన్ననైన పలువరుసతో, ఊరిన చెక్కిళ్ళతో, ఉరువైన పిరుదులతో, వీధి గుమ్మపు తలుపుని సగం ఆవరించిన శరీరంతో కుడిచేతి రెండు వేళ్లతో తెరకొంగు పట్టుకుని, ఎడమ కాలి పాదంతో నేల మీద తాళం వేస్తూ, రక్తి కలిగే స్వరాలతో మధురమైన తంత్రీ వాద్యం పైని అసంకీర్ణ వర్ణాలతో మోగించే ఆలం

కారాలతో, చెవుల కింపైన షడ్జగ్రామంలో ప్రియుడి మీద చతుష్పద గేయాన్ని పాడుతూ, కళ్ళూ కనుబొమలూ కదిలిస్తూ, ఊహించే భావాలను అభినయిస్తూ ఎవడో అదృష్టవంతుడి రాకను ఎదురు చూస్తూ నుంచుంది. ఓహో! ఎవడయ్యా అతడు — దేవేంద్రుడి లాగ ఆహూతుడవుతున్నాడు, ఈమె ప్రణయ యజ్ఞానికి! సరే, ఆమెనే అడుగుతాను! వేశ్యాగగనంలో విద్యుల్లతలా మెరిసే ఓ అమ్మాయి! నిన్నొకటడగనా?

'తెల్లనై నల్లనై చివరలందెర్రనై
వాలురెప్పల కొనల వికసించు దృష్టితో
ఈ చంద్రముఖి ధన్యు డెవని రాకను గోరి
నిలిచియున్నది బహిర్ముఖియై ?'

అరే, పాపం, చెదరగొట్టిన లేడిపిల్లలా బెదరు చూపులతో ఆమె నావైపు చూస్తోంది. ఏఁవిటంటావు? 'వద్దు వద్దులాగ. నేను బ్రహ్మచారిణిని. వసంతుణ్ణి ఉపాసిస్తున్నాను.' అనా! ఈమాట పాటించవలసిందే మరి. అయితే, ఇప్పుడా పెదవులపై మెరుస్తున్న దంతక్షతాల మాఁటేవిటి? ఏఁవన్నావ్? మిగిలిపోయిన మంచుతుంపరలతో సహా దాడి చేసిన వసంత వాయువు అడుగుజాడ లవి' అంటావా! కోనియ్యి కానియ్యి నాకేదో జ్ఞాపకం వస్తోంది.

'దంత చిహ్నాల నలుగు పెదవులదాన,
నీకుగా చేసికొనెడి ఈ నియతిచూడ —
వ్రతము భంగమ్ముకాని చాంద్రాయణమున
ముద్దు లుద్యాపనమ్మగు సుద్దితోనె!'

ముఖానికి తలుపు చాటు చేసుకుని నవ్వుతోందీమె! అమ్మాయి, నీ తపస్సు వర్ధిల్లుగాక! వెళ్ళొస్తాను. (పరిక్రమిస్తాడు)

అమ్మయ్య! ఇదిగో ఎలాగోలాగ వేశ్యాస్త్రీ ప్రలాపాల సంకెళ్ళ నుంచి విముక్తుణ్ణై దేవదత్త యిల్లు చేరుకున్నాను. ఈపాటికి దేవదత్త వెళ్ళిపోయి ఉంటుందేమో. ఏమైనా అడిగి చూద్దాం. (చూసి) ఆ! ఇదుగో తోట పక్క గుమ్మం దాటిపోతున్నాడు, భావగంధర్వుడి దత్తుడు—నాటికాచార్యుడి శిష్యుడు దర్దురకుడనే చిల్లర పాత్రధారి (నాటేరకుడు). వీణ్ణడుగుతాను. ఏమోయ్ దర్దురక, ఎక్కడినించి వస్తున్నావు? దేవదత్త ఏం చేస్తోందో తెలుసా! ఏఁవంటావ్? 'ఆర్యమూలదేవుడి క్షేమం కనుక్కోడానికి ఎప్పుడో వెళ్ళింది దేవదత్త. నేనయితే, దేవసేనని చూడడానికి ఆచార్యుడు పంపితే వచ్చాను' అనా! ఎందుకని? ఏఁవిటంటావు? 'కుముద్వతి పాత్ర వాచకం వ్రాసిన పత్రాలను ఇచ్చి రావడానికి' అనా! మరి పత్రాలు తెచ్చావా? ఆమె తీసుకుందా! ఏఁవన్నావ్? 'ఆచార్యుల పైని గౌరవం కొద్దీ తీసుకుని ఆ పత్రాలను ఆపక్కమున్న సఖి చేతిలో పెట్టింది. అంతేకాదు, 'కుముద్వతికో నమస్కారం, నా ఒంట్లో బాగాలేదూ అంది.' అనా! పాపం! గొప్ప తర్కమే ఇది. దీన్నిబట్టి ఆమె తదేకలగ్నమైన మనస్సు విరహబాధలో ఉన్నట్లు తెలుస్తోంది. అయితే దర్దురకా ఈ పత్రంలో ఏం వ్రాసి ఉంది? 'ఆ ? 'నువ్వే చదువుకో అంటావా!' (తీసుకుని చదువుతాడు):—

'చిత్తహారి, కామునివిరి, యెత్తు రొమ్ము
గట్టుపై శశి, రాగవృక్షపు పవడము,
పడక పోరున గాయమ్ము; ప్రణయ రథము
బడలు తరి వేయు చేగోల పలుపు దెబ్బ;
కులుకులకు ప్రోది, గాఢమౌ వలపు గుర్తు,
చేయి పూయని కానుగు చెట్టు రంగు
చిన్నె, నెన్నడుము పిరుంద స్వీకరించు
గాక వలగొన్న కర్కశస్త్రీకిశోరి!'

బలే బలే! కర్కశ స్త్రీకిశోరికి తగిన పారం చెప్పాలని బయలు దేరిన నాకు ఈపత్రం శుభప్రదమైన అర్థసిద్ధిని సూచిస్తోంది. ఓయి దర్దురక, అయితే నీకు తెలుసా. దేవసేన ఎక్కడుందో! ఏఁవిటీ? తోటలోకి వెళ్ళిందా! అబ్బా! తోటంటే మదనకర్మాంత భూమి! సరేలే, నువ్వు వెళ్ళు. నేను తోటలోకి వెడతాను. అరే ఇదిగిదిగో దేవసేన—

తేజమే లేక కృశియించి తెల్లనయ్యె
వేకువనె వెలవెలంబోవు వెన్నెల వలె,
అరుదయిన గాఢవేదన నతివ్రమింగు
నదె మనోవ్యాధి మాన్పెడు నౌషధముగ!

ప్రియవాదనిక పరిచారికయినా రహస్యాలన్నీ చక్కగా దాస్తుంది. స్నేహం చేత ఎక్కువ సన్నిహితంగా ఉంటుంది; అందుకే, అదుగో దేవసేన మిగిలిన పరిజనాన్ని రానీకుండా ప్రియవాదనికతోనే తోటలో వాయుసేవనానికి వచ్చింది. కానియ్యి, ఆమె— విరహంలో ఏకాగ్రత కోరుకుంటోందనడానికి ఇది కూడా తార్కాణమే. ఏకాంతం కోరే వారందరూ మనసా కాముకులై ఉంటారు. నా సంగతేదో అంటున్నట్టుందీమె, దగ్గిరికి వెడతాను. (వెళ్ళి)

ఏం పిల్లా దేవసేనా, నీ విరహాలాపాలకు విఘ్నం కలిగించామని మా మీద విసుగుకోవుగద. ఏఁవిటంటావు? 'స్వాగతం బావగారికి, నమస్కారాలు' అనా! కానియ్యి, నీ స్వాగతానికి సంతోషం. చాల్చాలు, లేచి యెదురు రానక్కర్లేదు. 'దయ చెయ్యండి ఈ ఆసనం పైకి' అంటావా. మా బాగా కూర్చుంటాము కాదూ! పిల్లా, బంధువు లందర్నీ కంగారు పెడతున్నా వేమిటి? అదేఁవిటి, కంటికి కనబడని గాఢవేదనా లేక స్వయంగా ముందు అందరికీ తెలిసిన కేవల వ్యాధియా? ఏఁవిటంటావు? 'ఏదీ కా'దనా! నువ్వు అన్నీ తెలిసిన దానివి అలా దాస్తే యెలా? ఎప్పుడూ నువ్వు మా చిన్న నాటి ఆట పాటల నాటి నుంచీ నెచ్చెలివి కాదూ! మూల దేవుడి సఖుడైన ఆనాటి శశుడినే నేను. నువ్వు మంచి దానవుగా, చెప్పు, నీ బెంగకి కారణం. నీ స్థితి యెలా వుందంటే-

వెక్కిలి చేరియున్న దరచేత, శరీరము నెట్టి వ్యాధి
యున్
విక్కగ జేయు; దార్ఢ్యమగు చేత; మనారత మావు
లింతలో
దృక్కులు ధ్యానమగ్నములు, దేహపు వర్ణము
మార్పు చెందు, నిం
పెక్కదు దేని చూచినను నింద్రియ తాపముచేత,
వేసటన్
గ్రక్కను వేడి యూరుపులు., రమ్య మగమ్య
మదెట్టి వస్తువో
అక్కున జేర్పగోరు నటులాయె నిదేటి వికారమే
చెలీ!

ఎలా నిట్టూరుస్తోందో! పాపం, తాపం రేపినట్టున్నాను. ఇప్పుడు ఈమె మనస్సులో భావమేమిటో తెలుసు కుంటాను; నీ విరహానికి కారణం మేంకాకపోయినా నీకు మాత్రం త్వరగా స్వస్థత చేకూరాలని కోరుతున్నాను. నే వెడతాను మరి. ఏమి టంటావు? 'బావగారిది వట్టి చపలబుద్ధి' అనా? ఓహో తెలిసింది. రహస్యం తానే చెపుతోంది. పిల్లా, నీ వాళ్లిలా ఉంటే నాకు ధైర్యం ఎలా ఉంటుంది చెప్పు. ఈ డొంక తిరుగుడు వ్యవహారం వల్ల ప్రసంగ విషయం మారిపోతుంది. ఇంతకీ నీ బెంగకి కారణం ఏమిటో చెప్పావు కావు. ఏమిటంటావు. 'బావ గారి దగ్గిర నాకు దాపరికం లేదు. ఇదంతా వసంత ఋతు స్వభావం—గురువుగారు పెట్టిన నియమంవల్ల ఒంటరిగా ఉన్న నా మనస్సు ఈ ఏదో ఇష్టమైన పని చెయ్యాలనే కోరిక అకారణంగా ప్రబలం అవుతూ వచ్చింది'— అనా! మంచిది. ఇంతకీ ఇదేమీ జబ్బు కాదన్న మాట. అమ్మాయి, దేవసేన మంచి మనిషి అని కూడా తెలుసుకదా. ఇంక మరి బెంగా గింగా చాలు. ఋతుపరిణామంచేత నువ్వు స్వస్థురాలివి కాగలవు. ఏమిటీ సిగ్గు పడుతోంది. ప్రియవాదనికా, ఏమిటా తాళపత్రం మీద వ్రాసి ఉంది? ఆఁ? 'నాటక భూమిక' అంటావా! ఏదీ చూస్తాను. (తీసుకుని చదువుతాడు.)

'కుముద్వతీ ప్రకరణమున అప్పుడే పెద్దమనిషయిన రాజకుమారిని దాది రహస్యంగా ఇలా మందలిస్తోంది—

'రొమ్ము లేర్పడనే లే దురమ్మునందు,
పిచ్చిదాన, నూగారు ప్రాప్తించ లేదు.,
ఎక్కడిది తెల్వి, ఈడు మించేటి పరుగు
లెత్తి విర్రవీగెదవు; విద్వత్తు నెరుగు
సఖుల కవినయగ్రంథముల్ చదువనేల,
ఏల బాల పక్వపు కామఖేల తేల?'

ఏమిటన్నావు దేవసేనా, 'అదంతా నేను వినలే'దనా! ఇది ఆమె పెంకి తనపు స్వభావం. 'నేను కూడా అలాగేసుమా' అని చెప్పినట్టు భావించాలి. ఏమన్నావు దేవసేనా? బావగారికి ఎదిరి మనిషి ఊహ ఇట్టే పోల్చుకోగల తెలివి తేట లున్నాయి.' అనా! అమ్మాయి, చాలు చాలు. విషయం మార్చు. మబ్బు చాటున దాగిఉన్నా చంద్రుని ఉనికి కలువలు విచ్చుకోవడంవల్ల తెలిసి పోతుంది. నీకు మగవాడంటే పడదుపో. నువ్విపు డార్తిలో ఉన్నావని నాకు తెలుసు.

కొంచెముగాక తెల్పితివి
గూఢ మనోగత మిప్పుడీవు ప్రే
మించుట లేదటంచు;
కృశియించుట కెవ్వడు హేతువో యెరిం
గించుము, చేత చెక్కిలియు,
నిల్వక జారెడుకంకణాల్, ప్రకో
పించెడు వేడి యూర్పులు
సహించెడు నా శరుడున్ తపించడో!

ఏమిటంటావు ప్రియవాదనికా! 'కామతంత్రప్రకరణం చదువుతూ మా యజమానురాలీమధ్య ఒక విశిష పురుషుడిపై అనురక్తురాలయింది. మామూలు మగవాడుకాదు' అనా! అయితే ఈ అవంతినగరంలో విశిష్టపురుషు డనతగినవాడెవరు చెప్మా? ఏమిటన్నావు? 'ఎవరయితే మీద్వార పొందతగిన వాడో అతడు' అనా! ఇంకెవరు. నిశ్చయంగా కర్ణీపుత్రు డైన మా మూలదేవుడే! అతడే-

పెద్దయింటివాడు, పేరుపడినవాడు,
వింతలేక నవ్వువెలయుమోము,
మాట, రూపు, వయసు, మంచిదై ఒడలెత్తు
మరుడెకాదొ, లేదు చెరకువిల్లె!

ఏం దేవసేనా! అలా తలవంచుకున్నావు? చాల్చాల్లే అందరికీ కనబడేలా పైట చెంగు వేలికూరికే చుట్టపెట్టు కోడం ఆపు. అంతా చెప్పు. అంత చెప్పతగ్గవాళ్లంకామా? ఏం మాటాడవేం? ఓహో, ఈ సిగ్గేనేది యుక్తవయసు వచ్చిన ఆడదానికి పైనెచ్చు ప్రౌఢకానిముద్దరాలికి అరణపు సొమ్ములాటిది. అలాంటప్పుడు నోరార ఎలా చెపుతుంది గనకను. విశిష పురుషుడనే లక్షణానికి అన్నివిధాలా అర్హుడు కర్ణీ పుత్రుడే. అందుకని పయిపయి గాంభీర్యం నటించి దీనితో మాట్లాడాలి. అమ్మాయి, దేవసేనా, ఇతరులరహస్యాలతో మాకేంపని ? ఈవ్యవహారంలో మేం తటస్థులం! అందుకని నీకు ఒకసంగతి చెపుతాను. కర్ణీపుత్రుడు పాటలీపుత్రంనుంచి ఈ అవంతినగరం వచ్చేసినందుకు తనప్రియజనంకోసం బెంగ పెట్టుకుని అస్వస్థుడై ఉన్నాడు. ఈవేళో రేపో అతనువెళ్లి పోతాడు. మళ్లీ చూస్తానేనిన్ను. ఎందుకంటే ఈలోపున నువ్వు స్వస్థురాలివి కావచ్చు. మమ్మల్ని మర్చిపోకుసుమా. (లేచి వెడతాడు, వెంటనే తిరిగి వచ్చి) 'అయ్యో - ఇప్పుడెంత కష్టంఅని యెవరన్నారు? ఆఁ? దేవసేన యెందుకు ఏడుస్తోంది? అమ్మాయి, ఏమిటిది? వద్దువద్దు ఏడవకు. కానియ్యి. తెలిసిం దిలే. నీ కోరిక అనువైనదే. కర్ణీపుత్రుడికి కూడా నీమూలం గానే మనోవ్యాధి. ఇతరేతరములయిన చికిత్సలన్నీచేశాక అలా ఊహించ గలిగాం. ఏమిటంటావు? 'అంతగా చెప్పాలా? భావగారి బెంగ నాకు తెలుసు' అనా! అయితే దాన్నింక అణిచి పెట్టుకోడం చాలించు.—

దక్షసుత లిర్వదేడ్గురుతార లేక
గర్భజాతలు చంద్రుడు సంగతినెనయరె?
ప్రాకవో అట్టులే మావిమ్రాకుపైని
రెండు తీవ లొకే వేరునుండి లేచి?

ఏమిటంటావు? 'అయితే యిప్పుడు ఇద్దరికీక్షేమం జరిగే ఏర్పాటు కావాలి' అనా? మరేమిటి? ఏర్పాటు కాకేం? రేపేకదా మీ అక్క దేవదత్త యథాప్రకారం నృత్యశిక్షకై ఆచార్య మూలదేవుడి యింటికి వెడుతుంది? అదే నీ విరహం పోగొట్టుకునే అవకాశం. కుశలప్రశ్నవేసేమిషపైని నువ్వు వెళ్ళవచ్చు, లేదా అతనే ఇక్కడికి రావచ్చు. ఏమిటలా తటపటాయిస్తావు? ప్రియవాదనిక ఏమంది? 'అయ్యవారిక్కడకి రావడం నాకిష్టంలేదు. అంటే మాయజమానురాలుండే చోటికి రావడం నాకిష్టంలేదు. లేనిపోనికథలు అల్లడం కులంతో పుట్టిన విద్య మావేశ్యాజాతికి. అందుకని తగినట్లు అంతా నేనే ఏర్పాటు చేస్తాను. ఎలాగంటే నృత్యశిక్షణకై వెళ్లే దేవదత్త తనతోపాటు, ఆచార్యమూలదేవుల క్షేమంఅడిగే మిషపై మాదేవసేనని స్వయంగా తీసుకువెడుతుంది." అనా! బాగుబాగు, ప్రియవాదనిక, నీపేరు సార్థకం అయింది. ఈమంచి మాటలతో ఈమె అక్కడికి వెల్లడమే బాగుంటుంది. ఈమెకు స్వస్థత చేకూరుతుంది. ఏమన్నావు దేవసేనా? 'బావగారిదర్శనం వల్ల ఇప్పుడే స్వస్థత చేకూరిందంటావా?' సంతోషం. మన్మథుడిపని పూర్తయింది. కర్ణిపుత్రుడి ప్రాణాలు నిలబడేందుకు జ్ఞాపకంగా ఉంచుకోతగ్గదేదైనా ఇయ్యాలి నువ్వు. ఏమిటీ? 'ఏమియ్యను' అనా! ఉండుచెపుతాను.

కొసలను లీలగా కొరుకు కోరికపుట్టెడు దాని,రోమ్ములన్
మసలి సలుంగుదాని,ముఖమండలచిత్రకమొత్తుదాని, ని
శ్వసనముతాకి సన్నమయి, చందననీరముసోకి కేసరాల్
ఖుసితరుగన్ ప్రభాతమున కొప్పున నుండి తెమల్చుదాని, ప్రే
యసివి తపించుకాంతునకుపాయనవిమ్ము స్వహస్తజీర్ణవరౌ
బిసముగలట్టి పద్మమును ప్రీతిగ పద్మవినిర్మలాస్యవై!

క్రీగంటి చూపుతో పద్మాన్ని తీసుకోమంది పాపం! ప్రణయప్రతిజ్ఞ చేసిన మిత్రుడి కోసం పద్మప్రాభృతం స్వీకరించాము. ఈ ఔషధం కర్ణిపుత్రుడైన ఆచార్య మూలదేవుడికి సంజీవిని ఔగాక! (తీసుకుని లేచి నుంచుని) వెడుతున్నాను. నీకు సుఖమవుగాక, అమ్మాయి, ఆశీస్సిదిగో!

భయమునకరంగి, సడి వినంబడని రీతి,
కంకణాలును మేఖల కదలియాడ,
శంకచే పరిష్వంగము సడలిపోవ,
విడియు పీడక్రీల నీనీపథమ్ము,
ఈ యుదాత్త రాగాయుథు నీ మదనుని
సకియ నీ తొలిప్రణయంపు సాహసముగ
నీకు నీవె ఆహ్వానింప నేర్తుగాక!

(విటుడు నిష్క్రమిస్తాడు)

ఇది మహాకవి శూద్రకునిచే సంస్కృతమున విరచితమైన పద్మప్రాభృతకమను భాణమునకు బాలాంత్రపు రజనీకాంతరావు ఆంధ్రీకరణము సమాప్తము.



# కరవాల భైరవ మణ్డపం

శ్రీ జి. ఆర్. వర్మ

పశ్చిమ గోదావరిజిల్లాలో తాడేపల్లిగూడెం—మార్టేరు బస్సు దారిలో అత్తిలి—పెనుమంట్ర మధ్య బస్ స్టాప్—చేరువనే నత్తారామేశ్వరం. బస్ స్టాప్‌లో దిగి నడిచి పోవచ్చును. రిక్షాలు, సైకిళ్లు, జట్కాలు ఉన్నవి. తర్వాత సుమారు మైలుదూరంలో జుత్తిగ—రెండూ శైవక్షేత్రాలె.

క్రీ. శ. 11 వ శతాబ్దంలో ఈ రెండు గ్రామాలూ ఒకే క్షేత్రం—కాగా వేంగీ చాళుక్య చరిత్రలో— రాజరాజు (రాజరాజనరేంద్రుని) నాటి సంఘటనల్లో చారిత్రకంగా విశేష ప్రాధాన్యం గల చిహ్నం—ఈ క్షేత్రంలో వుంది. వేంగీ చాళుక్యుల గూర్చి, రాజరాజును మించిన రాజేలేడన్నట్లు వ్రాసిన మన పరిశోధకుల కీ విషయం చర్చనీయాంశం కాలేదు!

శిల్ప ప్రాముఖ్యం కాన్పించనందున త్వరత్వరగా నిర్మించారనిపిస్తుంది ఈ క్షేత్రం. తొమ్మిది శతాబ్దాల



దక్షిణ ద్వారగోపురం



వాసుకీ రవి సోమేశ్వర ఆలయ ముఖమండపం

పూర్వపు క్షేత్రమంటే నమ్మరు. కాని నిజం.

* * *

నత్తారామేశ్వరం గ్రామకంఠాన కనిపించే కృష్ణశిలాఫలకం హరిజనుల పూజకు ప్రత్యేకించబడిన నత్తారామేశ్వరమూర్తియట—ఏదో శిధిలాలయానికి చెందిన దీపలకం. లింగము కాదు; నిలువెత్తు రాతి పలక.

ఆలయగోపురం అత్యాధునిక నిర్మాణం. మండపం—చుట్టూ వివిధ దేవాలయాలున్నాయి—నత్తారామేశ్వరుని ముఖమండపం మాత్రంకాదు.

నత్తారామేశ్వరమూర్తి చిన్నపరిమాణంలో గ్రామకంఠాన కాన్పించే మూర్తి పోలియున్నది. ఈ నత్తారామేశ్వరాలయంలో వేరొక శిలపై రెండు సన్నని నత్తగుల్లలంటియున్న రాతిని చూపుతూ ఆ నత్తల (జలచరం) కారణంగా రామేశ్వరుడు నత్తారామేశ్వరు

ఉనబతేనంటారు. ఈ ఆలయం పశ్చిమాభిముఖంగా ఉన్నది.

గోస్తనదిలో సంవత్సరంలో పదకొండు నెలలు నీటుంటుంది. ఆ నదిలోనున్న రామేశ్వరుడు పరశురామ ప్రతిష్ఠిత పరశురామేశ్వరుడంటారు.

ఈ పరశురామేశ్వరాలయం ఉత్తరాభిముఖంగా ఉన్నది. ముఖమండపం ఈ ఆలయనిదే.

ఆలయ నిర్వాహకోద్యోగి శ్రీ యాళ్లబండి నారాయణరావు యిచ్చిన మహాత్మ్య వివరణ ఇది

గోస్తనది గోదావరికన్న పురాతనం. పృథు చక్రవర్తి క్షామ నివారణ సందర్భంగా భూదేవిపై ఆగ్రహించగా ఆమె గోరూపిణిగా క్షేమకాద్రి, (?) వద్ద కాన్పించి ముప్పదిమూడుకోట్ల దేవతలను లేగలచేసి తనపాలు పితకమన్నదట తొర్లినపాలు గోస్తనదిగా ప్రవాహమాయెనట. మాతృ, భ్రాతృ హత్యా పాపవిముక్తి కిచట పరశురాముడు రామ లింగేశ్వరుని ప్రతిష్ఠించినట్లు 'వాయు పురాణము'లో ఉన్నదట.

నత్తారామేశ్వరుని ప్రతిష్ఠించినది సీతయుట. రావణవధానంతరం అయోధ్యకు వస్తూ సీతారాములు



నత్తా రామేశ్వరం అర్వాచీన గోపురం



నత్తా రామేశ్వరం: గోస్తనదిలో పరశురామేశ్వరాలయం

లిచట విశ్రమించారట. అది పుణ్యక్షేత్రమైనందున శివప్రతిష్ఠకై సీత కోర్కెపై బాణమునకై ఆంజనేయుడు నర్మదానదికి పోయెనట. ముహూర్తకాలము దాటి పోవుచున్నందున, ఆంజనేయుని రాక ఆలస్యమైనందున సీత అచటి ఇసుక, నత్తలు కలిపి లింగము చేసి ప్రతిష్ఠించెనట.

'వాయు పురాణము'న గోస్తనదికి అనుదినమూ రెండు జాములకు పుష్కరమని ఉన్నదట—కాబట్టి నిత్య పుష్కరిణియుట—

బాణము బహుశా గృహస్తులిండ్లలో పూజించే చిన్నలింగం—బాణలింగ—ప్రసక్తి కావచ్చును గండకీ నదిలో దొరకే సున్నపురాళ్లు సాలగ్రామాలుగా పూజింపబడినట్లే నర్మదలో దొరకేరాళ్లు శైవులు పూజించే ఆచారం పురాతనం. గోస్తనది, నత్తారామేశ్వరం, పరశురామేశ్వరుడనే పేర్లు చరిత్రలో కాన్పించవు.

పరశురామేశ్వరుడు ఎప్పుడూ నీటిలో నుండుటచే ధవళలింగం గోధుమరంగుకు మారిపోయింది. పరశురామేశ్వరాలయం ప్రదక్షిణావరణం నీటిలోనే యున్నది.

నీటిలో గతకాలంలో దేవాలయ నిర్మాణం నేటి ఇంజనీర్లకు ఆశ్చర్యకరంకాదా? నదీగర్భంలో ఉన్న దీ ఆలయం. ఈ ఆలయం ఆవల దక్షిణంగా వున్నది లింగమూర్తి—లక్ష్మణ ప్రతిష్ఠితం. కాబటి లక్ష్మణేశ్వరుడు అంటారు. నేడు నత్తారామేశ్వరం పేరు

గ్రామమైనా ఒకప్పుడిది నేడు దీనికి మైలుదూరంలో వున్న సుప్రసిద్ధక్షేత్రం జుత్తిగలో భాగమే. అలాగే లక్ష్మణేశ్వర, పరశురామేశ్వర లింగాలు అనే పేరిటివి ఆదిలో జుత్తిగ క్షేత్రానివే—వేరు పేర్లుగలవై వుండాలి.

నత్తారామేశ్వరం, ముఖమండపశాసనాల్లో పేర్కొనబడిన ప్రాలి నేటి పాలిగ్రామం చేరువనే యున్నది.

ఒకానొక ప్రభవనామసంవత్సరంలో మహామండలేశ్వర సింగారపుకోట ప్రతాప అన్నమరాజుకు భృత్యుడూ, తెల్లింగూటి అన్నమనీడు కొడుకునైన గంగినీడు రామేశ్వరునకూ, జుత్తిగ సోమేశ్వరునకూ స్థానంవారినుండి క్రయముచేసిన పూదోటను సమర్పించుకున్నవైనం నత్తారామేశ్వరం మండప శాసనాల్లో ఉంది.

ఈ మండపంలో మరో శాసనం శక. 1236 (క్రీ. శ. 1314) లో 'నాయిని దేవి రడి' కొడుకు వల్లభ రడి ఈ 'మూలస్థానము నతదేవర'కు 'అర దీపము' సమర్పించినట్లున్నది. వల్లభరెడ్డి నాడి గ్రామ నామం నత్తారామేశ్వరంకాదు; గంగినీడు నాటికీ దుత్తికయే - గంగినీడునాటికి ఒక దేవుని పేరు రామేశ్వరుడు— నేడు పరశురామేశ్వరు అనబడే దైవమే ఐతే వల్లభరెడ్డినాటి 'నతదేవర' జుత్తిగ (సోమ)నాథకు వికృతి కావచ్చుకాని 'నత్త'మాత్రం కాదు. నత్తలు, సీత లింగప్రతిష్ఠ కథలు ఈ 'నత దేవర'నుండి 'సృష్టి' అయ్యుండాలి.

పరశురామేశ్వరాలయం అనబడుతున్న ఆలయ ప్రసక్తి శక. 1180 (క్రీ. శ. 1258) నాటి శాసనంలో ఉన్నది. నాటి కాదేవునిపేరు రామేశ్వరుడనే వ్యవహరింపబడినది.

తన రాణి అన్యమ (అన్నమమ్మ) సద్గతికై 'దుత్తిక శ్రీ రామేశ్వరమహాదేవునికి గుడి కట్టించి' వెల్లవేయించినది, సోమయ— ఈ రాజుతండ్రి-'కమలాకరపుర (నేటి ఏలూరు) వల్లభుడు; సుకవిజన మనోరథార్థప్రదుడు; సకలరాజాశ్రయుడు; వన్ని నారాయణుడు; మన్నియదేవేంద్రుడు' నైన మహా మండలేశ్వర కొలినిమాండలిక కేశవదేవరాజు.

ఈ రాజులు కాకతీయుల పూర్వపు ప్రథమ సరోనాథులు—'ఆంధ్రుల చరిత్ర' ప్రకారం నేటి కాపు, తెలగాకులంవారి వంశపురుషులు. చాళుక్య రాజబంధువులనే నా సందేహం.

నత్తారామేశ్వరం శాసనాలనుబట్టి ఈ గ్రామ నామం నేడు జుత్తిగ అనబడుతున్న దుత్తిక. ఐతే జుత్తిగ శాసనాల్లో నత్తారామేశ్వర, రామేశ్వర, లక్ష్మణేశ్వర నామ దేవతలు లేరు. నత్తారామేశ్వరాలయాలు జుత్తిగ ఆలయాలవలె శిథిలం (కారణం తెలియదు) కాగా పునర్నిర్మాణం అయినవే.

సోమయ శాసనం—గుడి కట్టించడం—క్రీ. శ. 1258 నాటికే ఆలయం శిథిలమైనదనిపిస్తుంది. లేదా అసంపూర్ణమై ఉంటుంది.

* * *

నత్తారామేశ్వరానికి తూర్పుగా సుమారు మైలుదూరాన జుత్తిగ, దాని కావల జుత్తిగ శివారు గ్రామా లున్నాయి.

జుత్తిగ దక్షిణకాశీ అనుకోడానికి కారణం ఇచట గోస్తనది ఉత్తరవాహిని కావుటే నంటారు. కాని రాజు ప్రతిష్ఠించిన దేవుడూ, పోషించిన పుణ్య క్షేత్రం, అదే ఆధ్యాత్మిక విద్యాకేంద్రంగా వ్యవహరించుటతో అనేకక్షేత్రాలు దక్షిణకాశీ అనబడినవని నా నమ్మకం.

జుత్తిగలో సుమారు పాతికశాసనాల్లో ఒక దానిలోనూ నదిపేరు గోస్తనది అనిగాని, పండితుల 'గోస్తనీ'నది అనిగానిలేదు. ఆ శాసనాల్లో నదీనామం 'గూఢస్తని'. పూర్వం పశ్చిమగోదావరిలో చాలా నదులుండేవి. ఆ ఛాయలు ఆ మధ్య సముద్రతీర గర్భ పరిశోధకులు గుర్తించిన విషయం వార్తా పత్రికల్లో కూడా వచ్చింది. కాలువలు త్రవ్వాక గూఢస్తనీనది కేవలం పంట మురుగుకాల్వ అయినది. జీవనదిఅనలేముకాని మండువేసవిలోగూడ అచ్చటచ్చట నీరు నిలచియుండును—ఊట—చలములున్న వన్నమాట—కాని కంటికి కాన్పించవు. అదే గూఢస్తనీ సార్థకనామం.

జుత్తిగ శాసనాల్లో క్షేత్ర—గ్రామనామం జుత్తిగగాగల—'దుత్తికా' పావనవార విషయ (ప్రగు

ణార) మండలంలో గ్రామం–జుత్తిగ సుప్రసిద్ధ శైవక్షేత్రం. ఒకప్పుడీ గ్రామభాగమైన నేటి నత్తా రామేశ్వరంలో ఉత్సవాలు శివరాత్రికి; కాని జుత్తిగలో సుబ్రహ్మణ్య (స్కంద)షష్ఠికి జరుగుచున్నవి.

జుత్తిగ ఆలయం 'ఆంధ్ర మహాభారత' కృతిపతి వేంగీచాళుక్య ప్రథమ రాజరాజు నాటిదంటే ఆలయాలు చూచినవారెవరూ నమ్మరు–కారణం అసలు ఆలయాలు శిథిలంకాగా పునర్నిర్మించినవి నేటి ఆలయాలు–ఆలయా లానాడే అసంపూర్ణ నిర్మాణాలైయ్యుండునా!

ఆలయకార్యనిర్వాహకాద్యోగి శ్రీ కె. రామారావుగాని, ధర్మకర్తలుగాని, గ్రామరెడ్డుగాని ఎవరూ స్థలపురాణ మాహాత్మ్యదుల వినరించలేదు.

నియోగులలో సత్తిరాజు గృహనామంగలవారికిది కేంద్రం — సత్తిరాజువారు చాళుక్యయుగపు మంత్రాంగంలోవారే. కొందరిపుడు గ్రామకరణాలు. జుత్తిగ ఆలయ ధర్మకర్తలు సత్తిరాజువారే–ధర్మకర్త ప్రకటించిన ఛాయాచిత్ర సంపుటిలో దేవుడైన వాసుకీరవిసోమేశ్వరుని ఘుశ్మేశ్వరజ్యోతిర్లింగ



జరుదేవళాల్లో సూర్యాలయం



సాలంకృత వాసుకి రవి సోమేశ్వర లింగం

మన్నారు: ద్వాదశ జ్యోతిర్లింగాల్లో ఇదొకటికాదు, కాని తళతళమెరసే చలువరాయి (ధవళ)లింగం.

శివుని ఉగ్రగుణసూచకం అయితే ఘుశ్మేశ్వర అనరాదు — ఘస్మరేశ్వర అనడం సరి. కాగా ఈ క్షేత్రంలో చరిత్ర చెప్పని రౌద్రగుణం నే నూహిస్తున్నాను. అది సరైతే నేడు తూర్పు, పశ్చిమ గోదావరుల్లోవున్న ధవళలింగాల ప్రతిష్ఠించినదీ వాసుకీరవిసోమేశ్వరుని ప్రతిష్ఠించినదీ ఒకరుగాకున్నా సమకాలీనం అనవచ్చును.

దుత్తిక అనే పేరు ఎప్పుడు జుత్తిగగా మారెనో తెలియదు–జుత్తిగలో అంతర్ద్వారిక ఆలయం ఇతర ఆలయాలతో కలిసి ఉంది. బహిర్ద్వారికాలయం ఆవల ఉంది. ఈ దూతిక (అమ్మవారు) పేరిట జుత్తిగ అయినదంటారు. కాని దూతిక ప్రమేయం లేకుండానే దుత్తిక పామరుల నోట జుత్తిగగా మారిందనాలి.

శాసనాలన్నీ దేవుని వాసుకీరవిసోమేశ్వరుడు, సోమేశ్వరమహాదేవుడు, సోమనాథుడుగా పేర్కొన్నందున నత్తారామేశ్వరపు నత్తరామేశ్వరుడు పరశురామేశ్వరుడు పేర్లు ఇటీవలివనాలి.

సానులు, సామంతులు, రాజులు, రారాజులు, యోధానయోధులు కొల్చిన దేవుడు—వారు సమర్పించుకున్న బంగారం, భూములు ఏమైనవోగాని నేడున్నది 60 ఎకరాల దేవమాన్యం—మున్నూరు సానులాడిపాడిన ఆలయం అది.

సోమనాథుని పీఠం—తాడేపల్లిగూడెం తాలూకా గణపవరం (సరోనాథులనాటి పద్మినీపురం) స్వర్ణేశ్వర పీఠంవలె కృష్ణశిలయే. రెండుచోట్ల లింగ ఫాలాన మూడవ కన్ను చూపేందుకు పెద్దకెంపు (మాణిక్యం) అమర్చేందుకు లొత్త ఉన్నది. గతంలో శివుని రౌద్రగుణప్రదర్శన కట్లాచేసేవారు. నేడు ఆ లొత్త క్కారణంగా కాకమ్మ కథలు చెబుతున్నారు.

సోమేశ్వరుని కభిషిక్తమయ్యే నీరు ఎటు పోయేదీ తెలీదట—పరిశోధించే అవకాశం కల్గలేదు.

చుట్టూ ప్రాకారం ఉన్నది. నాల్గు దార్లున్నా ఒక్కదక్షిణాన్నే గోపురమున్నది—ఇది నిరవద్యపుర (నిడదవోలు) చాళుక్యులనాటి దనడానికి మనమరాజు (మనమగొంక—గోక—రాజు) ప్రశస్తి శిలా శాసన. ఉన్నది. ఈ ప్రాకారంలోపల అన్నీ అర్వాచీనం అనిపించే దేవశాలు క్రిక్కిరిసిఉన్నయి. కాని విగ్రహాలన్నీ చాళుక్యులనాటివే. వల్లీసుబ్రహ్మణ్యేశ్వరాలయం ఒకటే ఈ ప్రాంగణంలోగాక పడమరగా ఉన్నది.



ఉమా పార్వతి



ధూమిత

గోపురం దారినుండి వెళ్లిన ఆలయంలో ఎదురుగా కాన్పించేది పార్వతి. ఈవల స్తంభాలపై నట్టువరాండ్రున్నాదన (శిల్పం) అదొకనాటి నాట్యమండపం అయ్యుండను—అక్కడే భద్రకాళీవీరభద్రులున్నారు.

ముఖమండపశాసనాల్లో రెండు క్రీ. శ. 1141 నాటి సూరమ్మ కూతురు ప్రోలిసాని—ఈసాని అఖండదీపానిగ్గాను 50 గొర్రెలు సమర్పించు టేగాక—అచట అనువంశికంగా 300 మంది సానులు దేవునికై ఏర్పాటైనట్లు పేర్కొన్నది.

అసలు ఆలయాలు ఎలా శిథిలమైనదీ తెలీదు. కాని పునర్నిర్మాణం జరిగిన చరిత్ర నందిధ్వజ శాసనంలో ఉంది. 'ఇభురాంశా' నాటికి జీర్ణావస్థలో వుండగా ఆయన, ఆయనకుమారుడైన 'మహమన్దుఖుల్లీ పాదశహ' కాలాన సత్తిరాజు సోమరాజు శాస్త్ర,

పెద్దిరాజు పుత్ర సోమేశ్వరుడు క్రీ. శ. 1583లో పునరుద్ధరించినట్లున్నది. 'ఇభురాంశా' మన కవుల సుర్‌త్రాణుడు, మల్లికాభరణుడు, ఇభరాముడు గోల్కొండనవాబు మాలిక్ మహ్మద్ ఇబ్రహిం కుతుబ్షాయే. కొడుకు భాగ్యనగర (హైదరాబాద్) నగర నిర్మాతయైన మహ్మద్ ఖులీ కుత్బుషా (క్రీ. శ. 1580-1612) యే.

పునర్నిర్మాణకాలాన పరివారదైవాలక్కడ వేర్వేరుగా చిరుదేవళాలు ఏర్పాటైనట్లున్నది. ఆలయం లేకుండా భైరవాది విగ్రహాలు ఇంకా అలాపడి ఉన్నాయి. సోమనాథాలయం పశ్చిమాభిముఖంగా ఉన్నది ఆలయ ముఖమండపంలో శాసనాలు ఎక్కువగా ఉన్నాయి.

అవిగాక చిరుదేవళాలకు నందిధ్వజాలున్నట్లుగా శిలాశాసన ఫలకాలు (సత్తిరాజువారు నిల్పినారు) ముఖ మండపం చాలా శిథిలం—స్తంభాలపై శిల్పంలేదు. ఆలయం ముందు భాగం, కొంత ముఖమండపం పునాది కట్టు పురాతనం—గజయూథం, హంసల వరుస శిల్పం ముచ్చటగానే ఉన్నది. ఊర్ధ్వం అర్వాచీనం—అధోభాగం పురాతనం.

ముఖమండపంగుండా వెళ్లేవారికి ఎడమచేతి వైపు నాల్గు స్తంభాలమధ్య (ఇటీవల) గోడకట్టి మధ్య నిల్పిన కార్తికేయ విగ్రహం—చూచి లోనికి పోయేవారికి ఎడమవైపుద్వారం ప్రక్కనే 'శారదాపీఠం' కాన్పించును. ఈ పీఠంపై చిరువిగ్రహాలు ఆదిలో సప్తమాతృకల్లో చౌకావారి 'శారద' సప్తమాతృకల్లో బ్రాహ్మియే — అదే పీఠంపై 'అనీశ్వరి' యున్నది. ఈమెను సంతానార్థులై పూజించెదరట.

ఆలయంలో ఎడమవైపు దక్షిణాభిముఖంగా వున్న అమ్మవారి ఆలయంలో రెండు శాసనాలు—నిత్యార్చన కేర్పాటుచేసిన గణపతి పినఅబ్బరాజు సోమేశ్వరునితోపాటు పేర్కొన్న 'అల్లాడీశ్వరి' లింగం పేరు నేడు వినిపించదు—ఎక్కడున్నదీ తెలియదు; సత్తారామేశ్వరలింగమై యుండునా? బాచిరాజుసింగణభూమి సమర్పించుకొనెను.

ఈ అమ్మవారి ప్రతిష్ఠ కతిపయకాలానిది—ఆ సంగతి వేరొక శాసనంలో ఉన్నది.



దక్షిణంవైపు నాట్యమండపం

ముఖమండపంపైవున్న శాసనాల్లో నాల్గు నరోనాథుల కాలానివి. క్రీ. శ. 1125 నాటిది మహామండలేశ్వర ఒక్కెత్తుగండ (భుజబలభీమ కాటమరాజు?) అఖండదీపార్థం స్వర్ణదానం—

క్రీ. శ. 1221 నాటిది. కేశవ మాండలికుని (కేశవదేవరాజు)ని భృత్యుడు ఎఱియదేవుని అఖండదీప సమర్పణ.

క్రీ. శ. 1277 నాటిది—'ఎఱిగయ (ఎరక) దేవరాజు శ్రీకరి 'అన్నపాసారి'కిచ్చిన వృత్తి—చూడండి ప్రజాస్వామ్యం! శ్రీ కరణం (ఆలయాదాయ వ్యయాధికారి), ఎంబళ్ళు (శివార్చకులు) సానులు 72 నియోగాల వారి అంగీకారంలో ఏర్పడిన వృత్తి.

పై రాజు నాటిదే-మరొకటి క్రీ శ. 1260లో నిత్యార్చనగ్గాను 'గోనంగనపాడు' భూమి సమర్పించినది. 'పినకుందేలు పడుత' (?)

స్థానికులు వానుకి రవి సోమేశ్వర నామకరణం వారిచ్చుట తపస్సుచేసి దేవుని ప్రతిష్ఠించారని - లింగ ప్రతిష్ఠాత ఎవరో, ఎప్పుడో తెలిపే శాసనాధారం ఏమీ లేదు.

చాళుక్య వీరభద్రుని (కాకతి రుద్రమ్మ భర్త) మంత్రి విష్ణువు అఖండదీపదానంచేస్తూ లింగ ప్రతిష్ఠాత 'వాసుకి' అనెను. పాము ప్రతిష్ఠించెనా? వాసుకి అనే పేరున్న మనుష్యులు పశ్చిమ గోదావరిలో నేడూ ఉన్నారు.

నాటి ఆచారం అంతా అఖండ దీపదానం—భూదానం, పుష్పవాటికలు—దీపదానానికై గొర్రెలు, బర్రెలు—ఐతే స్వర్ణదానం చేసినది సారసీనాథులు మాత్రమే.

క్రీ. శ 1259—అఖండదీప సమర్పణ—యిచ్చిన (ఏరువ చాళుక్యులు) కొండేనాయకపౌత్ర భణ్డారు కెణ్డప నాయకుని భార్య, కొడుకులు.

క్రీ. శ. 1160 లో అయనాపురాగ్రహారికుడు అప్పనార్యపౌత్రుడూ, ఆదిత్యపుత్రుడూ అయిన పోతన పేర్కొన్న 'భృంగీశ్వరుడు' నేడు కాన్పించడు సత్తారామేశ్వరంలో రెంటిలో నాకలింగమై యుండునా?

మిగతా శాసనాలన్నీ 'సర్వలోకాశ్రయ విష్ణువర్ధన మహారాజు' నాటివి. ఈ బిరుదనామం అనేకుల కున్నందున . కేవల 'విజయరాజ్య సంవత్సర' గణనలో సులువుగా గుర్తించలేము. ఐతే విజయరాజ్య సంవత్సరంతోపాటు శక సంవత్సరాలున్న శాసనాల కాల నిర్ణయం తేలిక.

శాసనాల్లో పేర్కొనబడిన 'ముమ్మడి భీమ మానిక' 'త్రిభువనాంకుశ నేతిమాన' కొలగారంబట్టి ఇవన్నీ సర్వలోకాశ్రయ విష్ణువర్ధన మహారాజు విమలాదిత్యుని తర్వాతి కాలానివే—

క్రీ శ. 1089 నాటి శాసనకర్త వీరచోడుడు మూడు అఖండ దీపాలకు నేయి అందజేసేందుకు 300 మందిని ఏర్పాటుచేసెను. ఈతడు రాజరాజనరేంద్రుని పౌత్రుడు, రాజేంద్రచోడ (కులోత్తుంగ చోళ) పుత్రుడు - చోళరాజు ప్రతినిధి (క్రీ. శ. 1078—1117).

క్రీ. శ 1255 నాటి శాసనంలో యెఱ్ఱవ కొమ్మనాయక పౌత్రుడు భణ్డారి కొణ్డపనాయకుడూ అతని కొడుకు వీరభద్రనాయకుడు 'మహాదేవ చక్రవర్తి' పుణ్యార్థం ఉమాదేవిని ప్రతిష్ఠించినట్లు, వారే సోమేశ్వరాలయం ఎదుట 'కరవాల భైరవ మండపం' నిర్మించినట్లువున్నది. కాని మండప నిర్మాతలు ఈ ఏరువచాళుక్యులు కారు—వేంగి రాజే. బహుశా వీరి మండపాన్ని పూర్తిచేశారో, మరమ్మతు చేయించారో! క్రీ. శ. 1078 (శక. 1000) నాటిదొక శాసనం ఉన్నది. వేంగీచాళుక్యుల్లో విజయరాజ్య సంవత్సర పరిగణన ఒకరాజు అభిషేకకాలంఆనీ, కాదు—అతని మరణకాల పరిగణన అని పరిశోధకుల్లో రెండభిప్రాయా లున్నాయి.

వి రా. సం. 17 నాటి శాసనకర్త శ్రీ చోడగంగదేవుడు కులోత్తుంగచోళ చక్రవర్తి కొడుకు రాజరాజచోడగంగదేవుడే.

వి. రా. సం. పేర్కొన్న శాసనకర్తలు—అయినాపురాగ్రహారికుడైన పోతియ (పోతన)భట్టు మలయతమ్మం ప్రోలరాజు పత్ని ముమ్మడి గోమదేవి.

ముఖమండపం 7 వ స్తంభంపై వి. రా. సం. 13 నాటి అసంపూర్ణ శాసనం.

> 'స్వస్తి సర్వలోకాశ్రయ
> శ్రీ విష్ణువర్ధన మహా
> రాజుల ప్రవర్ధమాన...
> విజయరాజ్య సంవత్స
> రములు 13 యవు నె
> ఱ్ఱ ద్వత్తిక వాసి కర
> వి సోమినాశ్వరదేవర
> ముందట శ్రీ విజయా!
> త్య దేవర యెత్తించిన
> కరవాల భైరవ మ
> ణ్డపము యాచంద్రతారము......

ఎవరీ విజయాదిత్యుడంటే? ఆ పేరిటివారు వేంగీచాళుక్యుల్లో పదిమందైనా ఉన్నారు ప్రవర్ధమాన విజయరాజ్య సంవత్సరం 13—విమలాదిత్యుని అనంతరం — రాజరాజనరేంద్రుడు అభిషిక్తుడైన 13 వ సంవత్సరంనాటి విజయాదిత్యు డెవరు?

రాజరాజు తమ కులపురుషుడు అని చెప్పకొనే వారికీ, వారి ఆశ్రిత పండితులకూ తెలీదు—ఈ

మండప నిర్మాణం మన పరిశోధకుల దృష్టికి రాలేదేమో !

ముఖమండపనామం 'కరవాలభైరవ మండపం' అవే పేరుబట్టి ఈ రాజెవరో గుర్తించవచ్చును. వేంగీచాళుక్యుల్లో కరవాలభైరవ బిరుదున్నవాడు ర్యాలి శాసనకర్త '...దేవశ్రీ కరవాలభైరవనృపే...' విజయాదిత్యుడూ, దక్షారామ శాసనకర్త్రి సోమలదేవి పేర్కొన్న 'బెజియితదేవ'. ఆమె తల్లిని భోగకాంతగా (రాజరాజు అని పరిశోధకాభిప్రాయం) పోషించిన సర్వలోకాశ్రయ విష్ణువర్ధన మహారాజు వీరవిజయాదిత్యుడు. ఈతని కొడుకు సత్యాశ్రయ ద్వితీయ శక్తివర్మ సమరైకభైరవ బిరుదాంచితుడు.

ఈ కరవాలభైరవుని ద్వైమాతురుడే 'పరగండభైరవు'డైన రాజరాజు. ఈ వీరవిజయాదిత్యుడే జుత్తిగ కరవాలభైరవ మండప నిర్మాత. పాములవాక శాసనం.

'తస్యమమ్మడి భీమస్య
సుతః కృతమతిర్మహా
రాజరాజా హ్వయోరాజా
ద్వాదశాబ్దా న్ధరామపాత్
తం రాజరాజ నృపతిం
నిర్ధాట్యభువం ప్రసహ్య విజయాదిత్యః
విమలాదిత్య తనూజ
స్సస్య ద్వైమాతురో గ్రహీద్రాజ్యమ్...'

పరగండ భైరవుడైన రాజరాజు నోడించిన వీరవిజయాదిత్యుడే కరవాలభైరవుడు

విమలాదిత్యుని భార్యల్లో కుందమ్మ చోళరాజు తనయ, మరొకామె స్థానికుడూ ఆచంట (పశ్చిమ గోదావరి, నర్సాపురం తాలూకా) మండలేశ్వరుడైన సూరపరాజు కూతురు మేడమ్మ—తెలుగు చోడుని కూతురు.

పై 'భైరవు'ల్లో ఎవరు పెద్దలో తెలీదు—కాని రాజరాజు యువరాజు, రాజు కావడంలో నాటికి బలవంతులైయున్న చోళులు కారణం కాకూడదా? చోళరాజు తంత్రంలో వారి కన్యల కళింగ, పశ్చిమ చాళుక్యులక్కూడ కోడళ్లను జేశారు. వారి సంతానానికే రాజ్యార్హత కల్గించారు.

వీర విజయాదిత్య విజయం తాత్కాలికం—క్రీ. శ. 1031–32 కాని క్రీ. శ. 1035 పూర్వమే చాలాసార్లు పోరాడి రాజరాజు సింహాసనం స్వాధీనం చేసుకొన్నాడు.

వీరవిజయాదిత్యుడు విజయచిహ్నంగా జుత్తిగలో మంటపం నిర్మించాడు. కాని దేవుని ప్రతిష్ఠించిన దెవరో, శాసనాధారం లేదు. మండప నిర్మాణ కాలానికే అక్కడ వీరసోమేశ్వరుడున్నాడు.

సర్ప సూర్య చంద్రారాధన బహుపురాతనం—కాని వారు ప్రతిష్ఠించారంటే ఎలా నమ్మగలము!

రాజరాజ వీరవిజయాదిత్యులు ద్వైమాతురులే. రాజ్యం వీరభోజ్యం. వేంగిచాళుక్యుల్లో అన్నదమ్ముల యుద్ధాలు అనేకం జరిగాయి. రాజరాజు చోళరాజు సంబంధంగా కళ్యాణి చాళుక్య విరోధి. కాబట్టి రాజరాజు విరోధి విజయాదిత్యుడు కళ్యాణి చాళుక్య (తాత్కాలిక) మిత్రుడు. జగదేకమల్ల ఇమ్మడి జయసింహు (క్రీ. శ. 1014–44) నికీ, అతని కొడుకు, ఆహవమల్ల సోమేశ్వరుని (క్రీ. శ. 1044–68) కీ వీరవిజయాదిత్యుడు సమకాలీనుడు. బహుశా పశ్చిమ చాళుక్యుల సహాయముండియుండును. పశ్చిమ చాళుక్యుల్లో రాజు సోమేశ్వరుడు.

వీరవిజయాదిత్యుని పేరులో సూర్య—రవి ఉన్నారు.

వీర విజయాదిత్యుని పాములవాక శాసనంలో 'నాగకుల భూషణాయ'—అని వున్నది. అతనికి మంత్రి, మాండలికుడు, సేనానాయకుడు బ్రాహ్మణుడైన భీమరాజు వాసుకి (నాగకుల) నాగరాజు.

జుత్తిగ దేవుని పేరు—'వాసుకీ రవి సోమేశ్వర'లో కార్యఖడ్గాలు నెరపిన భీమరాజు, గెల్చిన రాజమార్తాండ విజయాదిత్యుడు, హితుడు ఆహవమల్ల సోమేశ్వరుడు వున్నారు.

ఈ ముగ్గురి పేరిట ప్రతిష్ఠింపబడెనా?

# భవిష్యద్వాణి

## శ్రీ చందూ

ఓ దేవీ!

ఎవరు నువ్వు?
ఈ చీకటి రాత్రివేళ
వెన్నెలబాట వేసుకుంటూ—సన్నగా కిన్నెరపాట మీటుకుంటూ
కలలపువ్వులు చల్లుకుంటూ—దారిలో శిలల ద్రవింపజేసుకుంటూ
నా కుటీరానికి నడచివచ్చావు
ఎందుకు? ఎవరు నువ్వు?

ఇక్కడ నీ కాతిథ్య మివ్వటానికి నాకేమున్నాయి?
పాద్యానికి పన్నీరులేదు—కొద్దిగా కన్నీరు మాత్రముంది.
పూజకు పువ్వులు లేవు—వాడిన నవ్వులు మాత్రమున్నాయి.
ని న్నధివసింపజేయటానికి నిర్మలస్వర్ణపీఠంలేదు
ఇదుగో—ఈ పగిలిన తుది మిగిలిన ఎదమాత్రం వున్నది

ఏమిటలా చూస్తావు ఎగాదిగా?
ఎందుకలా నవ్వుతావు గడసరిగా?

సంజలకెంజాయల్ని నీబుగ్గల్లో దాచుకుని
సర్వలోకరహస్యాలను నీ కన్నుల కాటుక చేసుకుని
చుక్కల్నీ వెలుగుపూలమొక్కల్నీ తవాలవినీలదిక్కుల్నీ
నీ ద్రుక్సీమల లోతుల్లో పదిలపరుచుకుని
సెలయేటికలకలలు చదలేటిమిలమిలలు కదిలేటివెన్నెలల
నీ పెదవులపై పొదువుకుని
ఎందుకలా నవ్వుతావు గడసరిగా?
ఏమిటలా చూస్తావు వన్నెగా దిగా?

అవును నిజమే!—కాంక్షాపూరిత కల్మష శిఖరాగ్రంనుండి
జారిన సెలయేరే నా కన్నీరు!
అవును నిజమే!—నరలోక నరకజీవిత నగ్నబాధాబంధనాల్లో
నలిగి వాడినపువ్వులే నా నవ్వులు!
అవును నిజమే!—వ్యధాక్షుభిత యథార్థజగత్తుకి తగిలి
తునాతునకలైన తుహినభాండమే నా హృదయం!

అవును మరి!
నేనొక సామాన్యుణ్ణి!
చీకటిలో బ్రతుకుతున్న చివరితరం మానవుణ్ణి
ఆవేశం కావేషం హరాయించుకున్నవాణ్ణి
కాలంవిసిరినజాలంలో చిక్కుకున్నచేపపిల్లలాంటివాణ్ణి
పువ్వులవలె హాయిగా నవ్వలేనివాణ్ణి
పులుగులవలె స్వేచ్ఛగా ఎగరలేనివాణ్ణి
వెలుగులవలె స్వచ్ఛంగా బ్రతకలేనివాణ్ణి.

నా చుట్టూ అనేకానేకకల్లోలతరంగిణులు తరగలెత్తుతున్నవాణ్ణి
నాలోపల నీచనిరాశాఝుంఝూనిలాలు పరుగులెత్తుతున్నవాణ్ణి

తపనలోంచి తప్పులోంచి
అడుసులోంచి అధోగతిలోంచి—లేచి
అడుగు ముందుకు వేయలేనివాణ్ణి
ఎందుకూ పనికిరానివాణ్ణి
ఎందుకు బ్రతుకుతున్నానో తెలియనివాణ్ణి

ఎప్పుడైనా ఎక్కడైనా అనంతదిగంతాన
వెలుగురవ్వ కనబడితే—చూడలేక
కళ్లు మూసుకుని వెక్కివెక్కి ఏడిచేవాణ్ణి

ఇక్కడ ఒంటరిగా
కటికచీకటిలో నా కుటిలో కూర్చుని
ఘూకంశోకాన్ని గీతాలుగా రచిస్తున్నవాణ్ణి
వేదనావేదాన్ని ఎలుగెత్తి వచిస్తున్నవాణ్ణి

అల్లంతదూరాన సూర్యోదయమౌతున్నదన్న వార్త విని
అసూయపడి పళ్లు కొరుక్కునే అశక్తుణ్ణి
ఇంకా ఎన్నాళ్లిలా చీకట్లో—మృత్యువు వాకిట్లో
పడిగాపులు పడాలో తెలియని
దిక్కుతెలియని బిక్కమొహం మానవుణ్ణి.

అదుగో—అలా చూడకు! నేను భరించలేను
ఆ చూపులతో
నా లోపల రేగే అనుతాపాన్ని అనువదించలేను
ఎందుకలా కరుణార్ద్రంగా నవ్వుతావు?
నాలోనికి లేనిపోని ఆశల్ని రువ్వుతావు!

ఆఁ! ఏమిటి నువ్వనేది! నిజమేనా?
నిజమేనా? నా భవిష్య నిర్మాత్రివి నీవేనా? నీవేనా?
ఈ నితాంతధ్వాంతహిమానీసానువులమీద
ప్రాభాతప్రభాకరతేజోరాజి ప్రసరించనున్న దంటున్నావా!
ఈ నిరాశాసుప్త నిస్తబ్ధకాలాన
ఆశాచైతన్యసావేరీరాగఝరులు ప్రవహించనున్నా యంటున్నావా!
ఈ రుధిరాశ్రుపూరకాసారాంతరాన
ఆనందారవిందాలు అందంగా వికసింపనున్నా యంటున్నావా!
నా మనస్సున అనంతశాంతిచంద్రికలు కురుస్తా యంటున్నావా!
నా కంఠాన కవోష్ణకాంతిగీతికలు హసిస్తా యంటున్నావా!
నిజమేనా? నిజమేనా? ఓ దేవీ!
ఓ భవిష్యద్వాణీ!
నా హృదయరాణీ!

---

# ప్రతీక కవిత్వం

శ్రీ జి. రామమోహన్‌రావు

భాష అంటే తెలియని రోజుల్లో మానవుడు తన నిత్యజీవితం సుఖమయం చేసికొనటానికి కొన్ని మూగసైగ లుపయోగించి అవసరం తీర్చుకొన్నాడు. అవి అవ్యక్తమైన ఆనందాన్ని కలిగించాయి. కాల క్రమాన సైగలే సంజ్ఞలుగా మిగిలి వారి మధ్య స్థిరత్వాన్ని పొందాయి. సమాజాభివృద్ధికి సంజ్ఞలు బాగా తోడ్పడి భాషకు మూలాధారా లయ్యాయి. మానవు డుపయోగించిన సంకేతాలు అవ్యక్తమైన భాషలో పడుగులో పేకలా కలిసిపోయాయి. చివరకవి భాషను అభివృద్ధి చేశాయి. ఈ సంకేతాలు తరువాత కవిత్వంలో స్థానాన్ని సంపాదించి కవియొక్క మనో భావాలకు వాహకములుగావెలసి ప్రతీకకవిత్వానికి జీవనాడులైనవి.. ప్రతీక కవిత్వం, ప్రాక్తనమానవుని సంకేతాలు భిన్నదృక్పథాలలో వెల్వడినవి. ఈ రెండింటి ఉద్దేశాలు వేరుగనుక రెండు మార్గాలుగా పరిగ ణించాలి.

ఫ్రాన్సుదేశంలో తిరుగుబాటు వచ్చిన కారణంగా మానవహృదయాలు పాత పద్ధతులకు తిలోదకా లర్పించి క్రొత్తపద్ధతులకు ఆశలు నింపాయి. విప్లవాత్మకమైన మార్పులు అన్నిరంగాల్లోనేగాక సాహిత్యంలో కూడ వచ్చాయి. ప్రసిద్ధంగా కవిత్వంలో ప్రచారం పొందిన కొన్ని 'ఇజా'లకు ఫ్రాన్సుదేశమే పట్టం కట్టింది. ఈ 'ఇజా'లపై రాజకీయార్థిక సాంఘిక పరిస్థితుల ప్రభావం పూర్తిగా ఉంది. నాటి కవులు సంప్రదాయాన్ని వీడలేక కవితకు తుష్టి కలిగింపలేని కవులకు పుష్టి నిచ్చి ముందుకు నడచి చూపించింది ఫ్రాన్సుదేశమే అని చెప్పాలి.

పందొమ్మిదవ శతాబ్ద ప్రాంతంలో ఫ్రాన్సు దేశంలో నూతన కవిత ఆవిర్భవించింది. అది పాత రాతి యుగంపైన గోరీ కట్టి క్రొత్తపుంతలు త్రొక్కి నూతనాశలు చూపి మానవుల ఉద్రేకాలకు, ఉద్వేగాలకు నివాదమై ఉద్దేశాలను, ధర్మాలను సూక్ష్మదృష్టితో పరిశీలించి వెఱిమొఱి వ్యామోహాలను హేళనపాలుజేసి నిర్మాణాత్మకమైన కృషికి చేయూత నందించి సామాజిక దౌర్బల్యాన్ని సంఘ విద్రోహాన్ని మట్టుపెట్టి భావాలకు పదునుబెట్టి క్రొత్త కవితాలోకాన్ని సృష్టించింది ప్రతీక కవిత్వం (Symbolism). ప్రారంభంలో వికసించని మొగ్గలా ఉండి తరువాత కుసుమమై సుగంధాలను నలువైపులకు ముమ్మరంగా వెదజల్లింది. ఫ్రెంచిదేశీయులు మొదటలో హాస్యదృష్టితో చూడటంచేత అంతగా ప్రచార ప్రాబల్యం సంపాదింపలేకపోయింది. కాని ఆనాటి యువకులకు ప్రోత్సాహాన్ని యిచ్చి ప్రగతి మార్గానికి సోపానాలు నిర్మించింది. కవితలో క్రొత్తదనం ఉందని ప్రతికవి దానికొఱకు ఎదురుచూచినవాడే. అది ఒక ఉద్యమంగా మారి శతాబ్దాంతానికి మహోద్యమరూపం దాల్చి కవితలో సజీవంగా నిలిచింది.

కవితలో ప్రధానస్థాన మాక్రమించేది సంకేతం (Symbol). కవియొక్క మనోగత భావాలు ఈ సంకేతాల్లో నిండిఉంటాయి. అంతేగాక కవియొక్క సంస్కార సహృదయానికి ప్రతిబింబం సంకేతం. కవితలో కథకు ప్రాముఖ్యం లేకపోగా ప్రకృతి వర్ణన చూద్దామన్నా ఉండదు. కేవలం కవి ఏర్పరచుకొన్న పరిధిని అస్పష్టంచేసి సంకేతాలద్వారా తను చెప్పదలచుకొన్న విషయం వివరిస్తాడు. ముందు ప్రతీకలు అర్థమయితేగాని కవి ఉదేశించిన భావం తెలియదు. లేకపోతే అయోమయంగా సందిగ్ధంగా ఉంటుంది కవిత్వం. ఈ కవిత్వానికి తోడుగా వేదాంతం బయలుదేరి మనస్సును తాత్త్వికమార్గం వైపుకు మరలించింది. దానికి కారణం జర్మన్‌దేశపు తాత్త్వికులైన కాంట్, హెగెల్ మున్నగువారి వేదాంత

దృక్పథంకవిత్వంపైన ప్రభావం నెరపింది. ఆప్రభావం చేతనే కవి వేదాంతాన్ని సంకేతాలతోపాటుగా ప్రత్యేక అంశంగా చేర్చుకొన్నాడు. వేదాంతం కవితకు అంట గట్టినప్పటికి కవులు దానికి సంగీత ప్రాధాన్యాన్ని కలిగించి శ్రావ్యం చేశారు. కవి ప్రకృతిని పదే పదే చెప్పకుండా దాన్ని ఒక ప్రతీకగా గ్రహించి చెప్పటం పరిపాటి అయింది. చెప్పే ప్రతివిషయం సూటిగా చెప్పకుండ గజిబిజి చెయ్యటం అవలక్షణమేఅయినా అదొక మహాలక్షణంగా పరిగణింపబడింది. కవిత ధ్వన్యాత్మకమై శైలీమాధుర్యంగా రూపుదిద్దుకుంది. కవితలో వచ్చే ప్రతీకలు విషయాన్ని దృశ్యాత్మకం చేస్తాయి. పైన చెప్పినవి కవితకు ప్రధాన లక్షణాలు. ఈ లక్షణాలు ఆయా కవుల రచనల్లో ప్రస్ఫుటంగా గోచరిస్తాయి.

ఫ్రెంచి దేశంలో ఈ కవిత బయలుదేరిన తరువాత నిర్వచనాలు విమర్శలు వచ్చాయి. కొందరి కవితను ఈ విధంగా నిర్వచనం చేశారు: "Whether a real school of symbolism ever existed remains a problem of specu-lation...Each poet developed and repre-sented a single aspect of an aesthetic doctrine that was perhaps too vast for one historical group to incorporate. But more than on any other article of belief, the symbolists united with Mallarme in his statements about poetic language. The theory of the suggestiveness of words comes from a belief that a primi-tive language palf-forgotten half-living, exists in each man. It is language posses-sing extraordinary affinities with music and dreams." కొంతమంది కవిత్వంలో ఉపయోగించే సంకేతాన్ని ఈ విధంగా వ్యాఖ్యానం చేశారు: "A symbol is used to embody a feeling neither relevent to the symbol nor rele-vent to anything else of which the poet is conscious, the poet expresses his feeling as best he is able without understanding it." సంకేతం కవిత్వానికి ప్రాణం. సూక్ష్మదృష్టితో పరిశీలిస్తేగాని ఆ కవి వాడిన సంకేతంయొక్క పరిధి అవగతం కాదు. ఈ సంకేతం ప్రతీక కవులకు బాగా ఉపయోగించింది.

1870–1880 ప్రాంతంలో ప్రతీక కవితోద్యమానికి 'మలార్మే' మకుటంలేని మహానాయకుడుగా స్థిరపడ్డాడు. అతనితోపాటు వెర్లేన్, పాల్ వేలరీ, రింబాడ్, బాడ్‌లేర్ ప్రసిద్ధంగా పేర్కొనదగినవారు. వీరందరిలోకంటె కవితపై నలభై ఏళ్ళపాటు ఏకచ్ఛత్రాధిపత్యాన్ని వహించినవాడు మలార్మే. ఫ్రాన్సులో కవితలు వస్తుండగానే అమెరికాలో ఎలెన్‌పో రచన సాగించి తన రచనలు ప్రచురించాడు. ఆ రచనల ప్రభావం ఫ్రెంచి కవులను ముంచెత్తింది. పో ప్రభావానికి బాగా ప్రభావితుడైనవాడు బాడ్‌లేర్. తను ఎలెన్‌పోకు నిజమైన శిష్యునిగా నిరూపించుకున్నాడు. పుట్టింది కవిత ఫ్రాన్సుదేశంలోనే అయినా అమెరికా ఇంగ్లండుదేశాల్లో పెరిగింది ఒకప్రక్క అమెరికా మరోకవైపు ఇంగ్లాండు కవితలను పుంఖానుపుంఖంగా ప్రచురించారు. మలార్మే వారానికొక పర్యాయం సాహితీసదస్సు నేర్పాటు చేసేవాడు. ఆ సభకు ముఖ్యంగా ఆంగ్ల కవులైన ఆస్కార్‌వైల్డు, ఆర్థర్ సిమన్సు, జార్జిమూర్, డబ్ల్యు ఏట్సు మొదలైన వారు వచ్చేవారు. మలార్మేకు వారిమధ్య చర్చలు జరుగుతుండేవి వీరిపైన మలార్మే ప్రభావం విడదీయరానిది.

మలార్మే, వెర్లేన్, బాడ్‌లేర్ ముగ్గురూ ఫ్రెంచి దేశీయులే. వీరు ముగ్గురు ఒకే ఉద్యమం నుండి బయలుదేరినా వారి కవిత భిన్నదృక్పథాలకు నిలయమై భిన్నమార్గాలకు పయనించింది. మలార్మే ప్రతివిషయాన్ని ధైర్యంగా చెప్పాడు. పదాలకర్థాలు తీవ్రంగా శోధిస్తేగాని అవగతం కావు. అతడుపయోగించిన ప్రతీకలు శైలికనుగుణంగా ఉండి ధ్వన్యాత్మకమై శైలీమాధుర్యనిలయాలై ఉంటాయి. వెర్లేన్ కవితలో ప్రతిబింబించిన ఉద్వేగాలుగాని ఆశయాలుగాని చాల నిష్కర్షగావుండి సరళమై స్పష్టంగా ఉంటాయి కవిత్వాన్ని పరిశీలించినయెడల అతని తరువాత వచ్చిన కవులు సృష్టించిన కవితకంటె ఒకమెట్టు పైన ఉంటుంది ఇతని కవిత్వం. అంతేగాక అందులో నిర్మాణాత్మకమైన ఘటనలు కాన్పిస్తాయి. రూపకాలంటే మహామోజు. పదాలు శ్రుతిపేయమై వీనులవిందు చేస్తాయి. రింబాడ్ మొదటలో విరివిగా కవితను వ్రాయటం ప్రారంభించాడు కాని ప్రచురింపలేకపోయాడు. ఎందుచేతనోగాని అతడు తన

రచనలను తగులబెట్టి అబిసీనియా దేశంలో దంత వ్యాపారస్థుడుగా ఉండిపోయాడు. అతని కవిత్వంలో తీవ్రత్వం ఎక్కువ. అది అఘాతం. దానికి తోడు కావలసినంత మార్మికత్వం. తరవాత శతాబ్దంలోని కవులు రింబాడ్‌ను అనుకరించటం ప్రారంభించారు. అతన్ని ఆదర్శమూర్తిగా గ్రహించి ఆ పద్ధతిలో కవిత్వాన్ని పెంపు చేశారు. బాడ్‌లేర్‌కు మార్మికత్వమంటే మక్కువ ఎక్కువ. దానికి కారణం స్వీడిష్ కవియైన ఎమనల్ స్వీడన్‌బోర్గ్ యొక్క ప్రభావమని తను విక్టర్ హ్యూగోపైన వ్రాసిన వ్యాసంలో వివరించాడు. అతడు 'Correspondence' అన్నగీతంలో ప్రకృతినే ఒక దేవాలయంగా భావించి అందులోవున్న వృక్షరాజాలను దేవాలయానికి స్తంభాలుగా చిత్రిస్తాడు. ఇంగ్లాండు కవియైన ఏట్సు ఫ్రెంచి కవులతత్వాన్ని ఆంగ్ల కవుల తత్వాన్ని తన కవితలో చూపిస్తాడు. ఇతడు ప్రత్యేకంగా మలార్మే పరిచయంకోసం ఫ్రాన్సువెళ్లి ఎక్కువగా కవిత్వాన్ని గురించి మలార్మేదగ్గర తెలిసికొన్నాడు.

ఈ కవులు తమ కవితల్లో ఉపయోగించిన ప్రతీకలు తమ వ్యక్తిగత జీవితానికి సంబంధించినవిగాను, మరికొందరు వ్యక్తిగత జీవితంతో ఎట్టి సంబంధం లేకుండా పరాశ్రయములైన ప్రతీకలను వాడారు. మలార్మే ఆత్మాశ్రయుడై సంకేతాలు వాడాడు. అవి వ్యక్తిగత జీవితంతో ముడిపడి ఉంటాయి. టి. యస్. ఇలియట్ సమాజాన్ని దృష్టి యందుంచుకొని ప్రతీకలు వాడాడు. మలార్మే ప్రతీకలు వాస్తవానికి చాల దూరంగా ఉంటాయి. ఇలియట్ ప్రతీకలకు వాస్తవానికి సన్నిహిత సంబంధం ఉంటుంది.

సంకేతం ఏమైనప్పటికి ఆ సంకేతాన్ని గూర్చి "The credo of the symbolists is caught in Mallarme's desire to make every term a plastic image the expression of thought, the stir of a feeling and the symbol of philosophy" అని వివరించారు.

ప్రతీక కవులు ప్రసిద్ధంగా కొన్ని ప్రతీకలు వాడారు. అవి సామాన్యంగా అందరూ ఉపయోగించారు. మలార్మే, బాడ్‌లేరులు సముద్రాన్ని గాంభీర్యానికి, స్వేచ్ఛకు చిహ్నంగా స్వీకరించారు. టి. యస్. ఇలియట్‌లాంటికవులు 'గులాబి'నిసొగసుకుసౌందర్యానికి, 'ఆలివ్'ను శాంతికి, విజయానికి, 'చంద్రుణ్ణి' ప్రేమకు సంకేతాలుగా వాడారు. ఇలియట్ 'Fisher King' అసమర్థునికి, 'Deliverer' క్షీణదశకు ప్రతీకలగా గ్రహించాడు. వివిధదేశాల్లో ప్రతీక కవిత్వం యొక్క ప్రచారం పెరుగుతున్నది. రకరకాలైన సంకేతాలు కవితలో ప్రవేశించి ప్రాబల్యాన్ని పెంచాయి. ప్రముఖ కవుల పోషణలో సింబాలిజమ్ నలుప్రక్కల వ్యాపించింది యూరప్‌లో. కాని రష్యాలో దీనిని టాల్‌స్టాయి తీవ్రంగా ఎదుర్కొన్నాడు కవిత్వం తనను ఆకర్షింపలేకపోయింది. అయోమయాన్ని, సందిగ్ధాన్ని చూచి విసుగెత్తిపోయాడు. అతడు వాస్తవజీవిత చిత్రణకు సన్నిహితుడు గనుక విపరీత చిత్రణ అతని మనస్సుకు నచ్చదు అతని రచనలు వాస్తవికజగత్తునుండి వెల్వడినవి. విచిత్రాలకు చోటులేదు. నిర్వేదంతో, నిర్వీర్యంతో సతమతమయ్యే మానవుని ఆక్రందనం అతని రచనలకు ప్రాణం. రచనకు సామాన్యుడు పాఠకుడు; వారి కర్థమయ్యే రీతిలో ఉంటాయి. కాని ప్రతీక కవితలు సామాన్యుడిని మించాయి గనుక ఆ విధంగా ఉండటం టాల్‌స్టాయికి నచ్చలేదు. ఆ కారణంగానే కవిత్వాన్ని ఆదరించలేకపోయాడు.

సింబాలిజమ్‌పైన ఇతరములైన సాహిత్య ప్రక్రియలు ప్రభావాన్ని చూపాయి. అందులో ప్రధానమైనవి ఇమేజిజమ్, సర్రియలిజమ్ మున్నగునవి. అమెరికాలో ఎజ్రా పౌండు లాంటి ప్రముఖులు ఆధునిక నాగరికతను ద్వేషించి విసుగెత్తిపోయారు. వారు దానికి ఉద్వేగమానసులై ప్రత్యణువును సూక్ష్మపరిశీలనచేసి తూర్పార పట్టటానికి ముందుకొచ్చారు. టి. యస్. ఇలియట్‌కు ఎజ్రాపౌండురచనలు ఒక నిర్దిష్ట మార్గం చూపి రచనలకు ఊపిరి నిచ్చాయి. వీరిరువురుకు హిందూవేదాంతంపైపు దృష్టి కలిగింది. అప్పటికి ప్రపంచంలో భారతీయ వేదాంతానికి మంచి ప్రాశస్త్యం లభించింది. ఇలియట్ భారతీయ ఉపనిషద్వాక్యాలు —

దత్త దయధ్వమ్ దమ్యత

శాంతిః శాంతిః శాంతిః అని కవిత మధ్యలో ఈ చరణాలను కావాలని ఉపయోగించాడు. అతని

శిల్పానికి మకుటప్రాయము లివి. ఇలియట్ భావం చాల తీవ్రమైంది. అతడేది చెప్పినా క్రొత్తగా ఉంటుంది. కవితలోను, విమర్శలోను నూతన సరణిని, వినూతనదృక్పథాన్ని ప్రవేశపెట్టాడు. ఇలియట్ తీవ్రవాది గావటానికి ప్రపంచ యుద్ధాలే కారణం. నాడు సంభవించిన నిరాశ నిస్పృహ అతని హృదయాన్ని పట్టుకొని పీడించాయి. ఈ విధమైన వాతావరణంలో సత్యాన్వేషణ కాంక్ష పుట్టింది. జరిగేది జరగబోయేది తెలిసి కొనాలన్న కుతూహలం, మన దృష్టికి కాన్పించే ప్రపంచం మిథ్యయని, మానవుడు ధర్మాన్ని గుర్తెరింగి సాధనతో, జ్ఞానంతో ముందుకువచ్చి ఉద్ధరించుకొనటం, తాత్త్వికపరమైన నైరాశ్యం పోవాలంటే జీవితంలో నిష్కామకర్మ ఆచరించాలన్న ఉద్దేశాలు ఇలియట్‌లో భావ సంచలనం కలిగించాయి.

తెలుగులో సింబాలిజమ్ చాల తక్కువనే చెప్పాలి. ప్రాచీనులు అచ్చటచ్చట సంకేతాలు వివరించారు. సంకేత లుండటంవలన ఆంగ్లసాహిత్యం యొక్క ప్రభావమని చెప్పడానికి వీలులేదు. కవులు వెలుతురునువిజ్ఞానానికి చీకటినిఅజ్ఞానానికి సంకేతాలుగా ఉపయోగించారు. ఇవి చాల ప్రసిద్ధమైన ప్రతీకలు. ఈ విధమైన ప్రతీక లచ్చటచ్చట చూడగలం. ఇవి వారి ఉద్దేశాన్ని అనుసరించివచ్చినవి మాత్రమే. ఇందులో మార్మికత్వం సందిగ్ధతగాని ఏవీలేవు. ప్రతీకలు గ్రహించి వాడినప్పటికి వాటిని పరిమితిగా ఉపయోగించారు. యూరప్‌లో బయలు దేరిన నిరాశా నిస్పృహలు మన కవులకు నాడు లేవు. వారి దృష్టి కేవలం ఆ సంకేతాలను వాడటంగాక సాహిత్యాన్ని రసమయంచేసి నీతులు ధర్మాలు నేర్పి మానవునియొక్క బుద్ధిని పెంచి అజ్ఞానాన్ని పోగొట్టి జ్ఞానాన్ని కలిగించటమే పరమావధి. అందుచేతనే ప్రాచీనులు కథా విధానాన్ని అనుసరించి నీతు లుపదేశించటం జరిగింది. వారి దృష్టి అలౌకికమైంది. వ్యవహార ప్రపంచంలో జరిగే సంఘర్షణ అనవసరం. అలౌకికదృష్టి ఉండటంచేతనే భగవదంశాన్ని పదేపదే వివరించారు. ధనికుడు బీదవాడు అనే తారతమ్యం తెచ్చారు. ఆ సాహిత్యమంతా రాజుల అడుగులకు మడుగులొత్తి వారి యిష్టానుసారంవ్రాసి కావ్యాలంకితం గావించి అగ్రహారాలు పొందారు. నాటి కవులు రాజుల చిత్తాలకమ్ముడు పోయారు. వారి చిత్తానికి మించి ఒక్కవిషయంకూడా బయటకు రాలేదు. కులం మతం పేరిట ధర్మోపన్యాసాలు చేశారు. పురాణాలుగాని, కావ్యాలుగాని మానవుని యొక్క బుద్ధివికాసాన్ని పెంపొందించుటకే తోడ్పడ్డవి. ఆనాటి రాజకీయార్థిక సాంఘిక పరిస్థితు లట్లావుండటంచేత సాహిత్యం ఆ విధంగా బయలుదేరి ఉండవచ్చునని సగం తృప్తిచెందవచ్చుకాని అట్టడుగునుండి క్రుగ్గిపోయే సామాన్యజీవి జీవితం వారి దృష్టిలో చోటుచేసుకోలేదు కాలక్రమాన పరిస్థితులు మారిపోవటంతో ఆంగ్లవాఙ్మయసంపర్కం కలిగి ఆధునిక సాహిత్యం బయలుదేరింది. సామాజికదృష్టి గ్రుడ్డిలో మెల్లగా ఉన్నది. కాని ఆంగ్లసాహిత్య ప్రభావంతో తెలుగు కవితలో రకరకాలైన ప్రక్రియలు బయలుదేరి తెలుగుసాహిత్యపరిధిని పెంచాయి. అయితే అయోమయమైన ప్రతీకలంతగా అభివృద్ధి చెందలేదు. చిన్నయసూరి మిత్రలాభం, మిత్రభేదం మున్నగు కథలో పశుపక్ష్యాదులు ఒక్కొక్క తత్వానికి ఒక్కొక్క ప్రతీక అని చెప్పవచ్చును.

ఆధునిక కవిత్వంలో సింబాలిజమ్ అంతగా లేకపోయినా అభ్యుదయ కవిత్వంలో పూర్తిగా ఉంది. వారు కవిత్వంలో చాల రకాలైన 'ఫీట్సు' చేశారు. వ్యాకరణం, ఛందస్సు నడుం విరగ్గొట్టి రచన చేస్తామని బెదరించి అంతపని చేశారు. సంప్రదాయ మంటె తలనొప్పి. స్వేచ్ఛావాయువులు పీలుస్తూ సాగిపోయే కవితను వారు అభిలషించటంచేత కవిత్వంలో విచిత్ర ధోరణులు బయలుదేరాయి. అభ్యుదయ కవులు కవిత్వాన్ని అర్థంగాకుండాచేసి సామాన్య పాఠకున కర్థంగాకుండ గజిబిజి చేశారు. ఈ కవిత్వంలో అచ్చటచ్చట పుంఖానుపుంఖంగా ప్రతీకలు కాన్పిస్తాయి. కేవలమూ ప్రతీక కవితా ధోరణిలో కవితలు వెలువడ్డాయి. వీరిపైన పాశ్చాత్యవాఙ్మయ ప్రభావం అధికంగా ఉంది. వారు చూపిన మార్గాల్లో చాలవరకు పీరుపయనించారు.

ప్రధానంగా 'త్వమేవాహం' ప్రతీక కవిత్వానికి చెందింది. ఆనాడు తెలంగాణాలో జరిగిన పోరాటం, రజాకార్ల దోపిడీతనం మున్నగు సంఘటనలు ఆ కావ్యానికి ఆవేశాన్ని కలిగించాయి. ఆరుద్రకావ్యంలో

వివిధముల్లైన ప్రతీక లుపయోగించారు. ఆ ప్రతీకల మాటున తీవ్రమైనభావాలు పెనవేసికొని ఉన్నాయి. అందులో ఉపయోగించిన ప్రతీకలు చాల చిత్రంగా ఉంటాయి. ఇసుకగడియారం నేటి కాలానికి, నీటి గడియారం జరిగిపోయిన కాలానికి, గంటలు ధనికు లనబడే పెట్టుబడిదారీ వ్యవస్థకు, నిమిషాలు మధ్య తరగతి వర్గానికి, సెకండ్లు కష్టించి చెమటోడ్చి పనిచేసే శ్రామికజనావళికి, చిన్నముల్లు బడా పెట్టు బడిదారుల మనస్తత్వానికి, స్ప్రింగ్ విప్లవాన్ని లెక్కించే సాధనంగాను, అలారం సామాజిక సమకాలీన పరిస్థితులకు, పైథాగరస్ థీరం సామ్యవాదవ్యవస్థకు, సర్వము బూర్జువా ధోరణికి సంకేతాలుగా ఉపయో గించారు. ఇవిగాక రంగులుకూడ సంకేతాలుగా ఉపయోగించారు. ఎరుపు విప్లవానికి, ఆకుపచ్చ మేధాసంజనితవర్గానికి, నీలం కార్మికవర్గానికి, పసుపు పచ్చ కాంగ్రెసుపార్టీకి సంకేతాలు. లోహాలైన ఇనుము, రాగి, తుత్తునాగము మున్నగునవి ధనికులకు, మధ్య తరగతికి, శ్రామికవర్గానికి ప్రతీకలగా వెలశాయి. ఈ విధంగా అరుద్ర తన కావ్యాన్ని సాంకేతికంగా తయారుచేశారు. ఈ కావ్యంపైన టి. యస్. ఇలియట్, ఇ. ఇ. కమింగ్స్ ప్రభావముద్ర ఉన్నది. ఈ కావ్యం గాక ఆరుద్రదే మరో కావ్యమైన 'సినీవాలి'లోకూడ ఆధునిక నాగరికతా ధోరణులను నిరసిస్తూ వర్గ సంఘర్షణ, వర్గచైతన్యం వివరించారు. ఈ రెండు కావ్యాలపైన ఆంగ్లభాషా సంపర్కం విడదీయరానిదిగా కాన్పిస్తుంది. అరుద్ర 'త్వమేవాహం' కావ్యంలో ఒక చోటను—

మన మానవసమాజమొక పూరా విప్పారిన పుష్పం

> అట్టడుగున పరిశ్రమించే జనావళి
> మనకందరికి రక్షకపత్రావళి
> కడుపుమంట సైరింప శాఖ
> కీటకాల నాకర్షించే పతాక
> అవకాశాలవల్ల తలెత్తినవర్గం
> పరాగప్రాప్తి నోచుకొనే కీలాగ్రం
> శ్రీలుపొంగిన కేసరాలధర్మం
> విక్రాంతి పరపరాగ సంపర్కం

ఈగీతం సామ్యవాద ధోరణికి ప్రతీక. పువ్వు నకు అట్టడుగున ఉండేవి రక్షకపత్రాలు. పరపరాగ సంపర్కం వీటికుండదు. పరపరాగ సంపర్కం కీలాగ్ర మునకే ప్రాప్తిస్తుంది. ఇందులో రక్షకపత్రాలు శ్రామికవర్గానికి సంకేతం. కీలాగ్రం పెట్టుబడీదారి వర్గానికి చిహ్నం. శ్రామికులు కండవిరచి పనిచేస్తేనే పెట్టుబడిదారులకు కాస్త ఊరట కలుగుతుంది. శ్రామికులు నిలబడితేనే పెట్టుబడిదారులు నిలబడ గలరు. కాని శ్రీమంతులు అనుభవించే అనుభూతి అనిర్వచనీయం. వారికే ఐశ్వర్యం ప్రాప్తిస్తుంది. ఆయావర్గాల మధ్యఉండే సంబంధాన్ని పరపరాగ సంపర్కంగా సంకేతించి రచించారు.

అజంతా 'చెట్టుకూలుతున్న దృశ్యం' అనే గేయంలో చెట్లు కూలిపోవడం ఆశాభంగంగా భావించి వర్ణించటం జరుగుతుంది. వెంకట్రావు నిరుద్యోగి. జీవితంలో నిరాశ నిస్పృహ అధికమై ప్రతి క్షణం చెట్లు కూలుతున్నట్లు కన్పించి అతనిని నిర్వీర్యం చేస్తుంది. అసలు వెంకట్రావు జీవితం గాలి వెల్తురూలేని గదిలాగ మరీ దీనంగా ఉంది. అతని దృష్టికెక్కువగా ఆశాభంగాలే కన్పిస్తాయి. చుట్టూ పరాజయభారంతో కృంగుతూఉన్న వృక్షాలు ఉన్నాయి దిక్కూమొక్కూ లేనివాడుగా రోడ్లమీద నడుస్తూఉంటే జనసంచారం ఉండదు. చెట్లపై వున్న ఆకులుసైతం అల్లలాడవు. టెలిఫోన్ తీగల్లో వార్తాప్రసారం సాగదు. అంతా స్తబ్దమైపోతుంది. తన జీవితాన్నిచూచి సూర్యుడు ఖిన్నుడౌతాడు. ఆగ్రహం పట్టలేక భూదేవి బద్దలౌతుంది. ధర్మ దేవత ఉన్నకాలు విరుచుకొంటుంది. ధర్మం న్యాయం అనేవి మధ్యతరగతిజీవియైన వెంకట్రావు జీవి తాన్ని బాగుపరచలేవు. అతడంటే ద్వేషం, వైషమ్యం ఎక్కువ. పరిష్కారానికి వచ్చేసరికి న్యాయం చేకూర్చ లేక అట్టడుగునకు త్రొక్కివేసి నాశనం చేస్తుంది.

రాజకీయవేత్తలు ఇలాంటి నిరాశాజీవులను తమక్రింద బానిసలగా చేసికొని జీవితంలో చెలగాటాలు ఆడతారు. అంత చెలగాటాలాడి నప్ప టికి వెంకట్రావు పాలీదులా నగరాన్ని అల్లుకొని పోతాడు. అంటే తనలాంటి జీవితాలు నగరంలో చాలా ఉంటాయి. ఏమూలచూచిన వెంకట్రావులాంటి వారు కనబడుతూనే ఉంటారు

> "నిరుద్యోగి వెంకట్రావు ఈ నగరంమీద
> ఒక మచ్చ

బాధ అనే దీపం పట్టుకొని
సర్వనాశనం అనే తాళంచెవి పట్టుకొని
వెంకట్రావు జీవితంఅనే చీకటినరకకూపంలో'

ఇందులో బాధ జీవితంతో తాను వ్యథచెందే 'ఆకలి'ని బాధగాను, దీపంగా ఆ బాధకు 'తాళ'మే పరిష్కారమార్గంగాను తీర్చి జీవియొక్క ఆవేదనా జీవితాన్ని వర్ణించారు.

ఈ విధమైన మధ్యతరగతి మానవుణ్ణి ఉద్దేశించి బాలగంగాధర తిలక్ 'కిటికి' 'దీపం' 'గొంగళి పురుగులు' మున్నగునవి ప్రతీక కవితా మార్గంలో రచించారు

'కిటికీ' అనేగేయం మనఃపరిధికి సంకేతం. కిటికీగుండా రకరకాలైనవి ప్రాప్తిస్తాయి. ఆవిధంగానే మనస్సులో రకరకాలైన ఆలోచనలు వస్తుంటాయి మనఃపరిధిని దృష్టియందుంచుకొని 'కిటికీ' అనే గేయాన్ని వివరిస్తారు.

'దీపం' మానవునియొక్క అంతర్ముఖదృష్టికి సంకేతం. ఈ దృష్టి ఉండటంవలన తన్నుతాను అర్థం చేసికొనటానికి ప్రయత్నించి సంస్కరించుకొంటానికి ప్రయత్నిస్తాడు. అతని వికాసమే వెలుతురు. ఆ వెలుతురే జ్ఞానదృష్టికి చిహ్నం.

'గొంగళిపురుగులు' తిలక్ ప్రతీక కవితల్లో మణిమకుటం ఆటు రాజసౌధాల్లో మెలగుతూ కాలుమీద కాలువేసికొని మీసాలకు సంపెంగనూని పులుముకొని హాయిగా ఆనందాన్ని అనుభవించే ధనికుడుగాక, నిత్యదారిద్ర్యంతో బాధ వ్యథచెంది జీవితాన్ని ఫుట్‌పాత్‌మీద దీనంగావదలి నిత్యమూ కడుపుచించుకొని కాళ్లమీదపడి రక్షింపుమని వేడుకొనే వ్యక్తిలా గాక మధ్యరకంగా కోటేశ్వరరావు, వీరేశ్వరరావు, జోగేశ్వరరావుల మనస్తత్వం విచిత్రమైంది. వీరి చిత్రణమే 'గొంగళిపురుగులు'

బల్లపరుపు జీవితంక్రింద కాషన్‌గా దాచిన
కోర్కెల సీక్రెట్‌బాక్సులోంచి తీసి
ఉద్రేకాన్ని సెక్సుని శృంగారాన్ని
క్రైముని, పాక్‌ని లాటరీకాగితాన్ని
చాటుగుండా చూచుకొని నవ్వుకొని
మీసం మెలేసుకొని
మాట్లాడకుండా జెంటిల్మన్‌లా
మత్తుగాపడుకుంది గొంగళిపురుగు.

మధ్యేమార్గంలోఉండి జీవితం అనుభవించే వారికి గొంగళిపురుగు సంకేతం. గుమస్తా, టీచర్, కార్మికుడు కావచ్చును. వీరందరూ ఆ జాతికి చెందినవారే.

గొంగళి పురుగులు తిన్నంతసేపు తిని తిరిగినంతసేపు తిరిగి దొరికినంతసేపూ అటూఇటూ తిరిగి దొరక్కపోతే అలసిసొలసి ఏదోమూలను నక్కి నిశ్శబ్దంగాఉండి మత్తుగా నిద్రపోతాయి. మధ్యతరగతి కుటుంబీకుడు తన చేతులో ఉన్నంతసేపు పొట్ట నింపుకుంటాడు. ఎంతకాలమని ఆవిధంగా పొట్ట నింపుకోగలడు? జీతపురాళ్ళు వచ్చేవరకు ఎదురు చూడవలసిందే. అవి రాకముందే అంతకన్న ఎక్కువగా అప్పు పెరిగిపోతుంది; తనబాధ ఎవరితోను చెప్పడు. చెప్పాలనికూడ ఉండదు. నోరురాదు. చేయి ఆడదు. జీవితమే ఎడారిబతుకుగా మారిపోతుంది. ఇంత అధ్వాన్నస్థితికి తనలోతాను నవ్వుకొని మత్తుగా నిద్రపోతాడు. అంతకన్నా మిన్నయైనమార్గం మరొకటిలేదు. ఉన్నప్పటికి అది దృష్టికందదు. అందాలంటే తాను పనికిరాడు. ఆ జీవితానికి గొంగళి పురుగులు మంచిసంకేతం.

ఆఫీసర్‌వస్తే పాల్యూట్ చేస్తుంది కుడిచెయ్యి
ఆకలేస్తే గబగబా రాస్తుంది కుడిచెయ్యి
జేబులోంచి సెకం హాండ్ సిగిరెట్టుముక్కల్ని
తీస్తుంది కుడిచెయ్యి

ఇందులో 'కుడిచెయ్యి' జీవితాధారానికి సంకేతం. జీవితాధారం లేకపోతే తనేమైపోతాడో తనేపని చేస్తాడో తనకేతెలియదు.

ఆంగ్ల కవియైన టి. యస్. ఇలియట్ ప్రభావాన్ని అభ్యుదయకవుల్లో పొందినవారు ఆరుద్ర, బైరాగి ప్రధానులు వీరు పొందినంతగా మరియే యితర అభ్యుదయకవి పొందలేదనుకుంటాను. టి. యస్. ఇలియట్ పోకడలు తమ రచనల్లో చూపించి తృప్తిచెందారు. బైరాగి 'నూతిలో గొంతుకలు' అన్నపేరు టి. యస్. ఇలియట్ ప్రభావంచేతనే దానికాపేరు పెట్టారు. 'మేలుకొన్నవాడు' ఆ

యంలో బైరాగియొక్క ఆధ్యాత్మికభావం గోచస్తుంది.

> నడిరేతిరిని మేలుకొన్నవాడెవ్వడు?
> దివ్వెల నమ్మికలేమి నీడలకుట్ర
> చీకటుల మెతకబుద్ధి, ఎవరికెరుక
> గోరీలా అలికిడిలేని గదిలోపల
> ఎందుకు పడినట్లో వెలుగుమరక

ఇందులో చీకటి అజ్ఞానానికి, వెలుతురు విజ్ఞానానికి 'నీడలకుట్ర' నిత్యమూ మానవుడు పడే యమయాతనలకు, 'మెతకబుద్ధి'అసమర్థతకు, గోరీ, గది అంధకారానికి సంకేతింపబడి ఆ సంకేతాల మాటున తీవ్రమైన సంఘర్షణ ఆధ్యాత్మిక దారిద్ర్యం మున్నగునవి కాన్పిస్తున్నాయి.

శ్రీరంగం నారాయణబాబు 'గడ్డిపరక' కష్టపడి చెమటోడ్చి కండలువిరిచి పొట్ట గడుపుకొనే వ్యక్తిని ఉద్దేశించివ్రాసింది. గడ్డిపరక పనికిరాని వ్యక్తికి, సమాజంలో హీనంగా చూడబడే జీవికి, పెట్టుబడిదారుల కాళ్ళక్రింద నలిగిపోయే మానవునకు సంకేతం. గేయమంతా అతని జీవితాన్ని ఆధారం చేసికొని నడిపిస్తారు

> నడవండి నడవండి నామీంచి నడవండి
> గడ్డిపరకను గడ్డిపరకను
> పూజా సమయాల పూవును
> దూర్వాంకురాన్ని అవసరంతీరాక
> అవతల కనబడితే చుల్కనగ చూచేటి
> గడ్డిపరకను గడ్డిపరకను

జాతిని ద్వేషించే మలోకజాతి చైతన్య రహితమై కూలిపోతుంది. అవసరం ఉన్నప్పుడల్లా తన దగ్గరకు పిలిపించుకొని తమ యిష్టమువచ్చినట్లుగా పనిచేయించు కుంటారు. సమయంవస్తే ఆజీవితాన్ని నేలమట్టంచేసి నడచిపోతారు. ఇంతకన్న దౌర్భాగ్యమైనస్థితి మరొకటేముంది? ఇంత దౌర్భాగ్యస్థితి కలిగించేవారందరు పల్లకీనుండి దిగిన పెళ్లికొడుకులు. వారికి దిగటముమాత్రమే తెలుస్తుంది. దిగినతర్వాత ఏ పట్టుతివాసి అయినా కాన్పిస్తే దాని మీద చతికిలబడి కలలుగని మీసాలు మెలేస్తాడు. గతులుకల్పిస్తే జీవయాత్రసాగించి తనగొప్ప తాను చాటించుకొని ఎదుటివాడి కడుపుకొట్టి తనపొట్ట నింపుకుంటాడు.

గేయంపేరే ఒక ప్రతీక 'పూజాసమయం' నిర్మాణాత్మక, కృషికి 'పూవు' జీవికి జీవితానికి, 'పెళ్లికొడుకు' పెట్టుబడిదారునకు, 'పట్టుతివాసి' కండలుపిండి పనిచేసేవాడికి, 'పశువు' మానవత్వం మంటగలిపి కర్కశంగా ప్రవర్తించేవారికి 'పాయసం' కార్మికుని ఘర్మకణాలకు, 'రక్తపతాకం' విప్లవానికి సంకేతాలుగా ఉపయోగించారు. ఇందులో నారాయణబాబు నవసమాజ నిర్మాణానికి పునాది వేయటానికి సమానత్వాన్ని ప్రతిపాదించి జీవితం శాశ్వతం చేయాలని ఆ సంకల్పసిద్ధికి సామ్యవాదం ధ్యేయమని భావించారు. అందులో ప్రధానుడు కార్మికుడు.

ఒక ప్రత్యేక కవిత్వానికి చెందినవారు కాదు కరుణశ్రీ. వారిలో వివిధములైన కవితలున్నాయి. వ్రాసిన కవితల్లో 'తప్పులేని తమ్ముడు' ప్రతీక కవిత్వానికి మొదటిమెట్టులాంటిది.

హరిజనుడు. అంటరానివానిగా భావించి అవతలకు నెట్టారు సమాజంనుండి. గుడిలో దైవాన్ని చూడటానికి అస్కారంలేదు. నీళ్ళు ముట్టటానికి హక్కులేదు. జట్టుకలవటానికి స్థానంలేదు. ధ్వజస్తంభానికి దణ్ణాలు పెడితే మడి గట్టుకున్నవారు బయటకు పొమ్మని కళ్ళెజేస్తారు. అతని బ్రతుకు హీనమైంది. అట్టివానిస్థితిని కరుణశ్రీ హృదయ విదారకంగా చిత్రించారు.

ఇందులో 'తప్పులేని తమ్ముడు' 'బిడ్డ' హరిజనునకు, 'దుమ్మెత్తిపోయటం' ద్వేషించటానికి 'జేజాయి' భగవంతునకు 'రక్కసులు' మడిగట్టుకున్నవారికి సంకేతాలు.

వారిగీతమే మరొకటి

> చెల్లరే విల్లువిరచునే నల్లవాడు
> పది పదారేండ్లు యెలరాచ పడుచువాడు
> సిగ్గు సిగ్గంచులేని గర్జించువారు
> కనులుగుట్టిన తెల్ల మొగాలవారు

'నల్లవాడు' భారతీయుడు, 'తెల్లమొగాలు' ఆంగ్లేయులకు సంకేతం.

నండూరి సుబ్బారావు 'ఎంకి పాటల'లో గోవు మాలచ్చిమి అనే గీతంలో ఖండిక ప్రతీక కవిత్వానికి చెందింది. గోవు మాలచ్చిమి సకల సంపదలకు అనంతమైన సుఖమునకు సంకేతం. గోవును లక్ష్మిగా స్వీకరించి రచించారు.

ఈ విధంగా కవులు కావ్యాల్లో ప్రతీక కవితలు సాగించి రచన చేశారు. ఈ విధమైన ప్రతీక కవితా ధోరణి తెలుగు కవిత్వమునందేగాక ఇతర సాహిత్యము లందుకూడ గలదు. బెంగాలీ, అస్సామీ, కాశ్మీరీ సాహిత్యములం దిట్టి కవితలు ప్రసిద్ధం. వంగ కవులైన బుద్ధదేవబోస్, జీవనానందదాస్, అమియ చక్రవర్తి మొదలగువారు ఆధునికులు. వీరందరిపైన టి. ఎస్. ఇలియట్ ప్రభావం ముమ్మరంగా ఉంది. కలకత్తా కళాశాలలో చదవటంచేత చుట్టుప్రక్కల వాతావరణం వారి దృష్టిని చేరుకొని రచనల్లో ఆయా పరిస్థితులు, వ్యవస్థలో సంభవించే సమస్యలు హృదయాన్ని కలవరపరచాయి. ఆ కల్లోల భావంచేత వారిలో చైతన్యం వెల్లివిరిసింది. శాస్త్రవిజ్ఞానం ఒక చేతబట్టి మరొక చేతో మనోవిశ్లేషణశాస్త్రాన్నిబట్టి తమ భావాలకు పదునుబెట్టి కవితలు వ్రాయటానికి వారు సంకల్పించారు.

అస్సామీ సాహిత్యంలో ప్రతీక కవితాపద్ధతికి 'హేమబారువా' ప్రసిద్ధుడు. కాశ్మీరు సాహిత్యంలో 'నదీమ్' కవి పురాతన జానపదగాథలను స్వీకరించి చిత్రముగా కల్పన సాగించారు. ఆయా రచనల్లో ప్రతీకలు వాడాడు. కాశ్మీరుకవులు ప్రముఖంగా కొన్ని ప్రతీకలు వాడారు. గుల్ (గులాబి), బుల్ బుల్ (కోయిల) బంభర్ (తుమ్మెద) ఇవి అనూచానంగా కవులు ప్రతీకలగా తమ రచనల్లో ఉపయోగించారు.

ఏ అభ్యుదయకవి అయినాసరే తన కాలంనాటి దేశకాలపరిస్థితులు దృష్టియందుంచుకొని వాటి కనుగుణంగా ప్రతీక లేర్పరుచుకొని వాని మాటున తీవ్ర సంఘర్షణను చొనిపి రచనలు సాగించాడు. అది కేవలం నవ్యభావవ్యక్తీకరణకోసం యువకవులైన యూరప్‌కవుల కావ్యాల సంపర్కంచేత ఏర్పడింది. భావాలను ప్రతీకల్లో నిక్షేపించి చెప్పటం అదొక విధమైన Fashion అయిపోయింది. దానిని చూచి ఇతర కవులు అనుకరించి కవితలు వ్రాయటం ప్రారంభించారు. సమాజంలో విధ్వంసక శక్తులు ఉత్పన్నమైనపుడు వాటిని రూపుమాపుటకు క్రొత్త శక్తులుసృష్టించి వాటిని పరాస్తం చేసేవరకు కవులకు నిద్ర పట్టలేదు. దానికితోడు వారిలో అంతర్గతచైతన్యం పెల్లుబికి క్రియాత్మకమైన ఘటనకు పూనుకొనాలనిఉత్తేజపరచి నవసమాజ నిర్మాణానికి రాచబాటలు నిర్మించాలన్న తీవ్రమైన ఆకాంక్షను వారిలో మేల్కొల్పింది. ఆశయసాధనకు కవితను ఆలంబనంగా గ్రహించి రచనలు ప్రారంభించి సమాజజీవితం ప్రతిబింబించి అందులోని రుగ్మతను పోగొట్టి నూతనత్వాన్ని కలిగించి తను కసినంతా తీర్చుకొనుటకు ప్రతీకల నాధారంగా తీసికొని వారు రచనలు చేశారు. ఆ ప్రతీకలను తమ అనుభవంనుంచి ప్రపంచంనుండి ఏరుకొని వానికొక స్థానాన్ని సాహిత్యంలో కల్పించి ప్రాణప్రతిష్ఠ చేశారు.

# వీరేశలింగం పంతులుగారి సాహిత్య సృష్టి

## డాక్టర్ అక్కిరాజు రమాపతిరావు

వీరేశలింగం పంతులుగారు స్పృశింపని సాహిత్య ప్రక్రియ లేదు. తెలుగు సాహిత్యాన్ని సుసంపన్నంచేసి, ప్రక్రియా వైవిధ్యాన్నికూర్చి, బహుముఖాల సాహితీ స్రవంతిని ప్రవహింపజేసి, తెలుగు మాగాణాలను పండించింది పంతులుగారు.

ఆధునిక యుగ ప్రభాతానికి వేగుచుక్క పంతులుగారు. వారు నవీన వచన గంగావతరణానికి భగీరథులు. ప్రాచీన ధోరణికి భరతవాక్యాన్నీ, నవీన ధోరణికి నాందీవాక్యాన్ని పల్కిన క్రాంతదర్శి పంతులుగారు. సుమారుగా తొమ్మిది వందల సంవత్సరాలు అనూచానంగా అనుసరింపబడుతున్న సంప్రదాయ మార్గాన్నీ, సాహిత్య దృష్టినీ, నవీనదృక్పథంతో ప్రజల చేరువకు మళ్ళించిన వారు పంతులుగారే. తెలుగు సాహిత్యంలో ఇటువంటి వైలక్షణ్యాన్ని చూపిన వ్యక్తి ఇంకొకరు లేరు. 'విశ్వశ్రేయః కావ్యం' అనే కావ్యాదర్శాన్ని పంతులుగారివలె లక్ష్యీకరించిన వాళ్ళు కూడా అరుదే అని చెప్పాలి.

పంతులుగారు ప్రౌఢ వాఙ్మయ నిర్మాత. ఇటువంటి వాఙ్మయాన్ని సృష్టించటంలో వారు ఆద్యులేకాక అగ్రగణ్యులు కూడాను. పంతులుగారు సాహిత్య సృష్టికి పూనుకోవటంతోనే కళ కళ కోసమే అనే ఆదర్శం, ప్రాముఖ్యాన్ని పోగొట్టుకుంది. కళ లోకారాధనకు ఉపయోగింపబడాలనీ, కావ్యపరమార్థము విశ్వశ్రేయమనీ పంతులుగారు నిర్వచించి నిరూపించారు. పంతులు కలం పట్టే సమయానికి తెలుగు దేశం నలుమూలలా ఆవరించివున్న అంధతామిస్రములు తొలగిపోయాయి. తెలుగు వాళ్ళకు విజ్ఞానజ్యోతిని, శాస్త్రదీపాన్ని పంతులుగారే ప్రసాదించారు.

ఆయనగారు వినిర్మించిన సాహిత్యంవలన సామాన్యుడు మాన్యుడైనాడు. సాహిత్యానికి సార్థప్రయోజనం సిద్ధించింది. జలోపాదేశపునాగరికత, విజ్ఞానం, శాస్త్రపరిజ్ఞానం, సాహిత్యం మొదలైనవాటితో ప్రభావితులై తెలుగు సాహిత్యంలోనూ, సంఘంలోనూ, కొత్తమార్పులనేకం తెచ్చిపెట్టారు. ఈ కారణంవల్లనే పంతులుగారు తెలుగువారి సాంఘికాభ్యుదయానికి మూలపురుషుడనీ, సాహిత్యంలో యుగకర్త అనీ కీర్తింపబడుతూ వున్నారు.

చిన్నయసూరి వచనరచనం వియద్గంగా సమానంగా విహరిస్తూ వుండగా, పంతులుగా రా వచన రచనను 'జగతికి మిన్నేరుడిగినయట్లు' ఆకర్షింపజేసి సరళమూ, సర్వజన సులభ గ్రాహ్యమూ చేశారు.

సంఘసంస్కారాన్ని ప్రధానంగా దృష్టిలో వుంచుకొన్నప్పటికీ, కావ్య సౌందర్యం పట్ల, పంతులుగారు అశ్రద్ధ వహించ లేదు. స్థూలంగా పంతులుగారి సర్వసాహిత్య సృష్టిని యీ క్రింది విభాగాలలో చేర్చవచ్చును.

పద్యకావ్యములు

నాటకాలూ— ప్రహసనాలూ

నవలలు

వచనకావ్యాలు

వ్యాసములు

సారస్వతవిమర్శ

శాస్త్రీయగ్రంథాలు

దేశ చరిత్ర— జీవిత చరిత్ర

స్త్రీలకు బాలురకు ఉపయోగించు పుస్తకములు

వాచకపుస్తకాలు

పత్రికానిర్వహణం

ప్రాచీన గ్రంథ పరిష్కరణ, ముద్రణలు.

పంతులుగారు శతాధిక గ్రంథకర్తలు.

పద్యకావ్యాలలో మాత్రం ప్రాచీన సంప్రదాయమే యెక్కువగా కనపడుతుంటుంది. అవి తొలి నాళ్ళలో వ్రాయబడి వుండటమే దానికి కారణం కావచ్చును. అప్పటికింకా పంతులుగారి ప్రగతిశీలమైన వ్యక్తిత్వం రూపురేఖలు దిద్దుకొని వుండక పోవచ్చును. 'శుద్ధాంధ్రనిరోష్ఠ్య నిర్వచన నైషధము' 'రసికజనరంజనము' మొదలైనవి పేరు దగ్గర నుంచీ ప్రాచీన ప్రబంధ ఫక్కీలోనే వున్నాయి. సంప్రదాయమార్గంలోనే ఇష్టదేవతా స్తుతి మొదలుకొని, పురవర్ణనము, చంద్ర, మన్మథోపాలంభనాదులు, నాయికా నాయకుల ప్రత్యంగ సౌందర్యవర్ణనం, శబ్దార్థాలంకారాలపైన మోజు, ఆశ్వాసాదిని, ఆశ్వాసాంతాలలో, సుగంధి, మాలిని, పంచచామరం, మణిగణనికరం, మొదలైన విశేష వృత్తాలను కూర్చటం, ఆశ్వాసాంతాన గద్యలను వ్రాయటం,

ఫలశ్రుతి విధించటం, మొదలైన సంప్రదాయమార్గాలన్నీ పంతులుగారి పద్య కావ్యాలలో పాటించబడ్డాయి.

శుద్ధాంధ్రనిరోష్ఠ్య నిర్వచన నైషధంలోనూ, రసికజన రంజనంలోనూ, నన్నయ, తిక్కనాదుల ప్రథితములైన మార్గాలన్నీ అనుసరించబడ్డాయి. శుద్ధాంధ్రోత్తరరామాయణం, శుద్ధాంధ్ర భారత సంగ్రహం, మొదలగు కావ్యాలవలన 'అచ్చ తెలుగు కావ్యముల నలవరించుట యందు' పంతులుగారికి గల నేర్పు విశద మవుతున్నది. అచ్చ తెనుగు కావ్యాలు వ్రాయటంలో, పొన్నికంటి తెలగన, కూచిమంచి తిమ్మన, కందుకూరి లింగన, చాలా ప్రతిష్ఠ్నని కొక్కొండ వేంకటరత్నం పంతులుగారు, వీరేశలింగం గారిని, పై యిరువురితో సము లను చేసి శ్లాఘించారు. సరళ సుందరంగా అచ్చతెలుగు కావ్యాలను కూడా వ్రాయగల నేర్పు పంతులుగారికి వెన్నతోబెట్టిన విద్య అనేది యీ కావ్యాల వలన స్పష్టపడుతున్నది. తెలుగులో అచ్చ తెలుగు కావ్యాలు వ్రాసిన వాళ్ళలో పంతులు గారి స్థానం చాలా విశిష్టమైంది.

పంతులుగారు ఇంగ్లీషులో నుండి కూడా పద్య కావ్యాలను కొన్నింటిని తెనుగు చేశారు. దీనివలన ఆంగ్లభాషలో కూడా వారికి గల గొప్ప పాండిత్యం తేటతెల్లమవుతున్నది. విలియం కౌపర్, ఆలివర్ గోల్డ్‌స్మిత్‌ల కావ్యాలకు పంతులుగారి అనువాదాలు సాధికారంగా వున్నాయి. ఆంధ్రాంగ్లములందు విశేషించి ప్రజ్ఞ వుంటేతప్ప, ఇట్టి అనువాదాలు వెలియించటం సాధ్యం కాదు. ఇంగ్లీషులో నుండి పద్య కావ్యాలను తెలుగులోకి అనువదించటంలోనూ, వారి కావ్యాదర్శాన్ని, తత్త్వచింతనను, తెలుగువారికి అందించటానికీ, పంతులుగారే ప్రథములు. అర్వాచీనులకు అందువలన మార్గదర్శిన్నీ అయినారు. ఇవికాక బాలబాలికలకు, సరళ సుందరములుగా, నీతి బోధకములుగా, పద్యాలను, శతకాలను, పద్యకథలను రచించారు. ఈసప్స్ ఫేబిల్స్ వంటివి పద్యాత్మకంగా అనువదించారు. స్త్రీల కోసం ఎన్నో పాటలూ, పద్యాలూ కూడా రచించారు.

ఇవన్నీ కాక, పంతులుగారి కావ్యాలలో ముఖ్యంగా పేర్కొన వలసినది 'అభాగ్యోపాఖ్యానం'. తెలుగు సాహిత్యంలోనే వికట కావ్యాలలో (హేళనాత్మక కావ్యాలలో) విశిష్టమైంది. చంద్రరేఖా విలాసం, రామలింగమ్మాయిం, మొదలైన పూర్వ కావ్యాలు దీంతో సరితూగవు. ప్రబంధాల్లోని వర్ణనలకన్నిటికీ, అపహాస్యంగా, పంతులుగారు పద్యాలు వ్రాశారు. అనౌచిత్యంగానూ, విరసంగానూ కాని ధోరణి యీ వికటకావ్యం (Parody) లోని ప్రత్యేకత. పురవర్ణనం, చతుర్వర్ణ్యవర్ణనం, రాజు, రాజు కొలువుండటం, వేటకు పోవటం, అక్కడొక సుందరాంగిని చూడటం, అటుపైన విరహం, వయస్యుని రాయబారం ఇత్యాది వర్ణనలన్నీ చాలా నవ్వుపుట్టిస్తాయి.

పంతులుగారి నాటకాలను సంస్కృతానువాదాలూ, ఆంగ్లానువాదాలూ, స్వతంత్ర రూపకాలూ, అనే మూడు విభాగాలు చేయవచ్చును. తెలుగులో ప్రహసనం వ్రాయటంలో పంతులుగారే ప్రథములు. ప్రహసన ప్రక్రియకు ప్రాచుర్యాన్నీ, స్థితినీ, మన సాహిత్యంలో కల్పించింది పంతులుగారే. ఈ ప్రక్రియనుచేపట్టి వారు సాధించిన విజయాలు కూడా అపూర్వమైనవీ, అత్యాశ్చర్యజనకమైనవీ. ప్రహసనరచనలో వారు చూపిన నేర్పు, చాలా హృదయంగమమైంది. ఒక్క చిలకమర్తి తప్ప ప్రహసనరచనలో వీరేశలింగం పంతులుగారికి సమీపంగా కూడా తెలుగు సాహిత్యంలోనే ఎవరూ రాలేరు. చిలకమర్తి ప్రహసనాల్లో కూడా వీరేశలింగం పంతులుగారి ప్రహసనాలలో వున్నంత విషయ వైవిధ్యంలేదు. తాత్కాలికమైన అవసరాలను, ప్రయోజనాలను దృష్టిలో పెట్టుకొని, యీ ప్రహసనాలను పంతులుగారు రచించారు కాబట్టి, వీటిలో శిల్పం, కావ్య ప్రయోజనం, పరిమితమై పోయినాయని, ఉత్తమ సాహిత్య ప్రమాణాలతో చూస్తే ఇది లోపమనీ, విమర్శకు లనక పోలేదు.

కాని పంతులుగారి సాహిత్య ప్రయోజనం, పరమార్థం సంఘసంస్కరణమే కాబట్టి, పంతులుగారి విషయంలో పై ప్రమాణాలు వర్తించవనే చెప్పాలి. 'ధంభాచార్య విలసనం', 'తిర్యగ్విద్వన్మహాసభ', 'మహారణ్యపురాధిపత్యం', 'హిందూమత సభ', 'జమీందారీ ధర్మ ఖర్చు' మొదలైన ప్రహసనాలలో పంతులుగారి ప్రహసనరచనాచాతుర్య మంతా, పరమ రమణీయంగా సాక్షాత్కరిస్తున్నది. ప్రధానంగా పంతులుగారి ప్రహసనాలలో, అధిక్షేపణ, కటువ్యంగ్యమూ, కనపడతాయి. ప్రాయికంగా మృదుహాస్యం కూడా కనపడుతూ వుంటుంది కాని తక్కువ. గురజాడ అప్పారావుగారు కూడా, వీరేశలింగం పంతులుగారి ప్రహసనాలు, విషయవినోదసాఫల్యాలే అని సంభావించారు. పంతులుగార్ని గ్రంథసంపుటాలన్నింటిలోనూ యీ ప్రహసనాలే తమను చాలా ఆకర్షించాయన్నారు అప్పారావుగారు. బహుశా సంఘ సంస్కారోద్బోధకాలుగా, పంతులుగారి ప్రహసనాలు, గొప్ప ఫలితాలను సాధించాయి కనుక అప్పారావుగారిని అవి ఆకర్షించి వుండవచ్చును.

పంతులుగారి ఆంగ్ల నాటకానువాదాలలో కూడా, విషయవినోదంకన్నా, సంఘసంస్కారదృష్టే, ప్రధానంగా కనపడుతుంది. కనుకనే షెరిడన్ నాటకాలు వారిని ముందుగా, ఆకర్షించాయి. షెరిడన్, సమకాలీన సాంఘిక వ్యవస్థలోవి కూహకాల నన్నిటినీ, వ్యంగ్యహాస్యంతో, విమర్శతో, తన నాటక వస్తువులుగా చేసుకున్నాడు. మఠాధిపతుల దిగజారిపోయిన స్థితినీ, యువతీయువకుల వెట్టి మొట్టి ప్రేమలను, స్వేచ్ఛా సంచారాన్ని కుటుంబంలో పెద్దతరం వాళ్ళ మూఢ విశ్వాసాలను, షెరిడన్ బాగా అపహాస్యం చేశాడు. పంతులుగారు, తమ అనువాదనాటకాలలో, దేశకాలపాత్రలను, మూలగ్రంథానుసారులుగా కాకుండా, దేశీయ వాతావరణం కల్పించే ప్రయత్నం చేశారు. కాని యీ ప్రయత్నంలో వారు పూర్తిగా కృతకృత్యులు కాలేదు. కొన్నిచోట్ల, సంభాషణలు, దేశకాలపాత్రాదుల వర్ణనలూ కృతకంగా తయారైనయ్. మూల గ్రంథాలు గద్య పద్యాత్మకంగా వుంటే పంతులు

గారు తెలుగుసమా(త్రం గద్యాత్మకంగానే రచించటం కూడా ఒక (ప్రత్యేకతగా చెప్పాలి. ఈ నాటకాలలో, ఇంగ్లీషు నుడికారం, వాక్యనిర్మాణం, అక్కడక్కడా కనపడతాయి. ఆ పట్టుల్లో ఎబ్బెట్టుగానూ అనిపిస్తాయి, భావాలూ, భాషా శైథిల్యం. యథాతథంగా అనువదించి వుంటే యీ బాధ తప్పేదనిపిస్తున్నది. షెరిడన్ నాటకాలైన The Rivals, Duenna అన్నవాటిని, కళ్యాణకల్పవల్లి, రాగమంజరి, అన్న పేర్లతో పంతులుగా రనువదించారు. ఆ పిమ్మట షేక్స్పియర్ నాటకాలలో The Merchant of Venice ను అనువదించటానికి పూనుకొని, అసంపూర్తిగా వదిలి పెట్టారు.

The Comedy of Errors నాటకాన్ని మా(త్రం, షెరిడన్ నాటకాల అనువాద ధోరణిలోనే, 'చమత్కార రత్నావళి'గాచేసి అనువదించారు. తెలుగుభాషలో తొట్టతొలుతగా (ప్రదర్శింప బడిన యోగ్యతను పొందటం యీ నాటకం విశిష్టత అనాలి. 1880 వ సంవత్సరంలో ధార్వాడ నాటక సమాజం వాళ్ళు, నాటకాలాడి, వెళ్ళిపోగా, ఆ పోకలు తీసివేయకముందే పంతులుగారు, యీ నాటకాన్ని (ప్రదర్శింప చేశారుట. తొట్టతొలుత నాటకాన్ని (ప్రదర్శింప చేయటం కూడా, వీరేశలింగం గారికే దక్కింది. ఇవికాక, అపూర్వ (బహ్మచర్య (ప్రహసనం (The Married Bachelor) బలాత్కారగానవినోద (ప్రహసనం (Caught by the ears) విచి(త్ర వివాహ (ప్రహసనం (Caught in his own Trap), మహామహోపాధ్యాయ (ప్రహసనం (Irish Tutor) పునర్మరణ. (ప్రహసనం (Twice Killed) మొదలైన (ప్రహసనాలు, ఇంగ్లీషు అనువాదాలే. ఈ అనువాదాల్లో కూడా పంతులుగారు దేశకాలపా(త్రాదులను, మార్చి వేశారు. అందువల్ల కొన్ని చోట్ల, సన్నివేశాలూ, సంభాషణలు, కృతకంగా కనపడక మానవు.

పంతులుగారి సంస్కృతరూపకానువాదాల్లో భావానుసరణం (ప్రధానం. సరళమైన శైలిలో పంతులుగారు సంస్కృత రూపకాలను అనువదించారు. శాకుంతలానువాదాలు తెలుగులో లెక్కకు మిక్కిలిగా వచ్చినా, పంతులుగారి అనువాదం పొందిన (ప్రసిద్ధి, (ప్రాచుర్యం, మరియేఇతర అనువాదము పొందలేదు. (ప్రబోధచం(ద్రోదయంలో విషయానికి అనుగుణమైన శైలిఆయా సందర్భాలలో మూలంలోని (ప్రౌఢిని ఏ మా(త్రము భంగపుచ్చకుండా, చూపారు. (ప్రబోధచం(ద్రోదయం, ఆధారంగా (బహ్మసమాజంలోని ఏకేశ్వరారాధనం, జ్ఞానమార్గం కొంత (ప్రతిపాదించారని విమర్శకులన్నారు. ఆ దృష్టే పంతులుగారి నీ నాటకం ఆకర్షించి వుంటుంది. (ప్రబోధచం(ద్రోదయానికి తెలుగులో ఎక్కువ అనువాదాలురాలేదు. ఇవికాక మాళవికాగ్నిమి(త్రం, రత్నావళి కూడా పంతులుగారుఅనువదించారు. ఈ నాటకాలలో కూడా (ప్రసక్తి వచ్చినచోటా, (ప్రస్తావనల్లోనూ, (స్త్రీవిద్య, (స్త్రీస్వాతం(త్ర్యం, నాగరికతకు ఎంతఆవశ్యకములో పంతులుగారు (ప్రస్తావించే వున్నారు. బహుశా, యీ నాటకాలు వారిని ఆకర్షించటంలోని పరమార్థం యిదే కావచ్చును.

ఇక స్వతం(త్ర రూపకాలల వారి వ్యక్తిత్వం, పరిపూర్ణంగా కనపడుతున్నది. సత్యహరిశ్చం(ద్ర, (ప్రహ్లాద, దక్షిణ గో(గ్రహణం లాంటి నాటకాలు రచించటంలో పంతులుగారి నీతి, మత, సాంఘిక దృక్పథాలు, అభివ్యక్తం అవుతున్నాయి. అయితే యీ నాటకాలు, సంత్వ(త్రంగా రచించారు కనుక,ఆయా సందర్భాలలో ఆయా పా(త్రలు, పంతులు గారి విశ్వాసాలను, అభి(ప్రాయాలను నిస్సంకోచంగా ఉపన్యసించటం, మనం చూస్తాం. హరిశ్చం(ద్రుడు జ్యోతిశ్శా(స్త్రాన్ని విమర్శించటం, చం(ద్రమతి (స్త్రీ విద్యావశ్యకతను (ప్రతిపాదించటం, మొదలగు విషయాల వలన పంతులుగారి సాహిత్య పరమార్థం, వ్యక్తిత్వం, (ప్రస్ఫుటంగా వెల్లడి అవుతున్నాయి.

(ప్రహ్లాద నాటకంలో పరిశుద్ధాస్తిక మతస్వరూపాన్ని, తదావశ్యకతను, పంతులుగారు (ప్రతిపాదించారు. నృసింహస్వామి (ప్రహ్లాదుడికి (ప్రత్యక్షమై పరిశుద్ధాస్తిక మతాన్ని గూర్చి (ప్రసంగించటం, నరసింహస్వామి కాక, వీరేశలింగమే ఉపన్యసిస్తున్నాడనిపిస్తుంది. దుర్మతాల హిరణ్యకశిపులను, పంతులు నృసింహావేశంతో, చీల్చటం వాస్తవ విషయమే ఆరోజుల్లో. ఈ నాటకంలో భక్తికి రసపి తిని కల్పించటం ఆయన ధ్యేయం ఎంత మా(త్రమూకాదు. పంతులుగారి (ప్రవృత్తిలోవున్న వైలక్షణ్యం ఇదే.

దక్షిణ గో(గ్రహణంలో కూడా జారత్వం వలన కలిగే అనర్థాలను విరాటుడు, సుధేష్ణతో, ఎంతో నొక్కి చెపుతాడు. పరవనితా సంగమమే, సర్వపాపాలకూ మూలమని చెప్పటం, పంతులాశించిన (ప్రయోజనం. ధనగుప్తుడనే పా(త్ర సుశర్మతో, దయ, ధర్మము, సత్యము, నీతి, మొదలైన విషయాలను గూర్చి విపులంగా (ప్రసంగించటం కూడా, సాంఘిక (ప్రయోజనాన్ని పంతులు గారుద్దేశించటంవల్లనే అని చెప్పాలి. ఏ మా(త్రం సందర్భం వచ్చినా పంతులుగారు సాంఘిక (ప్రయోజనాన్ని ఏమరటం వుండదు.

ఈ మూడు నాటకాల్లో (ప్రహ్లాదనాటకంలో పద్యాలు తక్కువ. దీన్ని గద్యనాటకంగా చెప్పినా వి(ప్రతిపత్తి కలుగబోదు. సన్నివేశ (ప్రాబల్యాన్నిబట్టి ఏ ఐదారు పద్యాలనో పంతులుగారు కూర్చారు. దక్షిణగో(గ్రహణము నాటకంలో, సత్యహరిశ్చం(ద్రలోనూ పద్యాలు చాలా వున్నాయి. అందువలన తెలుగునాటక (క్రమ పరిణామంలో, (ప్రారంభదశలో యీరెండు నాటకాలు రచింపబడి వుంటాయని వూహించవచ్చును. తెలుగు నాటకాల 'ఉద్భవ వికాసపరిణామం'లో పద్యనాటకావిర్భావం తొలిదశ అని పరిశోధకులు నిరూపించారు.

పంతులుగారు స్వతం(త్ర రూపక రచనంలో స్వాతం(త్ర్యాన్నే చూపారు కాని, (ప్రథితమైన ఆంగ్ల రూపక మర్యాదలను కాని, సంస్కృత రూపక సం(ప్రదాయాలను కాని అనుసరించలేదు, స్వతం(త్ర నాటకాలుగా ఆయన రచించినవాటిలో సంస్కృత రూపక లక్షణాలు కనపడవు. నాంది, (ప్రస్తావనలను కూడా పాటించలేదు కొన్ని నాటకాలలో పంతులుగారు. సత్యహరిశ్చం(ద్ర నాటకంలో మా(త్రం,నాంది (ప్రస్తావనలున్నవి.నాందిలో

18— పద్యాలు రచించటం,పంతులుగారి సంప్రదాయాభిజ్ఞతను చాటి చెపుతున్నది. అంకాలను రంగాలుగా విభజనంచేసి, ఆంగ్ల నాటక సంప్రదాయాలను కూడా స్వతంత్ర రూపకాలలో అనుసరించారు. ప్రథమాంకంలో ఇంద్రసభలో వశిష్ఠ విశ్వామిత్ర సంవాద సందర్భంలో, విశ్వామిత్రుడు వరుసగా ఆరు పద్యాలు చదవటం, నాటి అభిరుచులకు తార్కాణం.

ఇవికాక ప్రహసనలక్షణాలుకల రూపకాలు వ్యవహార ధర్మబోధిని, బ్రాహ్మవివాహం అనేవి. ఇవి ఆనాటి సాంఘిక పరిస్థితులకు దర్పణం వంటివి. ఆనాడు ప్రచురంగా సంఘంలో పాదుకొనిపోయిన సమస్త దురాచారాలూ, యీ రెండు గ్రంథాల్లోనూ బాగా విమర్శింపబడ్డాయి. స్థూలంగా పంతులుగారి సమస్త రచనల్లోనూ యీ సాంఘిక ప్రయోజనం ఇమిడి వుంటుంది. స్వతంత్ర రూపకాల్లోనూ, ప్రహసనాల్లోనూ,యీ సాంఘిక విమర్శ మరింత బలంగా వుంటుంది. దురాచారాల్నా, సాంఘిక పతన హేతువులైన సర్వ విషయాలూ, అవహేళనాత్మకంగా, యీ రూపకాలలో విమర్శించబడ్డాయి.

పంతులుగారి నవలల్లో, సాంఘికవిమర్శ, సంఘ సంస్కరణప్రబోధం పరాకాష్ఠనందుకున్నాయి. రాజశేఖర చరిత్రం, సత్యరాజాపూర్వదేశయాత్రలు, సాంఘిక విమర్శా దృష్టితో పరిశీలించి చూస్తే, ఆ ప్రయోజనానికై వుద్దేశింపబడిన రచనలలో, పరాంకోటికి చెందిన రచనలని చెప్పవచ్చును. సంఘంలోవున్న దౌష్ట్యాన్నంతా తూర్పార పట్టటమే యీ రచనలలోని పరమాశయం. స్త్రీ విద్యావిహీనతవలన సంఘంలో ప్రాచుర్యాన్ని పొందే అరిష్టాలూ, యాచనను సుగుణంగాచేసి, ముఖస్తుతులను వినిపించే కుక్షింభరుల దాంభిక వర్తనమూ, మంత్రతంత్రవేత్తల మాయలూ, భూతప్రేత పిశాచాదుల యెడల నమ్మికలోనివున్న రూపూ, బట్ట బయలు చేశారు పంతులుగారు, రాజశేఖర చరిత్రంలో.

ఆడ మలయాళంలో వ్యాజరూపాన, సమకాలీన సంఘంలోని, దుర్మార్గాలను తీవ్రంగా అధిక్షేపించారు.

సమకాలీన సంఘంలోని స్త్రీల దుస్థితిని, ఆడ మలయాళంలోని పురుషులకు వర్తింపచేసి, వ్యంగ్యంగా, కటువుగా, హేళనాత్మకంగా, సత్యరాజాపూర్వదేశయాత్రలలో పంతులుగారు చిత్రించారు. స్త్రీల మౌఢ్యము, సంఘంలో దుష్టశక్తులస్వైరవిహారం, యీ సత్యరాజాపూర్వదేశయాత్రలులోని ఇతివృత్తం. దీనిలోనే రెండవభాగమైన లంకాయాత్రలో జ్యోతిషశాస్త్రము బాగా విమర్శించబడింది. సతీసహగమనం, స్త్రీలదురవస్థలు, పురాణాలలోని ప్రక్షిప్తాలు, లంకాయాత్రలో తీవ్రంగా విమర్శకు గురి అయినాయి.

ఈ రెండు నవలలుగాక మరో రెండు నవలలుకూడా పంతులుగారు వ్రాశారు.పంతులగారి నవలల్లో సత్యవతీ చరిత్రాని కొక విశిష్టమైన స్థానముంది. ఈ నవలలో నాలుగు రకాల దాంపత్యాలను చిత్రించారు, పంతులుగారు. స్త్రీ పురుషు లిద్దరూ చదువుకొన్నవాళ్ళు; స్త్రీ విద్యావంతురాలై, పురుషుడు విద్యావిహీనుడున్నూ; స్త్రీ పురుషులిరువురూ విద్యావిహీనులున్నూ; స్త్రీవిద్యావిహీనురాలై పురుషుడు విద్యనేర్చివుంటేనూ, సంసారాలేవిధంగా వుంటవో పంతులుగారు యీ నవలలో వివరించి చూపారు. తమ సిద్ధాంతాలనన్నిటినీ, పాత్రల నాలంబనంగాచేసికొని చెప్పటం వలన కొంత శిల్పం కొరవడిందని చెప్పాలి. తమ అభిప్రాయాలను, పాత్రల ముఖతః వెల్లడిస్తున్నట్లువుంటుంది కాని, క్రమోన్మీలనమూ, చిక్కనికథా కానరావు. వాచ్యంగా తమ సిద్ధాంతాలను చెప్పివేశారు. కథా ప్రణాళికకు సంబంధించి,కొంత ప్రతిభ చూపినా, వస్తుసంవిధానంలో బిగిలేదు. సాంకేతికంగా ధ్వనింప చేయవలసిన సందర్భాలలో కూడా పూనుకొని, వాచ్యంగా చెప్పటంవలన, ప్రధానంగా నవలలో కనపడవలసిన శిల్పం, కనపడలేదు. సంఘటనలు ఒకదాని వెనుక వొకటి పేర్చినట్లుగా వుంటాయి కాని, సన్నివేశాలలో కాని, పాత్రచిత్రణలో కాని, జీవంకానరాదు. ప్రత్యేకమైన వ్యక్తిత్వం పాత్రలకున్నట్లు తోచదు. కథాసూత్రం పాత్రల అధీనమందుకాక, ఆద్యంతం, పంతులుగారి ముద్ర సాక్షాత్కరిస్తూ వుంటుంది యీ నవలలో. అయితే తెలుగులో తొలిసాంఘిక నవల అన్న ప్రత్యేకత మాత్రం యీ నవలకున్నది. కథలో బిగి, పటుత్వము, కల్పన, తక్కువైనా పాత్రల సౌకుమార్యం ముగ్ధభావములూ, అమాయకత్వం, వైదగ్ధ్యం, పాఠకుల సానుభూతికి పాత్రంకాగలవు. ఆ కాలంలో మధ్య తరగతి కుటుంబ వ్యవస్థను కళ్ళకు కట్టినట్లుగా పంతులుగారీ నవలలో చిత్రించారు. శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రిగారి వంటి ప్రసిద్ధ కథకులను, నవలా రచయితలను కూడా యీ నవల బాగా ఆకర్షించింది. పంతులుగారు యీ నవలలో కోనసీమ ప్రాంతపు మధ్య తరగతి కుటుంబాలను, చక్కగా వర్ణించటం, వారి లోకవృత్తాను శీలనమూ, శ్రీపాద వారిని ఆకర్షించటానికి కారణాలు కావచ్చును. 'ఇల్లుబట్టిన వెధ వాడబడుచు' అన్న నవలలో శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రిగారు నాయిక సోమిదేవి చేత సత్యవతీ చరిత్రను చదివించారు.

దీని తరువాత, వీరేశలింగం పంతులుగారు చంద్రమతీ చరిత్రాన్ని కూడా నవలగా రచించారు. కాని ఇది నవలకాదు. సత్యహరిశ్చంద్రుని కథను ఆధారంగా చేసికొని, చంద్రమతీదేవి ప్రాధాన్యాన్ని ఎక్కువచేసి, ఆమె నాయికగా ఆమె చుట్టూ అలబడిన కథ ఇది. స్త్రీలు, పిల్లలు చదవదగు పుస్తకములు అన్న విభాగం కింద యీ గ్రంథాన్ని చేర్చటం వలన, సరళమైన శైలిలో, బాలబాలికలు, అవశ్యం నేర్చుకోవలసిన నీతులు, సదాచారం, సంస్కారం మొదలైన విషయాలను కథాత్మకంగా చెప్పే ప్రయత్నం పంతులు గారిందులో చేశారనవలసి వుంటుంది. చంద్రమతి చిన్న బాలికగా వున్నప్పుడు, ఆమెకు గురువు రోజుకొక్క విషయంగా మతము, నీతి, సాంఘిక ధర్మం, పరోపకారం, సౌశీల్యం మొదలైన విషయాలను గూర్చి, బోధించినట్లుగా, ప్రతి ప్రకరణంలోనూ ఒక్కొక్క వుపన్యాసం గురువుగారిచేత చేయించి పదిహేను ప్రకరణాలుగా వ్రాసి, కడమ చంద్రమతి కథను అతిసంక్షేపంగా చెప్పివేసి, వచన ప్రబంధమన్నారు, పంతులుగారు చంద్రమతీ చరిత్రమకూడా. కాని, ఇది వచన

ప్రబంధం, అంటే నవల ఏంతమాత్రముకాదు. కథాకల్పనంలో ప్రతిభ ఏమీ చూపకపోయినా, శైలి మాత్రం సుప్రసన్నంగా వుంది యీ గ్రంథంలో.

పంతులుగారి వ్యాసాలన్నింటా, మత, సాంఘిక, రాజకీయ పరిస్థితులు ప్రాధాన్యం వహించాయి. పంతులుగారి తార్కిక ప్రతిభ, లోకజ్ఞత, విమర్శాపాటవం, బహుళ విషయ సంగ్రహణం, యీ వ్యాసాల్లో తలస్పర్శిగా కనపడతాయి. రెండు పెద్ద సంపుటాలకు సరిపడేట్లు, తత్కాల సాంఘికార్థిక, రాజకీయ, మతనైతిక, సమస్యలను గూర్చి పంతులుగారు వ్యాసాలు వ్రాశారు. పంతులుగారు సారస్వత విమర్శనుకూడా వెలయించారు. కొక్కొండ వేంకటరత్నకవికృత విగ్రహతంత్రవిమర్శనం, అలంకార సంగ్రహం, వ్యాకరణ సంగ్రహం, కావ్యసంగ్రహం, పంతులుగారి ప్రతిభకూ, పాండిత్యానికీ నిదర్శనాలు.

స్త్రీల కొరకు, షేక్స్పియర్ నాటక కథలను సరళమైన శైలిలో అనువదించారు. ఈ కథల్లో కూడా దేశకాల పాత్రలను, దేశీయమైనవిగా, మార్చారు. చార్లెస్‌ల్యాంబ్, రచించిన షేక్స్పియర్ నాటక కథలను, పదహారు కథలుగా అనువాదం చేసి స్త్రీలకొరకు నిర్వహించిన సతీహితబోధినివంటి పత్రికలలో పంతులుగారు ప్రకటించారు.

స్త్రీలు సుబోధకంగా చదువుకొనటానికీ, శాస్త్రీయమైన విషయాలు తెలుసుకోటానికీ, పత్రికలలో చాలావ్యాసాలూ, కథలూ, సంభాషణలూ, వ్రాయటమే కాకుండా, దేహారోగ్య ధర్మబోధిని, పత్నీహితసూచని, మొదలైన, గ్రంథాలను సులభశైలిలో ప్రకటించారు. దేహారోగ్య విధులు, శిశుపోషణ, మొదలైన సంగతులను యీ గ్రంథాలలో తెల్పగా వివరించారు.

దేశీయులలో పరంపరాగతంగా వస్తున్న మూఢాభిప్రాయాలను తొలగించి, శాస్త్ర విజ్ఞానాన్ని, హేతువాద ధోరణిని, ప్రబలజేయటానికిగాను, పంతులుగారు, శరీరశాస్త్ర సంగ్రహం, జ్యోతిశ్శాస్త్ర సంగ్రహం, జంతు స్వభావ చరిత్రం, మొదలైన గ్రంథాలను రచించారు. శరీర శాస్త్ర సంగ్రహంలో, మానవ శరీరంలోని, వివిధాంగాలూ, ఎట్లాపని చేస్తాయో, సచిత్రంగా వివరించటానికై, లండనునుండి, కావలసిన వివరాలు గల, పటాలను, వాటి బ్లాకులనూ తెప్పించామని పంతులుగారు స్వీయచరిత్రలో వ్రాశారు. ఇవికాక పదార్థ వివేచక శాస్త్రాన్నీ, భూగోళ స్వభావ దీపికను కూడా, రచించటానికి పూనుకొని, కొంతభాగం వ్రాసినట్లూ కారణాంతరాలవలన, ఆ ప్రయత్నాలు విరమించినట్లూ పంతులుగారు స్వీయచరిత్రంలో వ్రాశారు. ఈ గ్రంథాలవల్ల పంతులుగారి శాస్త్ర పాండిత్యం, మేధాశక్తీ, యెంతనునిశితమైనవో వ్యక్తమవుతుంది.

చిన్న పిల్లలకొరకు, ఈసప్ నీతికథలనూ వాచకపుస్తకాలనూ పంతులుగారు ప్రకటించారు. దేశ చరిత్రలను, జీవిత చరిత్రలను కూర్చారు. విక్టోరియా మహారాజ్ఞి చరిత్రం, జీసను చరిత్రం, శంకరాచార్యులవారిచరిత్రం, రాజారామమోహన రాయలవారి చరిత్రం, వారి జీవితచరిత్ర రచనలతో ముఖ్యమైనవి.స్వదేశ సంస్థాన చరిత్రలను చింతామణి పత్రికలో ప్రకటించి, తరువాత పుస్తక రూపంగా వెలువరించారు. అప్పటికి దేశంలోవున్న వివిధ సంస్థానాల చరిత్రలను, రంజకంగా వ్రాశారు పంతులుగారు.

ఇక ప్రౌఢంగా, ప్రాచీన సంప్రదాయ మార్గాన పంతులుగారు రచించిన వచనం కూడా వుంది. చిన్నయసూరిగారి శైలిని అనుకరిస్తూ, సంధి విగ్రహాలను, రచించి పండితుల మెప్పు కూడా పొందారు. సమకాలీన సాహిత్య పత్రికలన్నీ పంతులుగారి సంధి విగ్రహాలను, బాగా శ్లాఘించాయి.

వీటన్నిటినీమించి శాశ్వతంగా వారిపేరు నిలిపేది వారి కవులచరిత్రం. శాస్త్రీయమైన దృష్టితో, కవి కాలాదికాలను విమర్శిస్తూ, అన్వయిస్తూ, సారస్వత విమర్శను కూడా సమపాళంగా, కవుల చరిత్రలతోనే జతపరుస్తూ, తెలుగులో కవుల చరిత్రను రచించిన వారిలో వీరేశలింగం పంతులుగారే ప్రథములు. వీరికి పూర్వమే గురుజాడ శ్రీ రామమూర్తిగారు కవి జీవితాలు ప్రకటించినా, అది వీరేశలింగం పంతులుగారి కవుల చరిత్రంతో సరితూగలేదు.

---

పంతులుగారు, ఇరవైకి పైగా ప్రాచీన తాళపత్ర గ్రంథాలను, ప్రత్యంతరసహాయంతో పోల్చి, పరిష్కరించి, ప్రకటించి, ఆకాలంతో ప్రాచీన గ్రంథ పరిష్కరణకూ, ప్రకటనకూ మార్గదర్శకులైనారు. నాచన సోమన ఉత్తర హరి వంశం, కేతన దశకుమార చరిత్రం, పిల్లలమర్రి పినవీరభద్రస జైమినీ భారతం, నందిమల్లయ్య, ఘంటసింగయ్యల ప్రబోధ చంద్రోదయ, వరాహపురాణాదులు, తొలుదొల్త, పరిష్కరించి ప్రకటించింది పంతులుగారేనంటే, పంతులుగారు తెలుగు సాహిత్యానికి ఎట్టి సేవచేశారో సువిదితం కాగలదు.

ఇంతేకాక, వారెన్నో పత్రికలను నడిపారు. ఆ పత్రికల్లో మత సాంఘికార్థిక రాజకీయ విషయాలపై వ్యాసాలూ, నవలలూ, నాటకాలూ, కావ్య విమర్శ, ప్రాచీన కావ్యాలూ, కవుల చరిత్రా, శాస్త్రీయ గ్రంథాలూ, ప్రకటించారు. వివేకవర్ధని, సతీహితబోధిని, సత్యసంవర్ధని, చింతామణి, సత్యసంవాదిని మొదలైనవా పత్రికలు.

స్వీయచరిత్రను మొట్ట మొదట తెలుగులో రచించింది పంతులుగారే. అర్వాచీనులందరికీ మార్గదర్శి అయినారు. పంతులుగారి సర్వసాహిత్యంలోనూ వారి సంఘసంస్కరణాభిలాష వాసిస్తూ వుంటుంది. ప్రధానంగా సరళమైన శైలి, సంఘ సంస్కరణ తత్పరత్వం, త్యాగశీలత, ప్రతిభ, వారి సాహిత్యంలో కానవచ్చేగుణాలు.

తెలుగు సాహిత్యంలో పంతులుగారి పేరుతో ఒకయుగమే వెలసింది. సాహిత్యాన్ని ఉపకరణంగా చేసికొని, తన సంఘాన్ని ఉద్ధరించిన ప్రపంచ సాహితీ వేత్తలలో వీరేశలింగంపంతులుగారు అగ్రేసరులు. అట్టి మహనీయుల్లో, పంతులుగారి స్థానం చిరమైనదీ, దివ్యమైనదీ అని చెప్పాలి.



# త్యాగరాజస్వామివారి సంగీతనాటకములు-
# ప్రహ్లాద భక్తివిజయము

కుమారి ఎం. ఎస్. రాణీ ప్రమీలాదేవి

## 1

కర్ణాటక సంగీతమునకొక ప్రత్యేకతను, పరిపూర్ణతను చేకూర్చిన మహాపురుషులలో శ్రీత్యాగరాజస్వామి అగ్రగణ్యులు. వీరి బహుముఖ సేవచే కర్ణాటక సంగీతము రసపుష్టిని సంతరించుకొన్నది. స్వామివారి కీర్తనలను, కృతులను విని ఆనందించని వారు భారతదేశ మందంతటను అరుదు.

శ్రీ త్యాగరాజస్వామి వాగ్గేయ కారవర్యుడు. శార్ఙ్గదేవుడు చెప్పిన ఉత్తమ వాగ్గేయకార లక్షణములన్నియు వీరికి అన్వయించును. తాము రచించిన అసంఖ్యాక కృతులచే వందనీయులైన శ్రీ త్యాగరాజస్వామి ప్రహ్లాద భక్తి విజయము, నౌకా చరిత్ర, సీతారామవిజయము అను సంగీత నాటకములను కూడ రచించి వారి వాగ్గేయకర్తృత్వమునకు పరిపూర్ణత చేకూర్చిరి.

స్వామివారు తమకు ముందు కాలమున వెలసిన యక్షగానములచే ప్రభావితులై తామును సంగీతనాటక రచనకు పూనుకొనిరి. 'శాహజీ' ఆస్థానమం దుండి అనేక యక్షగానముల రచించిన గిరిరాజకవి వీరి తాతగారు. కాని యక్షగానములలో కనుపించు కాముకశృంగారము ప్రహ్లాదభక్తి విజయమున ఎంతమాత్రము కనుపించదు.

యక్షగానములు వీథినాటకములు వేరు వేరు ప్రక్రియలని కొందరు విమర్శకుల అభిప్రాయము. అది కొంతవరకు సత్యమే. ఆదిలో యక్షగానములు ఏవిధముగా ఉండెడివో తెలిసికొనుటకు స్పష్టమైన ఆధారము లిప్పుడు లేవు. మొదట యక్షులు అను ఒక జాతివారు (ఇప్పుడు జక్కులవా రనబడు వారు) వేషధారణము చేసి రంగస్థలము మీద గానము చేసి, సభారంజనము చేసిన గీత రచనలై యుండవచ్చునని ఊహింపవచ్చును. కాని కాలక్రమమున ముఖ్యముగా 16 వ శతాబ్దము నుండి దాని రూపము ఎన్నెన్నో మార్పులు పొందుచు నేటికి యక్షగానములకు వీథినాటకములకు తారతమ్యము ఎన్నుటకు వీలులేని స్థితికి వచ్చినది.

మనము యక్షగానముల నెరిగి యున్నప్పటి నుండి వానిలో వేషములు ధరించిన వివిధ పాత్రలు ప్రవేశించుట, సంభాషించుట కలదు. సూత్రధారుడు రంగస్థలము వదలకుండ కథ చెప్పుచుండుట, వేషధారణ చేసి వచ్చిన పాత్రతో అప్పటికి అవసరమైన రంగస్థలము మీదలేని ఎదిరి పాత్ర స్థానము వహించి సంభాషించుట ఉండినట్లు తోచును.

యక్షగానము అనునది విస్తృతమైన అర్థముగల శబ్దము. ఇందులో సంగీత నాటకములను అంతర్భవింప చేయవచ్చును. అన్నిటిలో సూత్రధారుడు, వేషధారణము, పాత్ర ప్రవేశము, సంభాషణము, గానము, నృత్యము, చతుర్విధాభినయము ఉండును. గ్రంథకర్తలు తమ తమ అభిరుచిని బట్టి కొందరు తమ రచనలను సంగీత నాటకము లనియు మరికొందరు యక్షగానము లనియు పేర్కొనియున్నట్లు భావించుట యుక్తము.

కాబట్టి యక్షగానములకు, సంగీతనాటకములకు భేదము గ్రంథకర్త ఇష్టమును బట్టి ఉన్నదనుట ఎక్కువ సమంజసము. కాక గానము ఎక్కువ ప్రధానమైనప్పుడు యక్షగానమనీ, గానము లేక అభినయము ప్రాధాన్యము వహించి నపుడు నాటక మనియు వారు పేర్కొని యున్నట్లును తలంపవచ్చును.

శ్రీ స్వామివారు ప్రహ్లాదభక్తివిజయమును సంగీత నాటకమనియే నిర్వచించిరి. శ్రీ గణేశుల ప్రవేశమునకు ముందు చెప్పిన ద్విపదలో

> 'నాటకం బొకటి నే స్వయముగా నీకు
> నాటగా వినుపింతు హాటకాభరణ.'

అని తన నాటకమును స్వయముగా వినుపింప దలచినట్లు ప్రకటించిరి. తరువాత గణేశుల ప్రవేశ సమయమున చెప్పిన 'శ్రీ గణపతిని సేవింపరారే శ్రితమానవులారా' అను సౌరాష్ట్ర రాగము, ఆదితాళ మందలి కృతి యొక్క అనుపల్లవిలో

> 'వాగధి పాది సుపూజల చేకొని
> బాగా నటింపుచును వెడలిన'

అను దానిలోను,

> 'పనస నారికేళాది జంబూఫలము లారగించి
> ఘనతరంబుగను మహిపై పదములు

ఘల్లు ఘల్లన నుంచి
అనయము హరిచరణ యుగ్గములను హృద
యాంబుజమున నుంచి
వినయమునను త్యాగరాజ వినుతుడు
వివిధ గతుల ధిత్తళాంగుమని వెడలిన'

అను చరణ భాగములోను నృత్యము చేయు సమయ మున గానము చేయు శబ్దములను కూర్చి ఇది నృత్యాభి నయములతో ప్రదర్శింప వలసినదని సూచించి యున్నారు. గణేశుల ప్రవేశ సమయమునకు ముందు చెప్పిన,

'రాగతాళ మృదంగ రవళిచే మిగుల
నాగరికం బభినయముచే జెలగు
భక్తాగ్ర గణ్యుడై పరగు ప్రహ్లాద
భక్తి విజయమన బాగైన కృతిని'

అను ద్విపదలో దీనిని మృదంగాది వాద్యముల సహ కారముతో, రాగతాళములతో గానము చేయుచు అభినయము చేయవలసినదిగా నుద్దేశించినట్లు స్పష్ట పరిచిరి. వాస్తవమునకు ఇట్లు ప్రదర్శించిననే కాని దీనికి పరిపూర్ణత సిద్ధిం పదు. సంగీతాభిమానులకు మిక్కిలి ప్రీతి పాత్రమైన, 'వాసు దేవయని వెడలిన ఈ దౌవారికుని గనరే—' అను కల్యాణి రాగ మందలి దౌవారకుని ప్రవేశకృతి లోని

'బాగుమీర నటనము చేయుచును
పతితపావనుని తావేడుచును
రాగతాళ గతులను పాడుచును'

అను చరణ భాగమును పరిశీలించినను, ఇదే ఉద్దేశము వెల్లడియగును. దౌవారికుని ప్రవేశమునకు ముందు వచనములో 'ఇట్టి యాహ్లాదమగు ప్రహ్లాద భక్తి విజయమను నాటకోపక్రమ సమయము నందు దౌవారికుడు వచ్చున దెట్టులనిన' అనినారు. తరువాత దౌవారికుండు సూత్ర ధారునిం గని 'ఈ సభ యేమి? ఈ దివిటీల ప్రభలేమి? ఈ మృదంగాది వాద్య ఘోషలేమి? ఈ సొగసైన వేషము లేమి? ఈ నాటకమునకు పేరేమి? దీని ఫలమేమి? ఈ నాటకం బాడుమని ఎవరాన తిచ్చిరో, ఈ విషయం బెరింగింపు'మని పలుకుట వలనను ఇది మృదంగాది వాద్యముల సహకారముతో రాత్రియందు దివిటీల ప్రకాశములో పాత్రధారులు సొగసైన వేషములు ధరించి ప్రదర్శింపవలసిన నాటకమని ప్రకటిత మగును.

స్వామివారు కావ్యము యొక్క చివరి భాగమున,
'శ్రీరామబ్రహ్మ తనయ త్యాగరాజేన నిర్మితమ్
ప్రహ్లాదభక్తి విజయ ప్రబంధం భుక్తి ముక్తిదమ్.'

అని ఫలశ్రుతిని చెప్పుచు తన రచనను 'ప్రబంధ' మనినారు. దౌవారికుని ప్రవేశ వచనములను ఫలశ్రుతి వచన ములను కలిపి భావనచేసినచో ప్రధానముగా ఇది దృశ్య ప్రబంధ మనియే స్వామివారి అభిప్రాయమైనట్లు స్పష్ట పడుచున్నది. ఐతే ఇందులో కొన్ని శ్రవ్య ప్రబంధ లక్షణ ములు కూడ కనబడుచున్నవి. శ్రీస్వామివారు తమ ప్రబం మునకు శ్రీరామచంద్రుని కృతిభర్తగా చేసి

'నీ కారుణ్యముచే నే
నీ కావ్య మొనర్చినాడ నింపుగ వినుమా!'

అని తన కావ్యమును వినిపించెను. తరువాత చెప్పిన

'శ్రీమత్పంచ నదంబను
భామిని విలసిల్లునట్టి పురవరమున శ్రీ
రామ స్వరూపు డనదగు
రామబ్రహ్మార్య సుతుడ రాగరహితుడన్.'

అను పద్యమున తన పురమును, తండ్రిని స్మరించి నాడు. ఇట్లు కృతిభర్త, కృతికర్తల వంశవర్ణనము పద్యము లలో కవి స్వముఖమున చెప్పుట మామూలు నాటకములందు కనుపించదు. ఈ భాగమును శ్రవ్య ప్రబంధముల కుండెడి అవతారికగా భావింపవచ్చును. ఇట్టి లక్షణములు కలిగి యుండుట వలననే స్వామివారు దీనిని ప్రబంధమని పేర్కొని నారేమో!

ఇందు అంక విభాగము కలదు. ఐదు అంకములున్నవి. పాత్రప్రవేశాదికములు కలవు. కృతికర్తయు దీనిని నాటక మని పేర్కొనిరి. కనుక దీనిని నాటకమనియు అనవచ్చును. అట్లని యక్షగానలక్షణము లిందు కనుపించవనియు చెప్ప లేము. కనుక ఇది యక్షగాన లక్షణములను, దృశ్య, శ్రవ్య ప్రబంధ లక్షణములను కలిగియున్న విశిష్ట రచన. ఇందు సంగీతమునకు అధిక ప్రాధాన్యత కలదు. కనుకనే స్వామివార్

'యేగాయంతి సదా భక్త్యా
యేశృణ్వంతి చ శ్రద్ధయా'

అని ఫలశ్రుతిలో నుడివియున్నారు.

## 2

స్వామివారి సంగీతనాటకములు మూడింటి యందు సీతారామ విజయము పూర్తిగా లభింపలేదు. అశ్వమేధ యాగా శ్వముతో శత్రుఘ్నుని పంపించుటతో దాని కథ ప్రారంభ మగును. వీరి నౌకాచరిత్రము ఏకాంకిక. చిన్నది. భక్తిని ప్రబోధించు నాటకము. అధిక ప్రచారముగల సంగీత నాటకము.

గోపికలకు ఒకనాడు యమునానదిలో విహరించుటకు కుతూహలము కలిగినది. కృష్ణుడు సప్తవర్షముల బాలుడు. బాలకృష్ణుని తమతో తీసికొని వెళ్లుటను గురించి వారిలో కొంత తడవు చర్చ జరిగిన పిమ్మట తుదకు అతనిని తమతో తోడ్కొని పోదురు. తన మాహాత్మ్యము తెలియక స్వాభి మానముతో ప్రవర్తించిన గోపికలకు నీతి బోధ చేసి అజ్ఞా నము తొలగింప శ్రీకృష్ణుడు సంకల్పించినాడు. మధురమైన సంభాషణలతో శ్రీకృష్ణుడు గోపికలు కాలక్షేపము చేయు చుండగా పడవ యమునా నది మధ్యకు చేరినది. ఇంతలో ఆకస్మికముగా పెద్ద గాలివాన వచ్చినది. అది కృష్ణుడు కల్పించి

వది. పడవ అడుగుభాగము చిల్లిపడి నీరు పడవలోనికి రాసాగినది. పడవ మునిగిపోనున్నది. తమ వస్త్రములచే పడవ రంధ్రముల మూయవలసినదిగా గోపికలకు భగవానుడు తెల్పెను. ముందు గోపికలు దీనికి సమ్మతింపలేదు. కాని అట్లు చేయనిచో పడవ మునుగుట తప్పదని, మాయవిడువుడని, స్వామి హెచ్చరించెను. స్వప్రాణ రక్షణార్థము విధిలేక చివరకు వారు తమ వస్త్రములను, కంచుకములను తీసి, పడవ రంధ్రమును మూసి, భగవంతుని ధ్యానము చేసిరి. వెంటనే గాలివాన తగ్గినది. పడవ క్షేమముగా ఒడ్డు చేరినది. సందర్భమును బట్టి శృంగారము కొంత భాసించినను, తన ప్రియ సఖురాండ్రయిన గోపికల అజ్ఞానము తొలగించి, భగవద్భక్తి కలిగించుటయే భగవానుని ఆశయము. అదికాక శ్రీకృష్ణుడు ఏడేండ్ల బాలుడు. కావున ఇందలి శృంగార మేనమాత్రమును కాముక శృంగారముగా నుండక భగవద్భక్తిలో పర్యవసించును.

ఈ కథ భాగవతములో లేదు. గోపికా వస్త్రాపహరణములో నారాయణతీర్థుల వారు ప్రపంచించిన అజ్ఞానావరణము పోగొట్టు భావమే ఈ కథా విషయమునకు బీజప్రాయమైనదని మనము నిశ్చయింపవచ్చును.

ప్రహ్లాదభక్తి విజయము 5 అంకముల సంపూర్ణ నాటకము. ఇది నౌకా చరిత్రముకంటె విస్తృతిలోనేకాక సర్వవిధముల సుసంపన్నమైనది. దీని పేరు సూచించినట్లు దీని కథావస్తువు భక్తాగ్రేసరుడైన ప్రహ్లాదుని భక్తి సర్వ పరీక్షలలో నెగ్గి విజయమునంది, ప్రహ్లాదుడు లక్ష్మీ నారాయణుల సాక్షాత్కారము పొందుట కాబట్టి ఇంతవరకు త్యాగరాజస్వామి వారి కృతుల తోడను ఆనందించు గాయక లోకమునకు స్వామివారి సంపూర్ణ రచనా స్వరూపము దర్శించు భాగ్యము ఈ రూపముగా అందుబాటు లోనికి వచ్చినది.

'ప్రహ్లాద భక్తి విజయము' నిష్కామమైన భక్తిని ప్రబోధించు దృశ్య ప్రబంధము. ఇందలి ప్రథమాంకమున గణేశ ప్రార్థన, దౌవారికుని ప్రవేశము, సూత్రధారుని సంభాషణములు ఐన తరువాత ప్రహ్లాదుని శేషపాశముతో కట్టి అబ్ధిలో పడవైచుటతో కథ ప్రారంభ మగును. అంబుధి అతనిని విష్ణుభక్తునిగా గుర్తించి తేర్చి నాగపాశ విముక్తిని గావింపజేయును. ప్రహ్లాదుడును సముద్రుని విష్ణుభక్తునిగా నెరింగి 'వారిధి నీకు వందన మొనరించెద'నని వందన మొనర్చి

'సారెకు నీ హృదయారవిందమునను
మారమణుడు గూడు దారి తెలుపుమునాతో'

అని తోడి రాగ చాపుతాళ కీర్తనతో ప్రార్థించును. ఇట్లు ప్రార్థించిన ప్రహ్లాదుని చూచి ఆతని ఆంతరంగిక భక్తిని తెలిసికొని 'ధన్యుని వేల్పులలోమూర్ధన్యుని ప్రతిలేనిలావణ్యుని పరమ కారుణ్యుని మతియింపవయ్య' అని భగవద్దర్శనోపాయము తెల్పి కల్యాణి రాగము, ఆదితాళ మందలి

'వచ్చును హరి నిన్ను జూడ వచ్చును హరి
నిన్ను జూచి మెచ్చును హరి నిన్ను జూచి'

అను కీర్తన యొక్క పల్లవిలో ప్రహ్లాదునకు హరి ఆతని జూడ వచ్చునని విశ్వాసము కలిగించును. దీనితో ప్రథమాంకము పూర్తియగును.

ప్రహ్లాదుడు సముద్ర మహారాజు పలికిన వాక్యంబుల నాలకించి శ్రీహరిని అనేక విధముల ధ్యానించి శ్రీహరి ప్రత్యక్షము కాలేదని అతడు అత్యంత వ్యసనాక్రాంతుడై మొరలిడు చున్న సమయమున నారదస్వామి సనకసనందనాదుల యొద్దకు వెళ్లి ప్రహ్లాదుని వృత్తాంత మంతయు వినిపించును. ఇక్కడ ప్రహ్లాదుడు,

'నిజమైతే ముందర నిలువు మేవేళ
అజుడైన హరిహయుడైన నా భక్తి'

అని అనేక విధంబుల బల్కు విని నారదమౌని ప్రహ్లాదునకు సాక్షాత్కరించి వైకుంఠ ప్రభావంబు అభివర్ణించి అచట శ్రీమన్నారాయణుడు, లక్ష్మీదేవుల మధ్య ప్రహ్లాదుని గూర్చి జరిగిన సంభాషణమును తెల్పి ప్రహ్లాదుని భాగ్యము పండెనని వెల్లడించును.

## ద్వితీయాంకము :

ఇంకను శ్రీహరి ప్రత్యక్షము కాలేదని ప్రహ్లాదుడు అత్యంత వ్యసనాక్రాంతుడై యుండును.

'కరి వరదుని కన గోరుచు
గరగుచు కన్నీరు నించి కలడో లేడో
హరిహయ బ్రహ్మాదులకును
హరి యగబడువాడుగాడయని మూర్ఛిల్లెన్.'

ఇవ్విధంబున ప్రహ్లాదుడు ప్రపంచ మంతయు మరచి మూర్ఛ చెంది యుండు సమయమున శ్రీమన్నారాయణుండు అత్యంత కృపాళుండై వైకుంఠము నుండి వేంచేసి ప్రహ్లాదుని గాంచి కారుణాయుతుడై తన ఉరమున జేర్చుకొన్నతరి శ్రీరంగనాథుని శుభాంగ సంగముచేత ప్రహ్లాదుడు మూర్ఛ నుండి తేరుకొనెను. ప్రహ్లాదుండును తన మనంబున గోరుచున్న మహాభాగ్యము పండెననుచు బ్రహ్మానంద జలధి నోల లాడుచు సకల దిక్పాల మకుట నీరాజిత పదారవిందుని, సార్వభౌముని, అఖిలాండ కోటి బ్రహ్మాండ నాయకుండగు శ్రీమన్నారాయణమూర్తిని సేవించి,

'ఏనాటి ఫలమో ఏ దానబలమో
శ్రీనాథ, బ్రహ్మకైనను నీదుసేవ
దొరకునా.....'

అను భైరవి రాగము, ఆదితాళ కీర్తన పాడి ఇది అంతయు తన భాగ్యమని ఆనంద పడును.

## చతుర్థాంకము :

ఇట్లు బ్రహ్మానంద జలధిలో నోలలాడు చున్న ప్రహ్లాదుని చూచి ఆతని చిత్త శుద్ధి లోకులకు తెలియ

జేయుటకును, నిజ భక్త జన సంభాషణ మందు వాస గలవాడగుట వలనను శ్రీ మన్నారాయణ మూర్తి కామ్య వర మందు కొమ్మనియు,

'ధన కనకములు ఎన్నైన నీకు
దారపుత్రులు సొగసైన ఇండ్లు
చనువున నొసగుదు సంశయ మేల'

అనియు పలికెను. ప్రహ్లాదుండును ఇహసుఖంబుల యందును సంపదల యెడలను తనకు గల విముఖతను ప్రకటించును. హరి చరణ సేవయే తన కోరికగా వెల్లడించును. హరి ప్రహ్లాదుని భక్తిని గుర్తించి కోరిన వరమిచ్చి చేరదీసి కౌగలించు కొనెను. ప్రహ్లాద స్వామియు,

'ఆనంద మానంద మాయెను బ్రహ్మానంద
నిత్యానంద సదానంద పర ॥మానంద॥

అని పరమానందము నంది మంగళగానము చేయును.

### పంచమాంకము :

ఈ లాగున ప్రహ్లాదస్వామి శ్రీహరిని సేవించుచు ప్రపంచ మంతయు తృణముగా నెంచి నేత్రోత్సవానంద మందు చుండగా నారాయణుండు అతని మనస్సు ఇంకను శోధింపనెంచి తాను వైకుంఠమునకు మరలిపోనున్నట్లును,

'వచ్చి ప్రొద్దాయె మరలనే వత్తుగాని
జాలి బడవద్దు ననుగాన జాల లేక.'

అని పలికిన పలుకులు విని ఆశ్చర్య భయ శోకంబులచే,

'నన్ను విడచి కదలకురా
రామయ్య వదలకురా
నిను బాసి యర నిమిష మోర్వనురా'

అని రీతిగౌళ రాగ చాపుతాళ కృతిలో తన్ను విడువ వలదని రామయ్యను ప్రార్థించును. ఈలాగున నర నిమిషమైనను ఎడబాయ దరము గాదనిన ప్రహ్లాదస్వామికి తత్వబోధన చేసి బాలకుని కోర్కె ప్రకారమే మరల వచ్చెదనని శ్రీహరి వెళ్లి పోయెను. ప్రహ్లాదుండును 'తల్లి చెంతను లేని తనయుని చందంబు' హరిని కానక యుండి మిక్కిలి పరితపించుచు బహువిధంబుల మొర లిడ, ప్రహ్లాదుని ప్రేమ దుఃఖంబు సైరించ లేక దేవతా సార్వభౌముడౌ లక్ష్మీనారాయణమూర్తి లక్ష్మీ సమేతుండై ఆ సాత్త్విక భక్తాగ్రేసరుని వద్దకు వచ్చెను. సీతా సమేతుండైన శ్రీరామచంద్ర స్వరూపుని గనినంతనే ప్రహ్లాదుడు ఝల్లని భాష్పములు వదలుచు, పాదములకు మ్రొక్కెను. అంతట హరి అత్యంత దయతో ప్రహ్లాదుని కౌగలించుకొని ఆదరించెను.

ఈ విధముగా ప్రహ్లాదుని భక్తి శ్రీ మహావిష్ణువు కావించిన సమస్త పరీక్ష లందును నెగ్గి విజయము గాంచుటయే ప్రహ్లాద భక్తి విజయ మందలి కథా వస్తువు.

## 3

శ్రీ త్యాగరాజస్వామి గొప్ప రామభక్తులు. తనువు, ధనము శ్రీరామచంద్రుని కర్పణము గావించి తరించిన ధన్యజీవి. స్వామి వారి రచన లన్నిటియందు వారి ఇష్టదైవమైన శ్రీరాముని యందు గల భక్తియే ప్రాధాన్యము వహించినది. రామునకును ఇతర విష్ణ్వవతారములకును భేదము నెంచక సర్వము రామ మయముగా నెంచిన పుణ్యమూర్తి.

ఈ దృశ్య ప్రబంధము శ్రీ జానకీమనోహరుడైన రామ చంద్రుని సంబోధనతో ప్రారంభ మగును. తరువాత విష్వక్సేన వాణీ ప్రార్థనలు కలవు. అటు పిమ్మట పుంభావ సరస్వతి యైన త్యాగరాజస్వామి నారద గురు పద యుగములు మదిలో నెంచి సన్నుతి సేయుట నారదుని యందు గల గురుభావమును వెల్లడి చేయును.

శ్రీ స్వామివారు భగవంతుని యందు వలెనే భగవంతుని సేవించి తరించిన భాగవతుల యందును సమాన భక్తి గౌరవములు కలవారు. దాసత్రయ మన దగిన తులసీదాస, పురందరదాస, రామదాసులను ప్రత్యేకముగా వినుతించెను. అటు పిమ్మట భారత భూమి యందంతటను ప్రసిద్ధి చెందిన పాండురంగ, వాసుదేవ, సహదేవ, జయదేవ, తుకారామ, నారాయణ తీర్థాది భగవద్దాసులకు ప్రణమిల్లి, భాగవతుల యందు తనకు గల భక్తిని ప్రదర్శించినారు.

శ్రీ స్వామి భక్తాగ్రేసరుడు. మోక్షమును తప్ప అన్యము కోరని నాద తపస్వి. ఇహలోకమున తనకు కలిగిన కష్టములు నెదుర్కొని మోక్షమును పొంద నాశించిరి. ఇతర వాగ్గేయ కారుల వలె తమ కృతులను రాజుల కంకిత మొసగుట వలన లభించు భాగ్యభోగముల నాసచేయక రాముని సన్నిధిసేవయే సుఖమని సుస్వరముతో ప్రకటించిన భక్తవరేణ్యుడు. కనుకనే లక్ష్మీ నారాయణుడు ధన కనకాది కామ్యవరము లిచ్చెదనని ప్రహ్లాదుని భక్తిని పరీక్షించును. ఇందు ప్రహ్లాదుడు ఇహ సౌఖ్యముల యందును సంపదల యెడలను విముఖతను ప్రకటించి హరిచరణ సేవయే తన కోరికగా తెల్పి దానిని పొంది బ్రహ్మానందమును పొందును. శ్రీ స్వామివారును భక్తులై రామభక్తి సామ్రాజ్యమును మాత్రము ఆశించిన కోరికను ఇట్లు ప్రహ్లాదుని ద్వారా సూచించినట్లు వూహింపవచ్చును.

భక్తాగ్రేసరుడైన ప్రహ్లాదుడు తన తండ్రి యగు హిరణ్య కశిపుడు పెట్టిన బహుముఖ కష్టముల నెదుర్కొని ముక్తిని పొందవలెనను కాంక్షతో భక్తితో శ్రీ హరిని ప్రార్థించి ముక్తిని పొందును. శ్రీ స్వామివారును సీతారాముల సేవ చేయుటలో బహుముఖ కష్టముల నెదుర్కొని తుదకు తరించినట్లు వారి జీవిత చరిత్ర నెరింగిన వారికి విదితమే. స్వామివారు తమ భక్తి విజయమునే రూపాంతరమున సంగీత దృశ్యప్రబంధ రూపమున ప్రహ్లాద భక్తి విజయములో ప్రదర్శించిరి.

శ్రీ స్వామి వారు శ్రీరామ పంచాయతన సేవ చేయుచుండెడివారు. తన సంగీతముచే భారత దేశ మంతటిని రసత

రంగముల యందోల లాడించగల్గునంతటి మధురగాయకులు, ప్రజ్ఞాధురీణులు, వాగ్గేయ కారక సార్వభౌములై ఉండికూడ రాజుల కొలువు నందుండుటకు ఇష్టపడ లేదు. వారు ప్రసాదించు నిధులను, భోగములను స్వీకరింపక ఉంఛ వృత్తిచే తన జీవితము గడుపుచుండిరి. ఇది వారి సోదరుడైన పంచాపకేశునకు ఆగ్రహము కల్గించెను. రాజాస్థానము నందుండి సకల భోగములను అనుభవించెడి ఆకాలపు తక్కిన సంగీత విద్వాంసుల వలె తన తమ్ముడును భోగముల ననుభవింప వలెనని ఆశించెను. ఇట్లు తన తమ్ముడు ఐహిక భోగములందు విముఖుడగుటకు శ్రీ సీతారాముల విగ్రహములే కారణమని విశ్వసించి, వానిని తొలగించిన తమ్మునకు ఐహిక సంపదలందు ఆసక్తి కలిగి సంపాదనా పరుడగునని తలచి నిత్యము స్వామి వా రర్చించు విగ్రహములను కావేరీ నదిలో పారవైచెను. రామభక్తి సామ్రాజ్య నివాసి యగు శ్రీ స్వామి వారికి శ్రీ రామచంద్రులు స్వప్నములో దర్శన మిచ్చి, తాను కావేరీ నదిలో నున్నట్లు తెలుపగా, స్వామి మరుదినము కావేరి నదిలో సీతారామచంద్రుల విగ్రహములను పొంది అమందానందమును పొందిరి. స్వామివారు రామచంద్రుల సేవా పథమున, ఇట్లే మరియు అనేకములైన ఆటంకములు కలుగు చున్నను, తానును ప్రహ్లాదునివలె విజయమును పొంద వలెనని ఆశించినట్లు మనమూహించుట సమంజసము.

నాటకమందలి ద్వితీయాంకమున సముద్ర మహారాజు పలికిన వాక్యముల నాలకించి నారద వినుతుని సన్నుతించు సమయమున గానము చేసిన 'వందనం రఘు నందనా సేతు బంధనా భక్త చందనా' అను శహన రాగ, ఆదితాళ కృతి యందలి మూడవ చరణము

'ఓడను, భక్తి వీడను, నొరుల
వేడను, నీవాడను, రామ॥'

అను దానిని పరిశీలించినచో, అన్ని పరీక్షలలో నెగ్గి విజయము పొందగలననెడి వారి దృఢ విశ్వాసము ప్రకటిత మగును. తమ స్వానుభవములను పరోక్షముగా మనకు కన్నుల గట్టునట్లు స్వామి వారు ఈ దృశ్య ప్రబంధములో ప్రదర్శించి దానికి ప్రహ్లాద భక్తి విజయమని నామ మిడినారు. అందువలన దానిని మనము శ్రీ త్యాగరాజుల భక్తి విజయముగా గూడ గ్రహింపవచ్చును.

## 4

త్యాగరాజస్వామి వారి 'కృతులు' సుసజ్జిత మైనవి. వీని రచనయు, సంగీతమును విశిష్టమైనవి. సంగీతములో 'కృతి'ని సంగతులతో ప్రస్తరించి గానము చేయు విశిష్ట పద్ధతి స్వామి వారి తోడనే పరిపూర్ణత గాంచినది. స్వామివారు సుసజ్జితమైన తమ కృతులచే భారతీయ సంగీత భారతిని అలంకరించిరి. వారు తమ కృతుల రచనలో వలెనే నాటక రచన యందును నవీనము, స్వతంత్రము నైన మార్గము ననుసరించిరి.

వీరి ప్రహ్లాద భక్తి విజయము ప్రాచీన యక్షగాన లక్షణములు మాత్రమే కలిగి యున్న కేవల యక్షగానము కాదు. నాటకమున కవసరమైన కొన్ని లక్షణముల కలిగియుండి ప్రదర్శన కుద్దేశింపబడిన సంగీత నృత్య ప్రబంధము.

దౌవారికుడు, వారిధి, విష్ణువాహనుండు, శ్రీహరి ఇత్యాది కొన్ని పాత్రల ప్రవేశ సమయమున 'దరువులు' ఉపయోగింపబడినవి. నాటకమందు సూత్రధారుడు సంభాషణము చేయ వలసియుండగా ఇందు దౌవారికుండువచ్చి నాటకము ప్రదర్శించు సూత్రధారునిగని 'ఈ సభయేమి? ఈ దీవిటీల ప్రభలేమి?....' ఇత్యాది సంభాషణ నెరపును.

ఇందు సంగీత ప్రధానమైన యక్షగానములకును నాటక లక్షణములకును భిన్నమైన శ్రవ్యప్రబంధ లక్షణములును కొన్ని కనుపించుచున్నవి. నాటకము భరతవాక్యముతో సమాప్తము కావలసి యుండగా ఇది ఫలశ్రుతితో సమాప్తమగును. అవతారిక, ఇష్టదేవతా ప్రార్థన, ఫలశ్రుతులను చెప్పిరి. అందువలనే తమ కావ్యమును ప్రబంధమనియు నుడివి యున్నారు. శ్రీ నారాయణ తీర్థులవారు 'కృష్ణలీలా తరంగిణి' యందు అవతారికను, ఫల శ్రుతిని చెప్పి ఈ విషయమున వీరికి మార్గదర్శకులైనారు. శ్రీ తీర్థులవారు త్యాగరాజస్వామి వారి సంగీత గురువులైన శొంఠి వేంకటరమణయ్య గారికి గురువులైనట్లు తెలియవచ్చుచున్నది.

స్వామివారు పుణ్యక్షేత్రములను దర్శించి ఆయా దేవతలపై కృతులను గానము చేసిరి. ఇవికాక షోడశోపచారములు చేయు నపుడు కీర్తనలు రచించిరి. ఇవి దివ్యనామ కీర్తనలను పేర ప్రసిద్ధి చెందినవి. స్వామివారు ప్రసిద్ధములైన ఉత్సవములను దర్శించి నపుడును ఆ దేవతలపై కీర్తనలు రచించియున్నారు. ఇవి ఉత్సవ సంప్రదాయకీర్తనలను పేర గానము చేయబడుచున్నవి. ఇటులనే స్వామివారు ప్రహ్లాదభక్తి విజయమును చైత్రోత్సవ సమయమున సంగీత, నృత్య, అభినయములతో ప్రదర్శింప నిచ్చగించి రచించియుందురని ఇందలి ద్విపద పాదముల వలన నూహింప వచ్చును.

"బాగుగ ప్రహ్లాదభక్తివిజయంబు
నాటకంబుగ సభా నాయకుల్ మమ్ము
నాటగావింపరే యని యానతియ్య

చైౖత్రోత్సవంబున జెలగుచు మేము
చిత్రంబుగా సేవ సేయ గోరెదము.''

భక్తి కలిగి నిరంతరము శ్రీ మన్నారాయణుని నామస్మరణ కావించి బ్రహ్మానందము పొందిన ప్రహ్లాదుని చరిత్ర స్వామివారి నాకర్షించింది. ప్రహ్లాదచరిత్రను సంస్కృతభాగవతమును, పోతన వ్రాసిన ఆంధ్రభాగవతమును స్వామివారు పలువార్లు పఠించి యుండిరని తెలియవచ్చుచున్నది. ఐనను ప్రారంభములో తప్ప ఇందలి కథకును భాగవత కథకును ఎట్టిసంబంధములేదు. ప్రారంభములో హిరణ్యకశిపుని కింకరులు ప్రహ్లాదుని నాగపాశబద్ధుని చేసి సముద్రములో పడవేయుట ఒక్కటే భాగవత కథాంశము ఇందులో గ్రహింపబడినది. తక్కినదంతయు వారి స్వయం సృష్టి. నృసింహావతారముకాని, హిరణ్య కశిపుని వధకాని లేకుండ ప్రహ్లాద భక్తి విజయమును శ్రీ త్యాగరాజస్వామి రచించియుం డుట మనము గమనింపవలెను. తమ్ము ఇతరులు పెట్టినకష్టములు స్వామివారి దృష్టిలో భగవంతుడు తన భక్తిని పరీక్ష చేయుచున్న పరీక్షగానే భాసించినది. భాగవతములో, ప్రహ్లాదుని భక్తివలన నృసింహస్వామి ఆవిర్భవించి, భక్తునిబాధ పెట్టుచున్న రాక్షసుని సంహరించెను. ఈ నాటకములో ప్రహ్లాదునికి శత్రువులేలేరు. ఇది ఒక విశేషము.

శ్రీ త్యాగరాజస్వామి రామచంద్రుని భక్తులు. సర్వము రామమయముగానెంచువారు. ఎందుచూచినను శ్రీరామబ్రహ్మమే వారికి సాక్షాత్కరించును. సృష్టి, స్థితి, లయములకు, శ్రీరామచంద్రమూర్తినే కారకునిగా భావించి సన్నుతించిరి. అందు చేతనే ద్వితీయాంకమందు సముద్రమహారాజు పల్కిన వాక్యంబుల నాలకించి శ్రీహరిని,

''శ్రీ భక్తహృత్స్థాన గాడాంధకారాయుతార్క ప్రభాకార దివ్యంబు నేత్రోత్సవం బౌను జూపించు రామప్రభో నీ వనే కాండ కోట్లన్ విధీంద్రాది దేవాసుర స్థూల సూక్ష్మంబులన్నీవు పుట్టించి కాపాడి ఘష్టంబుసేయన్ సదా మూడురూపంబులం దాల్చి లోకేశుడై, విష్ణువై, రుద్రుడై చాల లీలా వినోదంబులన్ సేయ. . . . . . . .''

అని దండకముతో స్తోత్రము చేయును.

శ్రీ త్యాగరాజస్వామి రామచంద్రునకును ఇతరవిష్ణ్వవతారములకును భేదమునెంచలేదు. భాగవత కథానుసారము హిరణ్యకశిపుని చీల్చి ప్రహ్లాదుని రక్షించినది నృసింహస్వామి. కాని త్యాగరాజులవారి ప్రహ్లాదునకు మోక్షమిచ్చినది శ్రీహరి. ప్రహ్లాద స్వామి షోడశోపచారములు చేసినది శ్రీరామచంద్రులకు. ఇందలి చతుర్థాంకమున భక్తి పారవశ్యమున మూర్ఛనందిన ప్రహ్లాదుడు హరి యంకమున స్వామి కర సౌఖ్యముచే బూర్ణుడై దిగ్గునలేచి 'జగన్మోహనాకారుని జగద్గురుని శంఖచక్ర శార్ఙ్గనందకగదాపంచాయుధ ధరుని శరణాగత సులభుని పుండరీకాక్షుని పురాణ పురుషుని. . . . .సీతామోహన విగ్రహుని' బ్రహ్మానందముతో స్తోత్రము చేయును. బహ్మేంద్రాది దేవతలందరు చూచుచుండగా శ్రీ మన్నారాయణ మూర్తిని షోడశోపచారంబులచే బూజించి నానా విధ కుసుమంబులు జల్లునపుడు గానము చేసిన,

''చల్లరే రామచంద్రునిపై పూలు
అ.ప. సొంపైన మనసుతో నింపైన బంగారు
గంపలతో మంచి చంపకములను''

అను ఆహిరి రాగము, చాపుతాళము లోని కీర్తనలోను శ్రీరామచంద్రునే సేవించినారు. ఇదే సందర్భమున గానము చేసెడి మంగళముకూడ 'పవమాన సుతుడు పట్టు పాదారవిందములకు'— అని రామపరముగనే చెప్పిరి. ఇందులో వివిధ సందర్భములలో రచించిన 45 కీర్తనలలోను 24 కీర్తనలు రామపరమైనవి.

## 5

ఈ నాటకమును గానముతో అభినయించుచు ప్రదర్శింపవలెను. దీనికి స్వామివారు మధురమైన సంగీతమును కూర్చినారు. ఇందుకల మొత్తము 45 కీర్తనలను 28 రాగములలో సంగీతము కూర్చిరి. ఘంటా, ఆహిరి, యదుకులకాంభోజి వంటి ప్రాచీన యక్షగానములలో గానము చేయబడి బాగుగా ప్రచారములోనికి వచ్చిన ప్రాచీన రాగము లను ఉపయోగించిరి. ఇంకను శంకరాభరణము, కల్యాణి, భైరవి, మోహన, తోడి, సావేరి సంతువరాళి, సౌరాష్ట్ర, ఆరభి వంటి త్యాగరాజులవారి కాలము నాడు అధిక ప్రచారముగల రాగములందే స్వామివారు ఇందలి కీర్తనల కూర్చిరి. ఎక్కువ ప్రచారము పొందిన ప్రాచీన రాగములలో సంగీతము కూర్చుట వలన తన సంగీతమును సులభముగా అందరు గానము చేయగలరని తలంచి యుండవచ్చును. ఇందువలన ఈ ప్రబంధము అధిక ప్రచారమును పొంది, ఇందలి భక్తి సంగీతములను అందరు ఆస్వాదించి సంతుష్టులు కావలెనునది వీరి ఆశయమైనట్లు ఊహింపవచ్చును. నళినకాంతి, బహుదారి వంటి నవీన రాగములలో తమ ఇతర కృతులను గానముచేసిన స్వామివారు అట్టి రాగముల నిందుపయోగింపకుంటడుకు మరేమి కారణముండ గలదు?

తాళములను కూర్చుట యందును ఇట్టి మార్గమునే అనుసరించిరి. ఇందలి కీర్తనలన్నియు, ఆది, త్రిపుట, రూపక, ఝంపె, చాపు, దేశాది అను ఆరు తాళములలో నిబద్ధమై ఉన్నవి. చాపు దేశాది తాళములు దేశితాళములు. అధిక ప్రచారము కలవి. ఆదితాళము తాళమందు స్వల్ప పరిచయము కలవారందరు ఎరిగి బహుళ వ్యాప్తిలో నున్న తాళము. అట్టి ఆదితాళములో 18 కీర్తనలు, చాపు తాళమందు 17 కీర్తనలు నిబద్ధమై ఉన్నవి. ఇట్లు ఈ రెండు తాళములను అధికముగా ఉపయోగించుట కూడ పై అభిప్రాయమునే బలపరచుచున్నది.

సౌరాష్ట్ర రాగములో గణేశస్తుతి యొనర్చి నాటక ప్రారంభము చేసిరి. ప్రహ్లాదుని రక్షించి శ్రీహరిమోక్షమిచ్చిన సమయమున ఆయనషోడశోపచారములు చేయుచు మంగళగానము చేయుటతో ఇందలి కథ సమాప్తమగును. ఈ సమయమున చెప్పిన మంగళము కూడ సౌరాష్ట్ర రాగమందే గానము చేయబడినది. నౌకా చరిత్రను కూడ సురటి రాగములోనే ప్రారంభించి ఆ రాగముతోనే పూర్తి చేసిరి. ప్రారంభించిన రాగముతోనే పూర్తి చేయుట వీరు సృష్టించిన నూతన సంప్రదాయ మనదగినవి.

# త్యాగరాజస్వామివారి సంగీతనాటకములు

'ఆదినాట అంత్య సురటి' అను ఈ నాటి ప్రసిద్ధమైన సంప్రదాయము ప్రహ్లాద భక్తి విజయము వెలువడిన నాటికి అంతగా ప్రచారములో లేదన దగును. గాయకులు నాట రాగ గానముతో సభను ప్రారంభించుట నేటి ప్రసిద్ధ సంప్రదాయము. సభాంతమున శ్రీరాగమును కాని, సురటి రాగమును గాని గానము చేయుదురు. ఇట్లు గానము చేయుట వలన ఆనాటి గానమందు తెలిసికాని తెలియక గాని దొర్లిన అపశ్రుతుల వలన కలుగు దోషముల దుష్ఫలితములు తొలగునని విశ్వాసము. కాని స్వామివారు దీనిని పాటింపలేదు. శ్రీనారాయణ తీర్థులును కృష్ణలీలాతరంగిణిని సౌరాష్ట్ర రాగమందే విఘ్నేశ్వర ప్రార్థనతో ప్రారంభించిరి. ఈ విషయములో వీరు స్వామి వారికి మార్గదర్శకు లందనునుకొన్నను, తీర్థులవారు మరల సౌరాష్ట్ర రాగముతోనే దానిని సమాప్తము చేయలేదు. గౌరీ రాగ కీర్తనతో తరంగిణిని సమాప్తము చేసిరి.

ఇందలి రచనలు కొన్ని కృతులవలెను, కొన్ని కీర్తనల వలెను రచింపబడినవి. ఇందలి కొన్ని కృతులు, కొన్ని కీర్తనలు బహుళ ప్రచారము పొందినవి. ఇందున్న ప్రతి ఒక గేయ రచనయు ఒక కళాఖండము. దౌవారికుని ప్రవేశ సమయమున రచింపబడిన 'వాసుదేవ యని వెడలిన ఈ దౌవారికుని గనరే' అనునది గాయకు లందరిచేత గానము చేయబడి మిక్కిలి ప్రచారమును పొంది ముక్తక రచనలను స్మృతికి తెచ్చుచున్నది. ప్రహ్లాద భక్తి విజయమందలి కృతులు శ్రీస్వామివారి ఇతర కృతుల వలె రాగాలాపనముతోను, సంగతులతోను, చరణము అనేక సంగతులతో నెరవల్ చేసి గానసభల యందు గానము చేయుటకు యోగ్యమైనవి. గణేశుల ప్రవేశ సమయమున రచించిన 'శ్రీ గణపతిని సేవింపరారే శ్రితమానవులారా' అను సౌరాష్ట్ర రాగ, ఆదితాళ కృతి నేటి గానసభలందు గానము చేయబడుచు మిక్కిలి ప్రచారము పొందినది. 'నీనామ రూపములకు నిత్య జయమంగళం' అను సౌరాష్ట్ర రాగమందలి మంగళము కూడ విస్తృత ప్రచార మందినట్టిది. ఇది గానము చేయనిదే ఈనాటి గానసభలు గాని, భజన, హరికథా కాలక్షేపములు కాని పూర్తి కావు. ఇందలి 'వందనం రఘునందనా సేతుబంధనా' అను శహాన రాగమందలి కృతియు, 'రార మా ఇంటిదాక రఘు వీర ప్రమొక్కెద' అను అసావేరి రాగమందలి కృతి, 'నన్ను విడచి కదలకు రా' అను రీతిగౌళ రాగ కృతి, 'ఏనాటి నోము ఫలమో, ఏ దాన బలమో' అను భైరవిరాగ కృతి, 'దొరకునా ఇటువంటి సేవ' అను బిలహరి రాగ కృతి ప్రత్యేక కళాఖండములై సంగీత భారతికి అలంకారములై ఉన్నవి.

ఇందలి "ఎన్నగ మనసుకురాని పన్నగశాయి సొగసు" అను నీలాంబరి రాగమందలి రచనయు, 'దయ రాదా దాశరథీ' అను మోహన రాగము, ఆదితాళమందలి రచనయు, 'పాహి కల్యాణరామ పావన గుణ రామ' అను కాఫీ రాగము, ఆదితాళ మందలి రచనయు, కీర్తనల శైలిలో నున్నవి. అందుచేతనవి సామూహికముగ గానము చేయుటకు కూడ అనువైనవి. ఇంకను ప్రచారము పొందని మధురమైన కృతులు ఇందులో కలవు. వీని గొప్పదనము గ్రహించి గానము చేయవలసిన బాధ్యత యువతరముపై ఎంతైనను కలదు. ఆంధ్రప్రదేశ్ టెక్నికల్ బోర్డువారు, విశ్వవిద్యాలయమువారు నిర్వహించు ప్రవేశ, ఉన్నత పరీక్షల ప్రణాళిక యందు చేర్చి ఐనను యువ తరములో వీనిని ప్రచారము చేయవలసి యున్నది.

శ్రీస్వామివారి సంగీత రచనా పద్ధతి ప్రాతక్రొత్తల మేలు కలయిక. తన కాలమునకు ముందు ప్రచారములో నున్న కీర్తనను పూర్తిగా విడువలేదు. భక్తితో మైమరచి భగవంతుని ధ్యానము చేయుటకు, నానావిధోపచారములు నడుపుచు భక్తితో గానము చేయుటకు మిక్కిలి తగి యున్నవని తలచుటచే కాబోలు స్వామివారు ఈ కీర్తనల రచించియున్నారు. వానితో పాటు పరిణతి పొంది శాస్త్రీయముగా గానము చేయ యోగ్యమైన కృతులును కలవు.

19వ శతాబ్దపు పూర్వార్ధమున తంజావూరు (ప్రాంతము) మహారాష్ట్రుల అధీనములో నున్నది. శ్రీ త్యాగరాజ స్వామివారి తాతగారైన గిరిరాజకవి మహారాష్ట్రులైన రాజైన శాహజీ ఆస్థానమందుండెడివారు. మహారాష్ట్ర రాజులు పరిపాలకులుగా నున్నను వారి ఆస్థాన మందున్న గిరిరాజ కవి వంటివారు ఆంధ్రభాషలోనే కావ్యగాన మొనర్చిరి. అక్కడ కూడ ఆనాటి కావ్యభాష ఆంధ్రమనవచ్చును. అందుచేతనే ఆనాటి కావ్యములు యక్షగానములు, సంగీతనాటకములు ఆంధ్ర భాషలోనే వెలువడినవి.

స్వామి వారి ప్రహ్లాద భక్తివిజయము సంగీతనాటకమైనను దానిని పఠించు పాఠకులను కూడ ఆనందపరచు కమనీయ కావ్యము. ఇందు ఉత్పలమాల, చంపకమాల వంటి వృత్తములు, కందము, ద్విపద, సీసము, గీతము మొదలగు జాత్యుపజాతులును ప్రయోగింపబడ్డినవి.

"శ్రీభక్తహృత్తాప కారాయుతార్క ప్రభాకార దివ్యంబు నేత్రోత్సవంబవును జూపించు రామప్రభో నీవనే కాండకోట్లన్ విధింద్రాది దేవాసుర స్థూల సూక్ష్మంబులన్నిపు పుట్టించి కాపాడి నష్టంబు సేయున్ సదా మూడు రూపంబు లందాల్చి . . . . . అనుదండకమును కూడ పరిశీలించిన వివిధ ఛ్ఛందస్సులను రచించుటయందును స్వామివారికి గల సామర్థ్యము వెల్లడియగుచున్నది.

కరుణ, శాంతరసములేకాక హాస్యరసనుకూడ ఇందు పోషింపబడినది. వైకుంఠమందు లక్ష్మీనారాయణులకు జరిగిన సంవాదమును

"తెలవారు ప్రొద్దుగాకులు మీకు నిజదాస
వెతఁ తీ యేలనొ పనుల్ వేరెలేవె. . . . ."

మొదలుగాగల సీసపద్యములో వర్ణించియుండిరి. ఈ సంవాదము హాస్యరసయుతముగా నుండి పాఠకులకు శ్రవణానందము కలిగించుచున్నది. ఇది యక్షగానములో విధిగా వచ్చెడి హాస్యము చేర్చుటకు చేసిన ప్రయత్నము. ఇందలి కృతులు, కీర్తనలు, చాల భాగము పద్యములు అన్నియు ఆంధ్రభాషలోనే ఉన్నవి. వీరి కీర్తన సులభమైన పదములలో గంభీరమై శ్రోతల హృదయములలో శాశ్వతముద్రవేయగల పదజాలముతో నిండియుండును.

వీరి కీర్తనలలోని భావ సౌందర్యమును పరిశీలించ వలె నన్న ఈ క్రింది కీర్తన ఒక్కటి చాలు.

నీలాంబరి రాగము—ఆదితాళము.

పల్లవి :— ఎన్నగ మనసుకురాని పన్నగశాయి సొగసు
పన్నుగ గనుగొనని కన్నులేలే
కన్నులేలే కంటి మిన్నులేలే॥

చరణము:— మోహముతో నీల వారివాహకాంతిని గేరిన
శ్రీహరిని గట్టు కొనని దేహమేలే
దేహమేలే ఈ గేహమేలే॥

2. సరసిజ మల్లె తులసి విరిజాజి పారిజాతపు
విరులచే బూజించని కరములేలే
కరములేలే ఈ కాపురము లేలే.

3. మాలిమిని త్యాగరాజు నేలిన రామమూర్తిని
లాలించి పొగడని నాలికేలే
నాలికేలే సూత్రమాలికేలే.

కావ్యము ప్రధానముగా ఆంధ్రభాషలో రచింపబడినను ఇందు సంస్కృత భాషలోనున్న శ్లోకములు కూడ కలవు. ఈ శ్లోకములలో కొన్ని వారివియు కొన్ని ఇతర ప్రసిద్ధ సంస్కృత కావ్యములనుండి గ్రహింపబడినట్లుగా తోచుచున్నది. వీరి సంస్కృత రచనలో తెలుగులో కంటె ప్రౌఢి కనుపించు చున్నది.

"జయజయా! సకల నిగమాగమ కుశల కిన్నర
కిం పురుష సిద్ధ విద్యాధర గీయమాన
బహు జగదుదయ రక్షణ లయ హేతుభూత
చతురానన హరిహర ప్రభృతి చింత్య
మాన మణి ద్వీపే! జితసాధుహృత్తాపే
సకల సురముని నికర నిజభక్త జన నిచయ
హృదయకామిత సంతాన సౌభాగ్య ధన
కనక వాహనాద్య షైశ్వర్యదాయక చింతా
మణిమయ మహావైకుంఠ నగరే నేత్రా
నందకరే చండమార్తాండ మండల విల
సత్సప్త హేమ ప్రాకారాంతర శోభాయ
మాన భాస్కర కోటి సమాన వజ్రస్తంభా
యుత సహిత సువర్ణ మంట పాంతరే
శుభతరే! . . . . . . . . . . . . . . . . ."

అనుచూర్ణిక వీరి సంస్కృత భాషా పాండిత్యమును ప్రదర్శించుచున్నవి.

ప్రహ్లాదభక్తివిజయ మందలి పద్యరచన అంత ప్రౌఢముగా లేదనక తప్పదు. యతిభంగములు, గణ భంగములు కూడ కానవచ్చుచున్నవి. అందుకు కారణము పాఠము సరియైనది లభింపక పోవుట కావచ్చును. లేక వీరి కవిత్వము పరిపూర్ణ పరిణతి పొందని కాలములో వ్రాసిరా అను సందేహము కూడ కలుగుచున్నది.

ఏమైనను ఇందలి కృతులలో మాత్రము త్యాగరాజ స్వామివారి పరిపూర్ణ పరిణతి కానవచ్చుచున్నది.

సంగీతాభినయ ప్రధానమైన వీరి ప్రహ్లాద భక్తి విజయము సంపూర్ణముగా ప్రదర్శింపవలెను. అప్పుడు కాని వీని సమగ్ర స్వరూపము బోధపడదు. వారి నాటకము పూర్తి చేసిన మంగళముతోడనే ఇదియు ముగింతును.

"మంగళం జానకీశాయ మహారాజ సుతాయచ
మాయా మానుష వేషాయ మహాదేవాయ మంగళమ్"



# నన్నెచోడకవి శైవసంప్రదాయము-

శ్రీ నిడుదవోలు వెంకటరావు

తెలుగు సాహిత్యమున—మల్లికార్జున పండితారాధ్యులు, నన్నెచోడకవి, పాల్కురికి సోమనాథుడు శివకవు లనియు, వారు ప్రవర్తిల్లిన కాలము శివకవి యుగమనియు, వాఙ్మయ చరిత్రకారులకు పరిచితమైన విషయమే. అయితే—వీరిలో - వీరశైవ మతవ్యాపన మొనర్చిన పాల్కురికి సోమనాథునిగూర్చి భేదాభిప్రాయమేలేదు ఆతడు ప్రతిపాదించినది వీరశైవమే అని యందఱు అంగీకరించిరి. కాని—ఆ శివకవులలో నొకడైన నన్నెచోడుని శైవమును గూర్చి విమర్శకులు వివిధరీతులు వివరించిరి. వానిని పరిశీలించి, నన్నెచోడుని శైవ సంప్రదాయమేదో నిర్ధారించుట యావశ్యకమగుచున్నది.

(1) కుమారసంభవ ప్రథమ ముద్రణ కర్తలగు శ్రీ మానవల్లి రామకృష్ణకవిగారు కుమారసంభవ కృతిపతి కాలాముఖసంప్రదాయము వాడగుట చేత, నన్నెచోడడు కాలాముఖశైవసంప్రదాయము వాడనిరి.

(2) కుమారసంభవ విమర్శనమున-(1937) నన్నెచోడని మత సంప్రదాయమునుగూర్చిలేదు.

(3) కవిరాజ శిఖామణి (1959) యందు— 'మతము' అను శీర్షిక క్రింద (177 - 187 పుటలు) కాలాముఖశైవ సంప్రదాయమే అనువదింపబడినది.

(4) నన్నెచోడుని కవిత్వము(1) (1954)- నన్నెచోడకవి వీరశైవుడు కాడని కొన్నియుపపత్తులు చూపబడి ఆతడు (2) దక్షిణాత్యాగమిక శైవ సంప్రదాయమునకు జెందియుండునని (3) ఆతని శైవము శాంతిపూర్వకమేకాని వీరరసోపేతము కాదని—నిరూపింపబడినది. (పుటలు 29–42.)

శైవమున దాక్షిణాత్యాగమిక సంప్రదాయమని ఒక ప్రత్యేక సంప్రదాయమేలేదు. కావున నిది యపాస్తము—ఇక వీరశైవము అహింసా సిద్ధాంతము ననుసరించినదగుటచే నిది యంతకంటె యపాస్తము.

(5) నన్నెచోడుని-కవిత్వము (1) (1959) 'ఈతనిది వీరశైవముగాదు' 'ద్రావిడ శైవమునకు కాశ్మీర శైవమునకు సన్నిహితసంబంధము గలదు. ఈతడు 'గౌరి కాశ్మీరుడగు నీశు గనుడు' అని మాయావటువు శివుడుగా ప్రత్యక్షమైన సందర్భమున ధ్వనిచే వ్రాయుట ఇందులకు బలము నిచ్చుచున్నది.' పుట 226.

'గౌరి కాశ్మీరుడగు నీశు గనుడు' అనునది—మాయావటువు రూపముననున్న శివుడు, హఠాత్తుగా స్వస్వరూపముతో పార్వతిముందు ప్రత్యక్షమైనపుడు (7–64) గలదు. ముద్రితములోనున్న పాఠమును బట్టి వ్రాయబడినది. వ్రాతప్రతిలో కాశ్మీరుడను పాఠములేదు. అచట నున్నది 'ఆత్మేశు'డనునది—గౌరి కీశ్వరుడు ప్రత్యక్షము కాగావే-ఆమె తన యాత్మేశుడైన శివుడు దర్శన మిచ్చెనని తొల్లింటి కంటెను లావణ్యాతిశయత వహించినది—ఇచ్చట కాశ్మీరుడను మాటయే యుండరాదని యీ క్రింది యెత్తుగీతి తెలుపుచున్నది.

---

గ్రంథ వివరణ కర్తలు.

(1) ప్రథమ ముద్రణ-మొదటి భాగము పీఠిక-1908-ముద్రణ 1909 (7 ఆశ్వాసములు) రెండవ భాగము- 1914 - 1914 (5 ,, )

(2) కీ. శే శ్రీపాద లక్ష్మీపతిశాస్త్రి— మద్రాసు విశ్వవిద్యాలయ ప్రచురణ.

(3) డాక్టరు తిమ్మావఝల కోదండ రామయ్య.

(4) అమరేశం రాజేశ్వరశర్మ.

(5) వేదము వెంకటరాయశాస్త్రి.

'విరహతాపతపస్తాప విశిఖ చయము
తలికి కందిన మేదీగ తత్క్షణంబ
గౌరి కాత్మేశుడగు నీశు గనుదు బ్రీతి
వెలమి దొల్లింటి కంటెను జెలువమెసగె.'

విరహతాపముచే గుందుచున్న గౌరికి కాశ్మీరు నితో కావలిసినది యేమి?

మన్మథ దహన కాలమునుండి శివపార్వతీ కల్యాణమువఱకు విరహబాధ నోర్చియున్న రతీదేవికి— శివుడు మన్మథుని పునరుజ్జీవింప జేసినపుడు— నన్నచోడడు—'ఆత్మేశు'డను పదమునే యుపయోగించి యున్నాడు.

దలుకొత్తం దరహాస మాననమునం
దట్టార్చిపో మేన ము
త్పులకల్ గ్రక్కునబర్వె, లోల నయనాం
భోజాత పత్రంబులన్
వెలరెన్ భోరన సమ్మదాశ్రుజల, ము
ద్వేగంబు రాగంబుగా
నెలమిం జిత్తము తత్క్షణంబ రతి 'కా
త్మేశా'వ తారంబునన్ (9—48)

పై పార్వతి వర్ణనకు—నదే సందర్భమున— ఆత్మేశు నవతారమున రతివర్ణన—నన్నచోడునిదే కనుక నీ వ్రాత 'సుద్దరాత'—దీనికి మించినది మఱియొకటి.

'ఇతడు శాక్తేయుడుగా కూడ నున్నాడు.'

'శక్తికీ కథలో శివునితో సమాన గౌరవము. నిచ్చి ఎవరికిని ఆధిక్యములేకుండ జేసినాడు.' [6]గ్రంథ కర్తమాట యటుండనిచ్చి, ఈ గ్రంథ బహుమతి నిర్ణేతలును, నన్నెచోడుని కవితామూల తత్త్వమును నవగాహన చేసికోలేదన్నమాట వాస్తవ మగుచున్నది—

దీనికిపైది 'కుమారసంభవ తత్త్వము'. శ్రీ వేదాల తిరువేంగళా చార్యులుగారిది—ఇట్టివానిని విమర్శింపబూనుట నిష్ప్రయోజనము.

ఇక ప్రథమముగా ప్రతిపాదితమైనది కాలా ముఖము—

రామకృష్ణకవిగారు కాలాముఖ మతమును గూర్చి యిట్లు వ్రాసిరి.[7] 'పాశుపతము కాపాలికము రౌద్రములని శైవాగమములోనే చెప్పబడియె'. 'పత్యు రసామంజ స్యాత్' అను సూత్రముక్రింద శ్రీ రామానుజాచార్యులు

'తన్మతానుసారిణ (పశుపతి మతస్య) శ్చతు ర్విధాః కాపాలాః కాలాముఖాః పాశుపతాః శైవాశ్చ' ఇతి—సర్వేచేతే...వేదవిరుద్ధాం తత్త్వప్రక్రియాం... కల్పయంతి...తథా కాలాముఖా అపి కపాలపాత్రభోజన శవభస్మస్నాన తత్ప్రాశన లగుడధారణ సురాకుంభ స్థాపన తదాధారదేవపూజాదిక మైహికాముష్మిక సకలఫలసాధన మభిదధతి' అని కాలాముఖులం గాపాలి కులలో భేదముగా జెప్పెను. (పుట 5.)

దీనినిబట్టి కాపాలిక భేదమైన కాలాముఖమున కీ క్రిందివి లక్షణములని స్పష్టము.

(1) వేదవిరుద్ధము.
(2) కపాలపాత్ర భోజనము.
(3) శవభస్మ స్నానము.
(4) శవమాంస భక్షణము.
(5) లగుడధారణము.
(6) సురాకుంభస్థాపన.
(7) తదాధార దేవపూజాదికము.

కాని కుమారసంభవమునం దెచ్చటను వేద విరుద్ధమైన సంప్రదాయము కానబడుటలేదు. ఆ పైని కృతియందెచ్చట చూచినను వేదవిశిష్ట తయే ప్రత్యక్షమగుటచేతను—తక్కిన కపాలపాత్ర, శవభస్మస్నాన, శవమాంసభక్షణా లక్షణములు మచ్చున

---

6. ముద్రిత గ్రంథములలో 'కాశ్మీరుడని' యుండుటవలన నెంతవఱకు బోయినదో చూడుడు— 'కాశ్మీరుడు' అనుమాట కనబడగానే విమర్శ కులు — అది కాశ్మీర శైవముతో సంబంధిన పదమని—కాశ్మీరశైవము ఆగమశైవమని — అది ద్రావిడశైవముతో సంబంధించినదని ఏ మే మో వ్రాసినారు. అసలు పాఠమే అదికాదు. ఇక కాశ్మీరు శైవమునకు తెలుగుదేశపు శైవమునకు నెంత మాత్రము సంబంధములేదు. ఇట్టి వ్రాతలన్నియు పరిహరింప దగినవి.

7. కుమారసంభవము—ద్వితీయ భాగ ముద్రణ పీఠిక—(30 ఆగస్టు 1914) పుటలు—5, 6, 7.

కైనను కానరాకుండుటచేతను—కవిగారే వెంటనే యిట్లు వ్రాసిరి. 'కాని కాలాముఖులు వేదబాహ్యులు కారు.................కాలాముఖులకు మహావ్రతులను నామము నాసిక బళ్ళిగ్రామాలంపూరు శాసనములలో గలదు. మహావ్రతమని యాజ్ఞికులలో పౌండరీకము నకు నామాంతరమైనను కాలాముఖబ్రహ్మచర్య కాపాలిక వ్రతమునకు సంకేతనామము.' (పుట 5.)

కాలాముఖము వేదవిరుద్ధమని రామానుజ మత సిద్ధాంతమైనను, కవిగారు బళ్ళిగ్రామ శాసనము నందలి—యీ క్రింది కాలాముఖాచార్య వర్ణనల ననుస రించి, వారు వేదబాహ్యులు కారని పైరీతిని వ్రాసిరి.

## బళ్ళిగ్రామ శాసనము

ఈ శాసనమున కాలాముఖాచార్యవర్ణనలో గల విశేషణములును కుమారసంభవ కృతిపతికి గ్రంథ మధ్యమున నన్నిచోడు డుపయోగించిన విశేషణములన్ను నొకటిగా నుండుటబట్టియే, కవిగారు కృతిపతి మల్లికార్జునశివయోగి కాలాముఖ సంప్రదాయము వాడని చెప్పుట తటస్థించినది—విశదముగా తెలియు టకై వివరించుచున్నాను.

ఈ బళ్ళిగ్రామ శాసనకాలము తెలుపబడలేదు. కాని కవిగారే యిట్లు వ్రాసియున్నారు. 'కాలాముఖ మఠాచార్యు లెల్లరు బ్రహ్మచారులు. ఈ మఠము ప్రారంభమున నెచ్చట నుండెనోకాని క్రీ. శ. 1050 లో వనవాసిదేశమున బళ్ళిగ్రామమను పురమున నెలకొన్నది.' (పుట 3.)

కుమారసంభవ కృతిపతికి కాలాముఖ మఠాచార. విశేషణములున్నను సుదాహృతమైన బళ్ళిగ్రామశాసనము క్రీ. శ. 1050 తరువాతది యని పై వాక్యము వలననే తెలియుచున్నది. మఱియు నీ విశేషణములు ప్రత్యేకముగా, కాలాముఖమఠాచార్యులకేయని చెప్ప వలనుపడదు; శాసనపరిశోధకులకు నిట్టివి—1, 3—యోగులైన విద్వాంసులకును; 2 వది—చక్రవర్తులకు, రాజులకును ప్రయుక్తములైనవన్నమాట పరిచిత మైనదే—కాబట్టి యింతమాత్రముచేత కుమారసంభవ కృతిపతి కాలాముఖమఠాచార్యుడనుట సరికాదు.

ఇట్లు మొదటి యైదు కాలాముఖలక్షణము లిందు లేవు. ఇక 6, 7 లక్షణములు విచారింతము.

| బళ్ళిగ్రామ శాసనము | కుమార సంభవము |
|---|---|
| 1. 'పరకాలాముఖ చక్రవర్తి ముని మహానుభావర.' 'యమనియమస్వాధ్యాయధ్యానధారణ మౌనానుష్ఠానజపసమాధిశీల సంప న్నరుం.' | 1. పార్వతి తపస్సు. 'అనేకోగ్రతపంబుల ప్రాణాయామ ప్రత్యాహార ధ్యానధారణ జపసమాధులను షడంగ యోగం బుల, మనోవాక్కాయ కర్మంబుల నతి నిష్ఠానుష్ఠానంబుల తపోవృత్తిం బ్రవ ర్తించుచుండె.' (6—90) |
| 2. 'కవిగమకి వాదివాగ్మి ప్రముఖ వివిధ విద్వ జ్జనానందకారణ జంగమ కల్పభూజరుం.' | 2. సత్కవిగమకి ప్రశంసితుడు (2—108) కవిగమకి వాగ్మిగాయకనట చింతామణి 3-12 కవిగమకి బుధనిధానుడు (11-1) అర్థిజనకల్ప మహీజము (3—109) |
| 3. వేదాంత సిద్ధాంతాగమ షట్తర్క సకల వ్యాకరణ నిర్మల శాస్త్రాద్యనేక శాస్త్రార్థ నిర్ణయ నిరుక్తరు.' | 3. న్యాయవైశేషికాది షట్తర్క కర్కశుం డగుటం బరవాదిభయంకరుడై......... వేదషడంగశాస్త్రపురాణేతిహాసాగమాది సకల కళాస్వరూపాపారవాణీధరుండై (1—58) |

వీనికిముందు మఱియొకటి.

మ హా వ్ర త ము

'మహావ్రతము కాలాముఖ బ్రహ్మచర్య వ్రతమునకు సాంకేతిక నామము—కుమారసంభవము నీశు విషయమై

మ హారికంకాళము చేతిముద్ర
దివిజేంద్రాస్థుల్ సుభూషావళుల్
గరళం బభ్యవహార మంతకతను
క్షారంబు మైపూత పం
కరుహాసీన శిరఃకపాల
మురుభిక్షాపాత్రగా విశ్వసం
హరువర్తించు మహావ్రతోపహతి
సేయంబూన నీ ప్రాప్తియే (3-77.)

ఇది రతి మన్మథునితో ప్రసంగించినవాక్యము. మారమదప్రహరుడగు శివావతార మల్లికార్జునకు జెల్లుట యాశ్చర్యముకాదు.' (పుట 5.)

నన్నెచోడకవి శ్రీశైలమల్లికార్జునకు, కృతిపతి మల్లికార్జునునకు అభేదము వర్ణించినను, నీ పట్టున నభేద వ్యవసాయము లేనేలేదు. ఇది మన్మథు డీశ్వరునిపై దండు వెడలుపప్పుడు, రతీదేవి, మహేశ్వరుని మాహాత్మ్యము నభివర్ణించి, ఆతనిని మరలించుటకు చెప్పినది. కాని, ఒక ప్రత్యేక సంప్రదాయము ననుసరించిన దెంతమాత్రమును కాదు. ఈ పద్యమేకాదు - రతీమన్మథ సంభాషణమున నున్న ఆఱు పద్యములు (71-77) ఈశ్వరుని యతి లోకోత్తర మహత్త్వమును ప్రకటించునవియే— అందిది యుత్కర్షను దెలుపును. కాబట్టి కృతిపతి మల్లికార్జునున కివి చెందవు.

ఇచ్చట మహావ్రతమనగా, ఒక నియత వ్రతముకాదు—శివుని లీలలలో కొన్ని మన్మథుని భయపెట్టుటకై వర్ణితములైనవి--

హారికంకాళము చేతిముద్ర

'ఘనతరం బగునట్టి కంకాళవేష
మనువుదాల్చుడు పదియా అవలీల'—

విష్ణువు త్రివిక్రమావతారమున కాలెత్తి నిల్చి తన గొప్పదనము తెలిసితినని విఱవీగగా, శివుడు కోపించి, ఆ త్రివిక్రముని భంజించి, తలతో కోలెమ్మ విఱిచి ఆ కంకాళమును, ఖట్వాంగమువలె—చేతి యందు ధరించెను. ఇందువలననే — మహానాటకమున 'త్రివిక్రమ మహా కంకాళ' అని చెప్పబడినది.[8]

దివిజేంద్రాస్థులు సుభూషావళులు

కల్పాంత ప్రళయకాలమున, వాణీంద్రామరేంద్రాది యస్థిమాలికలు, వారిని కృతార్థులను చేయుటకు, శివుడు దాల్చెను.[9]

గరళం బభ్యవహారము

ఇది ప్రసిద్ధమైన హాలాహల భక్షణకథ. శివుని పదమూడవలీల.

అంతక తను క్షారంబు మైపూత

యముని జయించి, ఆ శరీర భస్మమును ధరించుట శివుని ఇరువది తొమ్మిదవలీల[10]. 'క్షారము' అనగా విభూతి. 'భూతిర్భసిత భస్మనీ క్షారో రక్షావదావస్తు' అని అమరము

బ్రహ్మ కపాలము భిక్షాపాత్ర

బ్రహ్మ తానే కర్తనని యహంకరించినపుడు శివు డతనితల త్రుంచెను. అపుడు తన కపాలము క్రిందబడిన లోకమునకు హాని సంభవించును గావున—చేతిలో ధరింపుమని శివుని కోరెను. అత్తడిట్లు ధరించుటయేగాక, దానిని తన భిక్షాపాత్రగా చేసికొనెను దారుకావనమున నీ కపాలముతోనే భిక్ష నర్థించెను.[11]

ఇది శివుని యిరువది యైదవలీల.

సృష్టిస్థితి కారులగు బ్రహ్మ విష్ణువులను, స్వర్గాధిపతి దేవేంద్రుని-మృత్యువున కధిపతి యముని జయించిన శివునిపై నీవు దండెత్తిన వేమగుదువో చూచుకొనుము — అని రతి ఈశ్వరమహత్త్వము నిరూపించినది.

---

8. పండితారాధ్య చరిత్ర. 1-636 పుట.
9. 1-617 ,,
10. నిశ్శంక కొమ్మన శివలీలావిలాసము—తృతీయాశ్వాసము.
11 పండితారాధ్య చరిత్ర 1-621 పుట.

ఇక యివి యన్నియు నాయా సమయములందు శివుని లీలలు—కాబట్టి యిచ్చట—ఒక ప్రత్యేక ప్రతమున కెంతమాత్రమును సంబంధించినవికావు. దీనినిబట్టి—కృతిపతి యగు మల్లికార్జునునకివి యన్వ యింపవు. ఆతడు కాలాముఖమతానుయాయి కాడని సిద్ధాంతము.

ఇంతకు – నన్నెచోడకవి కుమారసంభవమునం దెచ్చటను గురువగు మల్లికార్జునుని గూర్చి చెప్ప నప్పుడు—కాలాముఖసంప్రదాయానుసారి యని చెప్ప లేదు. కాలాముఖము అనుమాటయే— కుమారసంభవ మున కన్పట్టదు.

## సురాకుంభస్థాపన

ముందు నేను వివరించిన కాలాముఖ సంప్ర దాయ లక్షణములలో మొదటి యైదును వేద బాహ్యము లగుటచే నాఱవదియగు సురాకుంభస్థాపనను గూర్చి కవిగారిట్లు వ్రాసిరి.

'సురాకుంభస్థాపనాదులకుఁ గుమారసంభ వమున—' అందు కొందఱు మధుపానగోష్ఠికిం జొచ్చి మండలార్చనదీర్చి...సుగంధాసవంబులు చషకంబుల నించి హర్షించి.

మ. శివు గౌరీసహితంబు నన్మనములం
జింతించి, మైతెంచి, భై
రవయోగీంద్రుల గొల్చి యోగినుల వీ
రవ్రాతమున్ దప్పి యా
నవనాథాదు లనాది సిద్ధులకు నా
నందించి వందిచ్చి యా
సవపాత్రల్ సతులర్థి నెత్తికొని యా
స్వాదించి మోదించుచున్ (9-128.)

'మొదలుగ వర్ణింపబడియె.'

సురాకుంభస్థాపనయనగా మద్యపానపాత్ర ప్రతిష్ఠించుట. కుమార సంభవమున నీ ఘట్టము పార్వతీపరమేశ్వర వివాహానంతరమున పార్వతి చెలి కత్తెలు వనకేళి చాలించి మధుపానముచేయు సందర్భ మున నున్నది. అష్టాదశ వర్ణనలలో మధుపాన మొకటి. నన్నెచోడుని కీ వర్ణనము చేయుట కను కూలమైన సందర్భమిదియే– కాబట్టి మొదట యీ వర్ణన సాహిత్యదృష్టితో చేయబడినదేగాని, ఒక ప్రత్యేక మత సంప్రదాయము ననుసరించి చేసినది కాదు. అష్టాదశవర్ణన లాంధ్ర సాహిత్యమున తొలుత ప్రవేశపెట్టిన కవి నన్నెచోడుడియే కదా.

నన్నెచోడుడు ప్రతి వర్ణనమునం దేదియో ఒక —ప్రత్యేకతను ప్రదర్శించుచునే యుండును. ప్రస్తుత వర్ణనలో కాలాముఖసంప్రదాయమే స్పష్టముగా నున్నట్లు నిదర్శనములేదు. పై పద్యమున నున్నది

## నవనాథసిద్ధ సంప్రదాయము

ఈ సంప్రదాయము గౌరన నవనాథచరిత్ర ద్విపద మూలమున తెలుగువారికి పరిచితమైనదే — దీనికి సంబంధించిన పద్యకృతి శ్రీగిరికవిది (క్రీ. శ. 1315) లభ్యము కాలేదు. ఇందువలన, నవనాథసిద్ధులగూర్చి తొలుత తెలుగులో తెలిపిన కవి నన్నెచోడడే– ఈ నవనాథసిద్ధులలో తొలివాడగు మత్స్యేంద్రనాథుడు లేక మీననాథుడు శివునివలన జన్మించినవాడు గాన నీ సంప్రదాయము శైవమునకు సంబంధించినదిగా పరిగణితమైనది. ఈ సిద్ధులు, రసవాదమునందును, కాయసిద్ధియందు ప్రవీణులు కావున నీనవనాథసిద్ధసంప్రదాయమును 'సిద్ధ సంప్ర దాయము' అనుట కల్లదు. నన్నెచోడుడు వీరిని పేర్కొనుటచేత నీరందఱును 11 వ శతాబ్దికి పూర్వులు. తెలుగుదేశముకన్న మహారాష్ట్ర దేశమున దీనికి ప్రచారమెక్కువ. ఆ దేశమున దీనిని 'నాథ పథీయ సంప్రదాయము' అని వ్యవహరింతురు.

## కౌళ సంప్రదాయము

ఈ మధుపాన సందర్భముననే—నన్నెచోడకవి— 'చక్రయాగమునెడ వస్తువందు రిది కౌళికు లీ సుర పేర్మి వింతయే' (9—129) అని కౌలాచారమును పేర్కొన్నాడు ఇది కూలార్ణవతంత్రమాధారముగా గలది. చక్రయాగమనగా—మధుపానగోష్ఠియందలి 'మండలార్చన'. (చూ 9-128.). మఱియు 9—131 వచనమున 'అనేక మాంసోపదంశంబు లాస్వాదించుచు'. లని కలదు. ఇదియు పై సంప్ర దాయమునకే సంబంధించినది శాక్తేయమగు నీ సంప్రదాయమునకు 'పంచ మకార సంప్రదాయ'మని

నామాంతరము. కుమార సంభవమున 'భైరవ యోగీంద్రు' లీ సంప్రదాయమువారు. ఇక నిందు— 'యోగినులు' భైరవి యోగినులు [12]

నన్నెచోడకవి పై సంప్రదాయముల పరిజ్ఞానమును మధుపాన గోష్ఠివర్ణనయందు వ్యక్తపఱచినాడని మనము గ్రహింపవలెను [13]

## బ్రహ్మచర్యము

పూర్వపీఠిక-3 వ పుటలో 'కాలాముఖ మతాచార్యులెల్లరు బ్రహ్మచారులు' అని కలదు. నన్నెచోడుడు తన గురువును బ్రహ్మచారిగా వర్ణించినాడు. కావున కాలాముఖుడు. దీని ననుసరించి బసవపురాణ ప్రథమ ముద్రణ పీఠిక- (పుట 73) యందు 'కాలాముఖులు శక్త్యర్చనము గూడ గావింతురు. వారు నిత్యబ్రహ్మచారులు—గార్హస్థ్యమువారికి దగదు'14 అని యున్నది. ఈ రెండింటినిబట్టి నన్నెచోడని గురువగు మల్లికార్జునుడు— 'అజన్మబ్రహ్మచారి' అన్న అభిప్రాయమునుకూడ విమర్శకులు వ్యక్తపఱచియున్నారు.

నన్నెచోడకవి కృతిపతిని బ్రహ్మచర్యాశ్రమ వ్రతసంపన్నునిగా నిరూపించెనేకాని, నిత్యబ్రహ్మచారి యనికాని, అజన్మబ్రహ్మచారియనిగాని వర్ణింపలేదు—అతని వర్ణన యిట్టిది.

నన్నెచోడుడు కృతిపతిని మన్మథ సంహారుడగు మల్లికార్జునదేవునికి అభేదవ్యవసాయము చేయుటచేత, మారమదప్రహారుడు, జితమారుడు, మొదలగు విశేషణములను వదలి, బ్రహ్మచర్యత్వమును ప్రదర్శించువానినే యుదాహరించుచున్నాను.

1. అంగోద్భవబాణాఘోరతాపహతుడు (4–121)
2. అస్పృష్టరాగుడు (2–100.)
3. అస్ఖలితుడు (10–202.)
4. ఇశరకమలినీపూర్ణేందుడు (2–110.) (ఇ—అనగా మన్మథుడు. ఇశరము లనగా మన్మథశరములు. మన్మథశరము లనెడి కమలములకు చంద్రునివంటివాడు.)
5. కాంతావిషయోపభోగసంత్యక్తుడు-- (6—169)
6. చేతోభవనిశితకుసుమబాణోద్భవ రాగ విముక్తుడు (1–131.)
7. జిత కామలతాంత శిలీముఖవ్రజా హతపరితాప చేతసుడు (6–170.)
8. మదన మదనాస్త్రనిభ శుభ మదనవతీ లోల దృష్టిమార్గణ నికరాభిదుర్గత హృదయాంభోజుడు (10–203.)
9. సంకల్ప సంభవ బాణేంధన దావపావకుడు (8–195)
10. హృజ్జన్మశాస్త్రానభిజ్ఞుడు (8–198.)

పై విశేషణము లన్నియు మల్లికార్జున గురువు అస్ఖలిత బ్రహ్మచారియని నిరూపించుచున్నవే గాని నిత్యబ్రహ్మచారియనిగాని, ఆజన్మబ్రహ్మచారి యనిగాని నిరూపింపవు మరియు నీ విశేషణములు— మల్లికార్జును డొకప్పుడైన సంసారసుఖమనుభవించి, యా వెనుక విరక్తుడైనయోగికాక, బ్రహ్మచర్యాశ్రమముననే యోగియైనట్లు తెలుపుచున్నవి. నన్నెచోడకవి యుపయోగించిన యీ క్రింది విశేషణము లాతడు యోగీశ్వరుడనియే తెలుపుచున్నవి.

బ్రహ్మర్షి (1–66); అనుపమసంయమి (1–66); మునిపుంగవుడు (1–130); మునీంద్ర శిఖామణి (3—110); దివ్యమునిశిఖామణి (4–122); నిర్వాణయోగి (1–134); సదాత్మయోగిజనప్ముండనుడు (3–111); మహాయోగి ముఖ్యుడు (10—206).

---

12. శ్రీరామకృష్ణుని జీవితచరిత్ర చూడుడు. పుట 133. భైరవ బ్రాహ్మణి ఆమె పేరు యోగీశ్వరి. తాంత్రిక సంప్రదాయమునకు చెందినదై సాధారణముగా శివు నుపాసించు సన్న్యాసినియే భైరవి. రామకృష్ణు డీమెను బ్రాహ్మణియని పేర్కొన్నాడు.

13. ఈ సందర్భమున సింహాసనద్వాత్రింశిక యందలి మధుపానగోష్ఠి వర్ణన పరిశీలింపదగినది.

14. బసవపురాణము—ప్రథమ ముద్రణము—పీఠిక—కీర్తిశేషులు ప్రభాకరశాస్త్రిగారు (1926) ఆంధ్ర గ్రంథమాల.

మల్లికార్జునయోగి సాక్షాత్తు శివావతారము— అతడు—ఫాల లలాటాక్షుడు (1—62); ఇహలోకవర నిటలతటనయనుడు (3—112); మనుజాకార మహేశుడు—ఇట్టి వింకను కావ్యమున గలవు

మల్లికార్జునయోగి, కేవలము యోగియేగాక బ్రహ్మవిష్ణుమహేశ్వరమహాపురుషత్రయ లక్షణములు గలిగియున్నట్లు నన్నెచోడకవి వర్ణించియున్నాడు.

బ్రహ్మ:—శ్రీభాషాశ్రిత సన్నుత భాభాసిత

విమలవదన పంకరుహుడు (5—1)

శ్రీవాణీవరుడు (6—1)

భారతీరమణుడు (6—171)

వాణీరుచిరాననతిలకుడు (6—177)

వాణీ శ్రీశ్రిత సుముఖుడు (7—1)

విష్ణువు:—శ్రీ మహిళా మహనీయోద్దామోరస్థలుడు (8—1)

శ్రీరామా సంచిత విపులోరస్థలుడు (9—1)

శ్రీ రమణీరమణీయతరోరస్థలుడు (10—1)

శ్రీ రామా కేళీనీరేరుహ పరిగళిత

లలితరేణుప్రకరాసారాపూరిత

భూరితరోరస్థలుడు (12 -1)

నీరజపత్రనిభనేత్రుడు (8—199)

తరుణతర తరణి కిరణోత్కర

సంస్పర్శ ప్రభానికర వికసిత

హరిరుహదళ కలిత శోభాహర దవతాక్షుడు— (10—205)

(అంభోజాక్షుడు—అనంతుడు—అను విశేషణములు గలవు.)

మహేశ్వరుడు:—శ్రీకంఠమూర్తి — (1—59)

అష్టతను పరమకనుడు (2 -107)

వృషవర్త్మనుడు (5—174)

ఈ గ్రంథమున శివునకు—కృతిపతికి అభేదముగాన—మాహేశ్వరసంబంధమైన విశేషణములు చాలా గలవు.

పై విశేషణములను[15]బట్టి మల్లికార్జున యోగి—ఆజన్మబ్రహ్మచారికాదనియు సభార్యుల గు బ్రహ్మ—విష్ణువుతో బోల్పబడుటచే నాతడు గృహస్థుడగుటకు నవకాశమున్నదని మనము గ్రహింపవలెను. కృతిపతి నిత్యబ్రహ్మచారి యనుచో నీశ్వరునితో నభేదమే పొసగదు—ఈశ్వరు డర్ధనారీశ్వరుడుగదా!

## నన్నెచోడకవి—ఆరాధ్యశైవము

నన్నెచోడకవి కృతిపతి మల్లికార్జునుడు—కాలాముఖసంప్రదాయానుసారి కాడని యింతవఱకు నిరూపించితిని. అట్లయిన శైవమున నత డే సంప్రదాయమునకు సంబంధించినవాడో నిర్ణయింప దగియున్నది. ఈ నిర్ణయమున కా కాలమున వ్యాప్తిలో నున్న శైవ సంప్రదాయముల నెఱుగ లెను. అవి రెండు విధములు.

1. బసవ సంప్రదాయము—ఇది కన్నడదేశమున బసవనచే ప్రవర్తిల్లజేయబడినది. ఈ సంప్రదాయమున లింగధారణ యున్నదిగాని వర్ణాశ్రమ సంబంధము అనగా జాతివిచక్షణలేదు. శివభక్తి ప్రధానము—దీనినే జంగమసంప్రదాయము అని యందురు. లింగాయత మత మని కన్నడదేశమున వ్యవహారములో నున్నది. తెలుగుదేశమున జంగములు-బసవ సంప్రదాయమువారు.

2. ఆరాధ్య సంప్రదాయములేక పండిత సంప్రదాయము—ఇది వర్ణాశ్రమధర్మసంబంధము. శివలింగ ధారణ — పరమేశ్వరోపాసన — ప్రధాన లక్షణములుగా గలది. శ్రీపతి పండిత, శివలెంక మంచన పండితుల చేత ప్రతిపాదితమై మల్లికార్జునపండితునిచే ప్రచారములోనికివచ్చి నేటికిని వ్యాప్తిలో నున్నది. ఇది బసవనకు చాలా పూర్వమునుండియు ప్రచారములో నున్నది.

---

15. కుమారసంభవమున కృతిపతి విశేషణములు—పన్నెండాశ్వాసములలో 82 పద్యము లున్నవి. వీనిలో పునరుక్తములైన 10 విశేషణములుపోగా, 630 విశేషణము లున్నవి. నేను ఆశ్వాసాద్యంత, షష్ఠ్యంతపద్య విశేషణము లన్నింటిని పరిగ్రహించి నాడను— వీని యందుండి ఎన్నోవిషయములు క్రొత్తవి మనకు తెలియగలవు. అయినను వ్యాసవిస్తరభీతిచేత కొన్నిమాత్రమే చూపితిని.

శైవమున నీ రెండింటికి వీరశైవమనియే వ్యవహారమున్నను పండితసంప్రదాయమువారైనవారిని 'ఆరాధ్యులని' 'మాహేశ్వరులని' ప్రత్యేకముగా పేర్కొందురు.

పై సంప్రదాయముల ప్రవర్తకు లిర్వురు—అనగా బసవన, పండితారాధ్యులు, సమకాలికులు—పండితుడు, బసవనిభక్తిమాహాత్మ్యమును ప్రశంసించుచు తాను బ్రాహ్మణ ధర్మము విడువలేనని—ఆతనికి

'భక్తివిహీన వంపు బ్రహ్మంబులో పొత్తు
బాయలేను నేను బసవలింగ'

అని తన శివభక్తి పథమును స్పష్టము చేసినాడు. ఇది సాహిత్యవిమర్శకు లందఱికి పరిచితమే.

బసవన భక్తి సంప్రదాయమున—16 శివభక్తులైనవారేజాతివారైనను జంగమములుగానే భావింప బడుదురు. వర్ణవ్యవస్థను బసవన పరిహరించుటచేత—అష్టాదశవర్ణములవారికిని ప్రవేశము గలిగినది. సాంఘికముగా నొక విధముగా ఐక్యత సమకూడినది. ఇందువలన — బసవసంప్రదాయము ననుసరించి, శివభక్తిగల బ్రాహ్మణులు — జంగమములేయైరి. ముందు నేను వివరించిన రీతిని బసవన సమకాలికముగా, ఆరాధ్యులున్నారు. కాని వారిని జంగమములుగానే వ్యవహరించెడివారు.17 జంగమమనగా చరించుచున్న శివలింగ స్వరూపుడని యర్థము. కాబట్టి యిట్టివారిని జంగమలింగములని వ్యవహరింతురు.

ఈ సందర్భమున నన్నెచోడకవి కుమార సంభవ కృతిపతియగు మల్లికార్జునశివయోగి కుపయోగించిన, విశేషణములు పరిశీలించిన నాతడు, బ్రాహ్మణకులజుడైన జంగమలింగమని తెలియ గలదు

| | |
|---|---|
| కృతిపతి—కమలభవకులతిలకుడు | (1–131) |
| భూసురవంశాద్య | (5–176) (6–79) |
| భూసురకులాగ్రణి | (7–160) |
| మహీసురేంద్రుడు | (8–197) |
| పంకజరుహగోత్రుడు | (9–163) |
| బ్రహ్మకులాధీశుడు | (10–204) |
| బ్రహ్మకులోత్తముడు | (12–228) |
| భూదేవ కులశేఖరుడు | (12–229) |

అనుటవలన బ్రాహ్మణ కులజుడు. ఇక ఆతని జంగమ విశేషణములు.

జంగమ
మల్లికార్జునుడు (1–12)

జంగమలింగంబగు
మల్లికార్జునుడు (1–15)

జంగమ మల్లయ (1–46) (1–49) (1–61)

జంగమ
మల్లికార్జునుడు (1–48) (1–57) (1–58) (1–130) (1–132) (3–111) (8–197)

జంగమలింగము
మల్లికార్జునుడు (6–47)

ఇచ్చట—పార్వతి తపస్సుచేయుట కడవి కేగినపుడు — అచ్చట — 'మనుష్యరూపధూర్జటి మునిముఖ్యలోకగురుడు' అయిన జంగమ మల్లికార్జునుని చూచెను.

ఈ ఘట్టముననే పార్వతి—ఆ జంగమ మల్లికార్జుననే గురుస్థానముగా స్వీకరించినది (6–81). కావ్యాంతమున —

---

16. 'బసవ సంప్రదాయము'వారులగు వీరశైవులకు 'లింగాయతు'లనుపేరు పాల్కురికి సోమనాథుని బసవపురాణాది గ్రంథములందుగాని—ఆంధ్ర వీరశైవవాఙ్మయమునందు మఱియే యితర కృతులందుగాని కానిపించదు. కాని ఆంగ్లేయభాషలోగల గ్రంథములలో శైవమునుగూర్చి చెప్పినప్పుడు—'లింగాయత మత'మని వ్రాయబడియుండుటచేతను — అది యీనాటివారికి పరిచితమగుటచేతను సూచించితిని. ఈ వీరశైవ వాఙ్మయమునుగూర్చి ప్రథమముగా పరిశోధించిన మహావిద్వాంసులు బ్రౌనుదొరగారు దీనిని 'జంగమ సంప్రదాయ'మనియే వ్యవహరించిరి.

17. బెలిదేవ వేమనారాధ్యులాదిగా నఖిల జంగమము—పండితారాధ్య చరిత్ర. 1–162 పుట—నఖిలజంగములు —అన్న ముద్రితపాఠము సరికాదు.

వెలయు మత్కృతి పదుపుఁడు వినుఁడు వ్రాయుఁ
డీశ్వరాంబికాగుహ కృతిత్ర్రిస్ఫితములు –
వారి నెమ్మెయుఁ గొనియాడువారి కోర్కు
లొనర జంగమమల్లికార్జునుడు నాఁగు
(12–225)

అమితసుగుణమణిరచితా
ద్యమలవిభూషణవిభూషితావయవుఁడు 'జం
గమ మల్లికార్జునుడు' వా
గ్రమణీరమణుండు మునిశిఖామణి పేర్మిన్.
(12 227)

పైన వివరించిన రీతిని మల్లికార్జునయోగి, బ్రాహ్మణుడైన జంగమలింగమేకాక — ఆరాధ్యుఁడని మాహేశ్వరుడని యీ క్రింది విశేషణములచే తెలియుచున్నది.

| | |
|---|---|
| నిఖిలలోకారాధ్యుము | (2– 1) |
| సను మునీంద్రారాధ్యుడు | (2-107) |
| జగదారాధ్యుడు | (5–174) |
| మాహేశ్వరప్రకరమాన్యుడు | (4–123) |

మల్లికార్జునయోగి ఆరాధ్యుడేకాక గురుస్థానీయుడని నన్నెచోడడు తెలిపియున్నాడు. గురుఁడు (9–164) లోకగురుడు (9 - 167) సద్గురుడు (11 - 210) సమస్తజగద్గురుడు (11–214).

షష్ఠ్యంతములలో

క. సద్గురు డనజను నఖిల జ
గద్గురునకు సంతతోపకారికి ముని వి
ద్వద్గురునకు కవిబుధహిత
మద్గుగుణ కపారధర్మమతికిన్ వ్రతికిన్[18]
(1– 60)

అని విశేషించియున్నాడు.

పై వివరములనుబట్టి–జంగమశబ్దము శివభక్తులగు బ్రాహ్మణులకు చెల్లుచుండిన కాలమునందు కుమారసంభవ కావ్యము రచితమైనదని నిశ్చయింపవచ్చును. కుమారసంభవకృతిపతి జంగమమల్లికార్జునుడనియే వర్ణితుడైనాడు. మరియు నతడు, గృహస్థాశ్రమ స్వీకారముచేయని బ్రహ్మచర్యాశ్రమయోగి యనియు ఆరాధ్యసంప్రదాయ గురుత్వ విశిష్టుడనియు కూడ విశదమగుచున్నది.

మల్లికార్జున పండితుడు బసవని సమకాలికుడయ్యు, నాతని వర్ణాశ్రమ రహిత శివభక్తి పథకముతో నేకీభవింపలేదని ముందు చెప్పియుంటిని. అతడు – వేదాగమోపనిషత్ప్రమాణములతో, శైవభక్తిని సమన్వయముచేసి–శివపారమ్యమును స్థిరీకరణమొనర్చి – తన శివతత్త్వసారకృతిమూలమున నారాధ్య సంప్రదాయము ప్రవర్తిల్లజేసి లోకారాధ్యుఁడయ్యెను, ఆనాటినుండి బసవనిది వీరభక్తిసంప్రదాయము; సవైదికమైనది – 'ఆరాధ్య శబ్దము' ప్రత్యేకత వహించినది.

దీనివలన వీరశైవమున నంతకుముందు బ్రాహ్మణాదిసకలవర్ణములవారికి చెల్లుచుండెడి 'జంగమ' శబ్దము–విశాలార్థము కోల్పోయి సంకుచితమైనది. బసవసంప్రదాయమువారు జంగములైరి. పండిత సంప్రదాయమువా రారాధ్యులైరి. ఇట్లు వీరశైవమున జంగమ, ఆరాధ్య సంప్రదాయములని రెండుగానున్నను నేకైకముగ వీరశైవమతముగానే వ్యాప్తి చెందినదని స్థలాంతరమున నిరూపించితిని. కుమారసంభవమును కూలంకషముగా పరిశీలించినవారికి– అందు సవైదికమైన ఆరాధ్యశైవ సంప్రదాయములె తూచా తప్పక కానవచ్చుచున్నవి.

ఈ సంప్రదాయప్రవర్తకుడగు మల్లికార్జున పండితుని చరిత్రమే 'పండితారాధ్య చరిత్ర' యనుపేర ప్రౌఢతమద్విపదకావ్యముగా పాల్కురికి సోమనాథుడు రచించియున్నాడు అందు పండితుని పుత్రపౌత్ర శిష్యసంతతి వర్ణితమైనది.

---

18 ముద్రిత ప్రతిలో– 'అపారధర్మమతికిన్ రతికిన్' అని కలదు. కాని వ్రాతప్రతిలో అపారధర్మ మతికిన్......సంగాసంగవిదూరునకు అని మాత్రమే యున్నది. 'రతికిన్' అనునది కవిగారు పూరించినది. అయినను నిచట రతికిన్ అనుట సరికాదు. 'వ్రతికిన్' అని యుండవలెను. (వ్రతిచక్రవర్తి నిరస్తాఖిలార్తి – పంచ 2—97.)

ఈ పండితారాధ్య చరిత్రము శ్రీనాథుడు పద్యకావ్యముగా చేసినట్లు శృంగారనైషధమున చెప్పియుండుటచేత, శైవమతసాహిత్యముననే కాక సాహిత్యలోకముననుు పరిచితమై యున్నది. పండితారాధ్యుని పేరు మల్లికార్జునపండితు డగుటచేతను, కుమారసంభవము శైవమతమునకు సంబంధించిన దగుటచేతను ప్రథమ ముద్రణకర్తలగు కవిగారికి— వీరిద్దఱు నొకరైయై యుండకూడదా యను భావము కలిగినది. నామసామ్యమున్నను వారిరువురు నొకరుగారని తిరిగి యీ క్రింది యుపపత్తులు చూపిరి.[19]

(1) వీరశైవదీక్షా ప్రశంస యెందును కావ్యమున గానరాదు.

(2) పండితారాధ్య చరిత్రమున నతని సమస్త శిష్యకోటిలో నన్నెచోడుడు లేడు.

(3) పాల్కురికి సోముడు పండిత మల్లయ యనియే సవిశేషణముగా చెప్పుచుండును.

(4) నన్నెచోడ డెక్కడను మల్లికార్జునునకు పండిత శబ్దమును జేర్చినవాడు కాడు.

(5) పాల్కురికి సోముడు పండితారాధ్యుని గూర్చి పుత్రపౌత్రసంతతిగలవానినిగా వర్ణించెను. కాని పైవానివలననే వారిరువురు నొకరని వ్యక్తమగుచున్నది.

## వీరశైవదీక్షా ప్రశంస

కుమారసంభవమున వీరశైవదీక్షా ప్రశంస లేదనుట సరికాదు. శైవమతమున జంగమ, ఆరాధ్య సాంకేతికపదములు వీరశైవముతోడనే వ్యాప్తిలోనికి వచ్చినవి. కుమారసంభవకృతిపతికి 'జంగమ' శబ్దము ప్రయుక్తమైనట్లెవరకే నిరూపించితిని. 'జంగమ' శబ్దమేకాక, శివుడు లింగస్వరూపుడుగా వర్ణితుడై అర్చితుడగుటకూడ వీరశైవ సంప్రదాయమే.

సతీదేవి దక్షునితో శివుని మహత్త్వము నిట్లు నిరూపించినది

వాదున నీ హరివేధలు
కాదే 'యురు లింగమూర్తి' కడఁగానక నే
డాదిగ వెదకెద రట్టి మ
హాదేవు డపూజ్యుడనగ నగునే నీకున్ (2–30)

ఉరు 'లింగరూపమై' హరివేధలకుఁ దన
కడఁగాన రాకున్న పొడవువాని (2-38)

వీరశైవసాహిత్యమునందప్ప, తక్కిన శైవేతర సాహిత్యమునందు పనిగా భారతాది గ్రంథములయందు గాని, కావ్యములయందుగాని మఱి యే యితర రచనల యందుగాని శివస్వరూపము, స్తుతి, పర్యాయపదములచేతనే ప్రస్తావింపబడునుగాని 'లింగ' స్వరూపముగా వర్ణితము కాదు.

## షడక్షరి మంత్రము

'ఓం నమశ్శివాయ' అనునది షడక్షరి - 'నమశ్శివాయ' అనునది పంచాక్షరి. ఈ శైవ మహామంత్రము 'పార్వతి'కి అక్షరాభ్యాసముతో అలవడినది.

గిరిసుత తొలుపలుకుల ను
స్వర మొదలుగ ఓం నమశ్శివాయ' సదాస్మ
ద్వరదాయ నమశ్శంకర
శరణు మహాదేవ నీవ శరణన జొచ్చెన్
(3- 35.)

## కర్మమార్గ ఖండన

ముక్తిసాధనములలో నొకటియగు కర్మమార్గమును వీరశైవము ఖండించి భక్తిమార్గమే ప్రధానమని నిరూపించినది. కుమార సంభవమున నీ ఖండన కొఱకే దక్షయజ్ఞ కథ యనుసంధింపబడినది.

'సమస్త లోకాగములకు గర్త యుఁ గర్మ ఫల ప్రదాతయునగు నీశ్వరుని (2 79) తిరస్కరించి దక్షుడు యజ్ఞము చేసినందున నది భగ్నమైనది. 'కర్త భక్తిమై తనరని యజ్ఞము' గావున నది యభిచారమైనది (2 - 92). దానివలన 'మోక్ష మొందు కర్మమార్గంబున బడయు గడగుటెల్ల భ్రాంతి' (6 - 72) యని వెల్లడియైనది. కృతిపతి విశేషణములలో

'కర్మాంబురుహసుధాకరుడు' – (4–122) కర్మంబులనెడి పద్మములకు చంద్రునివంటివాడను

19 ప్రథమ ముద్రణ ద్వితీయభాగ పీఠిక. పుట 7

'ఆత్మనాత్మకదృష్టి సర్వాత్ము బరము
పరుశివునిగాంచుటదియ పరమపదవి'(12-220)

అదియే శివయోగ సిద్ధి.

### అష్టమూర్తిత్వము

కుమార సంభవమున శివుని యష్టమూర్తి వర్ణన ప్రత్యేక విశిష్టత గలది. (పృథివి, ఆపస్సు, తేజము, వాయువు, ఆకాశము, సూర్యుడు, చంద్రుడు, సోమయాజి అనునవి శివుని యష్టమూర్తులు. ఈ వర్ణన వాచ్యముగను, వ్యంగ్యముగను కుమారసంభవమున గలదు.

1. భవాష్టమూర్త్యులందుమ (1-6); అష్టతను పరమతను మయుడు (2-101); అష్టతనువులు నేకొని యుఅరువాని (2-38); అష్టతనువృత్తి (8-117)

2. వ్యంగ్యము-1. కవిస్తుతి (1-16-24) 8 పద్యములు.

2. కావ్యప్రశస్తి (1-36) 'మృదురీతి సూక్తులు........కావ్యరత్ననిధి'

ఇందు 1 సూక్తి 2. భావము 3 కాంతి 4. వర్ణన 5 రసము 6. దేశీయత 7. అలంకారము 8. అర్థము అను నెనిమిది గుణములు గలవు.

3. షష్ఠ్యంతములు (1-58-66) 8 కంద పద్యములు

4. వటురూప శివుడు పార్వతితో సంభాషించుట (7-24); శివుడష్టలింగ స్వరూపుడు.

ఆ. నిన్నిరూపులందు నే రూపు నిజముగా
నెఱుగవచ్చు వీని కెల్లనొక్క
రూపుసేయ నెవ్వరోపుదు రట్టి మా
యావి నీకు దగుల నగునె బేల?[23]

3 వాచ్యము మురపాసలాంతక (2-104); గిరతభూమి (12-223).

ఇది వీరశైవ సంప్రదాయికమే-శివుడష్టలింగ స్వరూపుడన్న విషయమిట్లు సోమనాథునిచే వర్ణితము.

'అనిరళ నిత్య' మహాదేవ శర్వ
భవ భీమ రుద్రోగ్ర పశుపతీశాన
కమనీయ తల్లింగ కలిత నామాష్ట
కముల దివ్యాష్ట లింగస్వరూపముల
వీక్షించు జనులకు మోక్షమిచ్చుచును
మోక్షేశ్వరంబన ముందట వెలసి
పండితారాధ్య చరిత్ర పర్వత ప్రకరణము
2-283.

### దక్షాధ్వరధ్వంసము

దక్షాధ్వరధ్వంస సందర్భమున నన్నెచోడడు ఆరాధ్య శైవసంప్రదాయమును సూచించియున్నాడు,

క. జానయై పశుపతి మఱక వి
తాన మహారంభుడైన దక్షుండును న

| | | |
|---|---|---|
| సీ 'పుడమి'యై కదలక పడియుండు నెల్లచో | (పృథివి) | (మహాదేవుడు) |
| నెతిలేక 'నీర'యి నెలసియుండు | (ఆపస్సు) | (శర్వుడు) |
| 'ననలుండై' డాసిన కొని కాలుచుండు 'వా | (అగ్ని) | (భవుడు) |
| తూలుడై' కనుకని దూలుచుండు | (వాయువు) | (భీముడు) |
| 'ఆకాశమై', సూరకుండు, 'ప్రాలేయ | (ఆకాశము) | (రుద్రుడు) |
| ధాముడై', పెరుగుచు దఱుగుచుండు | (చంద్రుడు) | (ఉగ్రుడు) |
| 'భానుడై' మిన్నులపై బాఱుచుండు'మ | (సూర్యుడు) | (పశుపతి) |
| హోతృకడ'య్యును పొడవడగియుండు | (సోమయాజి) | (ఈశానుడు) |

23. ఇట్లే భాగవత చతుర్థ స్కంధమున దక్షయజ్ఞ కథయందు శివుని- అనయంబు లుప్త క్రియా కలాపుడు'-ఇత్యాది దక్షుని యాక్షేప వాక్యములయర్థమును సమన్వయించుకొనవలెను. (భాగ. 4-43).

జ్ఞానికి మునుకొనువచ్చు వి 24
మానంబున సమరి సతి విమానము వచ్చెన్
(2-15)

శివుని లక్ష్యపెట్టక యజ్ఞము చేయువాడు జీవముతో నుండుటడకల్ల. ఇక నాతనికి విమానమే గతి - శైవులు మరణ మాసన్నమైనప్పుడు - ఆ వ్యక్తిని కూర్చుండబెట్టి లింగమును చేతిలోనుంచి మూసి యుంతురు - అట్లు కూర్చుండబెట్టి ఒక విమానమును కట్టి - రుద్రభూమికి తీసికొనివెళ్లుదురు ఇచట సతి విమానము !— దక్షుని వినాశనముకొఱకే వచ్చినదిగదా.

కుమ్మరిగుండయకథ

పార్వతి విరహమున నున్నప్పుడు నన్నెచోడ డిట్లు వర్ణించినాడు.

గీ. అలిగి మరునేర్చుహరుడు దానట్టి సాహ
సాత్ము నొడగూర్చి యా యంబుజాక్షి నింత
విరహవేదన బెట్టెడు విధిగడంగి
25 మునలి తా దండ గుండముంచునట్లు
(5-143)

ఇది తమిళ శైవభక్తుడగు తిరునీలకంఠ నయనారి కథకు సంబంధించినది — ఇచ్చట మన్మథ సంపర్కములేని వృద్ధదంపతులకు - యౌవనమిచ్చుట గలదు. నయనారుల కథలు శుద్ధముగా వీరశైవమునకు సంబంధించినవి.

సోమనాథుని బసవపురాణమున
'............ఎనుబదియేండ్లు నడువ
దండ గుండము ముంపఁ దక్షణమాత్ర
మింద్రపాయంబులై మీదికి నెగసి'—
4. ఆ. 129 పుట.

సోమనాథుడు నన్నెచోడ డుపయోగించిన 'దండగుండము' అను పదమే ప్రయోగించుట గమనించవలెను.

పులికూడు

వటురూపుడగు శివుడు పార్వతితో

సీ. పా. అశనంబు భిక్షాన్నమనుటయు కాదంచు
గూడబోసిన పులికూడు....    (7-38)

ఇదియు వీరశైవ సంప్రదాయమునకు జెందిన కథయే. వీరచోడన్న యను భక్తురాలు - ఈశ్వరునికి పులికూడు అనగా పులిసిన పులగము - శివున కర్పించిన కథ సూచితమైనది. ఇది బసవపురాణమున పంచమాశ్వాసమున కలదు. ఈ కథ పండితారాధ్యుని నివాసమగు దాక్షారామమున జరిగినది.

భస్మరుద్రాక్ష ధారణము

ఆరాధ్యశైవ సంప్రదాయమున భస్మరుద్రాక్షధారణ మొక ముఖ్యలక్షణము. పార్వతి తపస్సు చేయుటకు ముందు వనమునకువెళ్లి యచట

వాసనగా శివాగమము
వర్ణనకెక్కఁ బ్రదంయాసదర్థముల్
దేసిగ నాత్మ శిష్యులకుఁ
దెల్పుచు సద్విధినున్న నిష్కళా
ధ్యానమునందు లీనముగ
భావము నిల్పి వెలుంగుచున్న స
ద్ధ్యానగముఖ్య విప్రముని
పుంగవు జంగము మల్లికార్జునున్
వృక్షమూల నివాసు
నాతత వేదవేది ననూన రు
ద్రాక్షధారి నఘారి నత్యమలాంగు......

దర్శించినది. (6-79-80)

నన్నెచోడకవి తన గురువగు జంగము మల్లికార్జునుడు శివస్వరూపుడే కాన పార్వతి తపోవృత్తి సందర్భమున - తన గురువునే — పేర్కొన్నాడని స్పష్టము ఇక—అతడు వేదవేదియైన రుద్రాక్షధారి

---

24 ముద్రితప్రతిలో 'సమానంబున నమరి సతి విమానము' అనుట సరికాదు. విమాన మనియే యుండవలెను.

25. మొసలి తా దండగుండోము ముంచు నట్లు' అన్న పాఠము సరికాదు.

అనగా — వేదములు చదివి రుద్రాక్షలు ధరించినవాడని చెప్పియున్నాడు.

పార్వతియు తపోవేషంబున—రుద్రాక్షధారియైన మల్లికార్జునుని—గురుస్థానంబుగా స్వీకరించి... శైవాగమదీక్షగొని, యిట్లు ప్రకాశించినది.

సీ. పవడంపు తలమీద ప్రాలేయ పటలంబుఁ
 బర్వెనా మెయినిండ భస్మమలఁది
లాలితంబగు కల్పలత పల్లవించెనా
 కమనీయ ధాతు వస్త్రములుగట్టి
మాధవీ లతికల మాలికల్ ముట్టెనా
 రమణ రుద్రాక్షమాలికలు వెట్టి.
వరహోమంతికపై పురినమ్మి యూఁగెనా
 సన్నుతంబగు నెఱి జడలుపూని
గీ. హరుడు మాహేశ్వరీ రూపమైన చెలువ
 మభినయించెనొయని చెలులరిఁజూడ...........
 6–82.

పండితారాధ్య చరిత్ర—ప్రారంభమున నిట్లు గలదు.

మల్లికార్జున పండితుడు, గురువైన కోటిపల్లి ఆరాధ్య దేవునివలన—'పశుపాశపతి జ్ఞానదృష్టి' దీక్షగైకొని భూతిరుద్రాక్షలు ధరించి లింగార్చనము చేసెడివాడు. ఒకనాడు అచ్చటి బ్రాహ్మణులు తక్కిన వారు పండితుని చూసి సైపక

'పండితయ్యా! నీవు పౌరాణికుడవు
సద్విజోత్తముడవు సచ్చరిత్రుడవు
విద్వాంసుడవు వేదవిదుడ వట్లయ్యు
భూతియు రుద్రాక్షములు దాల్చనగునె?

అని ప్రశ్నించినారు అప్పుడు పండితుడు – భూతి లేక భస్మము — బ్రాహ్మణులు ధరింపవచ్చునని శ్రుతి స్మృతి పురాణములనుండి ప్రమాణములను జూపి, భస్మధారణ సమర్థించును. అట్లే రుద్రాక్షధారణను పూర్వోక్త ప్రమాణములనుండి యుదాహరించుచు బ్రాహ్మణులు ధరింపవలెనని నిరూపించెను ఆ వెనుక సోమనాథు డిట్లు వ్రాసియున్నాడు.

'రుద్రావతారుండు ప్రత్యక్ష
రుద్రుండు మల్లికార్జున శివయోగి
యలరి 'భూతిస్నాన' 'మంగీకరించి
అవిరళప్రీతి రుద్రాక్షముల్ దాల్చి'
 పం. దీక్షా. ప్ర. పుట 165.

కుమార సంభవమున వేదవేదియై, రుద్రాక్షలు దాల్చిన—జంగమమల్లికార్జునుడే యిచట — మల్లికార్జున శివయోగి - అనగా మల్లికార్జున పండితుడే కాని వేఱొక వ్యక్తి కాదు. ఇది పండితారాధ్య చరిత్ర దీక్షాప్రకరణములోనిది — పండితుడు, శివపూజ చేయు సందర్భములోనిది.

ఇక నన్నెచోడకవి — ఆరాధ్య సంప్రదాయమువాడు కావుననే — ఈ ఘట్టమున నా శైవ సంప్రదాయములను ప్రవేశపెట్టియున్నాడు కాళిదాస కుమారసంభవము సంస్కృతమూలమున—

1. పార్వతి—ఒక మునీశ్వరాశ్రమము గాంచుట.
2. అందొక వృక్షమూలమున మునీశ్వరుని బ్రాహ్మణుని సందర్శించుట.
3. ఆతని గురుస్థానీయునిగా స్వీకరించుట.
4. శైవాగమదీక్షగొనుట.
5. శరీరమున విభూతి రుద్రాక్షలు ధరించుట

అను నైదు విషయములు లేనేలేవు

వేదము చదివిన వారెవ్వరు—విభూతి రుద్రాక్షలు ధరింపరు — నన్నెచోడకవి తన గురువగు మల్లికార్జునుని యాదేశముచేత — నీ విషయమునిట ప్రస్తావించెను అతడు బ్రహ్మచర్యాశ్రమము వీడిన వెనుక గృహస్థాశ్రమమును స్వీకరించి మత సంప్రదాయములను ప్రపంచించునప్పుడు జరిగిన సంగతిని సోమనాథుడు వర్ణించెను.

## వృక్షమూల నివాసత్వము

'వృక్షమూల నివాసు' అనునది శైవసంప్రదాయికమే. ఇచట వృక్షము అనగా వటవృక్షము. శివుడు దక్షిణామూర్తి స్వరూపము ధరించి శిష్యులకు వటవృక్షమూలమున జ్ఞానోపదేశము చేయుట శివుని యిరువది నాల్గవ లీల.

'మునుల శ్రీ దక్షిణామూర్తి వేషంబు
నను బ్రోచుటిరువది నాల్గవలీల.
 పం. వా. ప్ర. 566 పుట.

'దక్షిణామూర్తి నై ధర మునీంద్రులను
శిక్షించి బోధించిన శివుడ రక్షించు'

సోమనాథస్తవము

మఱియు మర్త్యమౌని మొదల మఱిగి
యున్న గురునిచేత'

త్రిపురాంతకోదాహరణము

వటమూలమున నుపదేశమిచ్చుటచేత— శివుడు వటమూలమందిరుడైనాడు — శ్రీశైల దక్షిణ భాగమున — నీ వటమూలమందిరేశ్వర క్షేత్రమున్నది. వటమూలుడను శైవకవి కలడు ఇతడు వేమన గురువులలో నొకడు.

నన్నయ భారతమున వృక్షమూల నివాసుల పేర్కొన్నాడు.

'వారి భక్షులు, పర్ణభక్షులు
వాయుభక్షులు శాకనీ
వారభక్షులు వృక్షమూలనివాసయుక్తులు' —

(ఆర. 2–96)

## పరివార దేవతలు

పార్వతి చెలికత్తె వటురూపశివునితో నిట్లను చున్నది.

హరి నేత్రాంబుజ మంఘ్రి పీఠ
మజు హస్తాబ్జంబు సత్కేళి పం
కరుహం బాసితరోచిజూట లతికా
కల్పంబు విశ్వంభరా
ధరవంశేశులు కర్ణకుండలము లు
ద్యద్దేవతానీకముల్
పరివారంబుగనున్న శంభుం దనకుం
బ్రాణేశుగాం గోరుచున్ (7–18)

పండితారాధ్య చరిత్ర మహిమ ప్రకరణములో నిట్లు గలదు.

ద్వి...పరివార
దేవతలును వాసుదేవ విరించి
రవిగజాస్య గుహభైరవ మాతృకాది
వివిధగణంబు నందియు నట్లయుండ

పుట 113

## శివ పారమ్యము

కుమారసంభవమున — దక్షాధ్వరధ్వంసకథనము (2 వ ఆశ్వాసము), రతిమన్మథ సంభాషణ ( 4 వ ఆశ్వాసము), మాయావటువు సంభాషణ (7 వ ఆశ్వాసము) శివపారమ్య ప్రతిపాదనముకొఱకు ప్రత్యేకముగ ప్రవేశపెట్టబడినవి. మాయావటు సంభాషణ కాళిదాసుమూలమున నున్నదే-అయిన నిందు పూర్తిగా ఆరాధ్య సంప్రదాయికము.

## బ్రహ్మ విష్ణువులు శివసంభూతులు

కుమారసంభవమున—

క ఏ మాదిమూర్తి దక్షిణ
వామాంగములందుపుట్టి నారక జననో
ద్దామ పరిపాలనాది మ
హామహిమలు వొందగంటి మాశివుకరుణన్

అని కలదు. (2- 40)

పండితారాధ్య చరిత్ర –

ద్వి హరుడు మున్ లీలార్థమై లోకసృష్టి
విరచింపదలంప నవ్విధియు విష్ణుండు
నరి 'మదంగస్వేదసంభూత' యనగ
బరగు దక్షిణవామభాగంబులందు
దొరగిన ఘర్మబిందువులను బుట్టి

(1–611 పుట)

అంతేకాదు. వారికి శివునితో పోలికయే లేదు.

కుమారసంభవము —

సీ. బ్రహ్మాండ నికరంబు పరమేశు జలమూర్తి
నుదయించు నల్ప బుద్బుదము లనగ
అట్టి బ్రహ్మాండమునం దొక్క బ్రహ్మాండ
వాసులై......వర్తించు హరికమలాస
నామరేశ్వరాదుల దెచ్చి సర్వేశుతోన
యెన్నిపోల్కులు పెట్టగా నెన్నదీవు–(7–27)

పండితారాధ్య చరిత్ర - [26]

కాన యీశుండు జగత్ సృష్టికర్త
........ తనదు గర్భాంబుధిలోన

---

26 ఆరాధ్య సంప్రదాయమునకు పండితారాధ్య చరిత్రయే పరమప్రామాణిక గ్రంథము కాబట్టియు, అందు కథానాయకుడు పండిత మల్లికార్జును డగుటచేతను పండితారాధ్య చరిత్రనుండియే హెచ్చుగా సంవాదములను చూపితిని.

ఁనియించు బుద్బుదజాలంబు లట్లు
వెనయుంగ లింగమధ్యే జగత్సర్వ మనగ.
(1–530 పుట)

వాద సమర్థనకై శివపారమ్యమున రెం డుదాహరణములు చూపితినిగాని శివపారమ్యమునకు, శ్రీకారమునుండి మంగళమహాశ్రీపర్యంతము కుమార సంభ మంతయు నొక్క యుదాహరణమని చెప్పవచ్చును.

పైని నిరూపించిన విషయములన్నియు పండి తారాధ్యుడు ప్రతిపాదించి యుండుటచేత, కుమార సంభవమున ఆరాధ్యశైవ దీక్షయే ప్రపంచితమైనది.

ఇందువలన—నన్నెచోడుని గురువగు మల్లి కార్జునుడును — పండితారాధ్యుడగు మల్లికార్జునుడును నొకరేయని తెలియుచున్నది. అప్పుడు

2. పండితారాధ్యుని శిష్యకోటిలో నన్నెచోడుడు లేడు.

3. పాల్కురికి సోముడు—పండిత మల్లయ్య అనియే వాడుట.

4. నన్నెచోడకవి - పండిత శబ్దము చేర్చక వాడుట.

5. పండితుని పుత్ర పౌత్ర సంతతి

అనుమానికి సమాధానము చెప్పవలసి యున్నది. సమా ధాన మిది.

పండితారాధ్యుని పేరు—మల్లికార్జునుడే— ఆతడు, బ్రహ్మచర్యాశ్రమమున ఆ పేరితోనే వ్యవ హృతుడైనాడు శ్రీపతి పండిత, శివలెంక మంచెన పండితుల వెనుక ఆరాధ్యసంప్రదాయమును ప్రవ ర్తింపజేయుటవలన—మల్లికార్జునుడు[27] మల్లికార్జున పండితుడైనాడు వీరు ముప్పురికి 'పండిత త్రయ'మని వ్యవహారము.

పండితారాధ్యచరిత్రము, పండితుని గృహస్థా శ్రమ స్వీకారముతో ప్రారంభమగుచున్నది. గృహస్థా శ్రమ స్వీకారానంతరమే ఆతడు, పండిత ద్వయ ప్రతిపాదితమైన ఆరాధ్యశైవము సిద్ధాంతీకరించి పుత్ర పౌత్రుల మూలమున వ్యాప్తముచేసి పండిత త్రయమున స్థానము సంపాదించినాడు—కావుననే— పండిత మల్లయ్య, పండిత మల్లికార్జునుడు-అను రీతిని సోమనాథుడు వ్యవహరించినాడు.

నన్నెచోడకవి పండితునికి బ్రహ్మచర్యాశ్రమము నందు మాత్రమే శిష్యుడగుటచేత కుమార సంభవ మునం దెచ్చట తన గురువు 'పండిత మల్లికార్జును డని', 'పండిత మల్లయ్య' అని 'పండిత' శబ్దము చేర్చి వాడలేదు. ఇక పాల్కురికి సోమనాథుడు, పండి తుని బ్రహ్మచర్యాశ్రమవృత్తాంతము చెప్పబోవుట చే -ఆతడు పండితుని 'జంగమ' మల్లికార్జునుడని పేర్కొనలేదు. ఇందుచేత—కుమార సంభవమున— 'పండిత' శబ్దము-పండితారాధ్య చరిత్రమున 'జంగమ' శబ్దము మల్లికార్జునునకు ప్రయుక్తము కాలేదు.

కేవలము సాహిత్యదృష్టిచేతనేగాక—శైవమత సంప్రదాయ దృష్టితో పరిశీలించినయెడల—

'కుమారసంభవ కృతిపతి
జంగమ మల్లికార్జునుడు—
పండితారాధ్య చరిత్ర కథా
నాయకుడు పండిత మల్లి
కార్జునుడు—ఒక్కరే'

అని నిర్వివాదముగా నిర్ణీతమగుచున్నది

పండితారాధ్య చరిత్ర సావధానముగా పరిశీ లించినవారికి అందు పండితుని బ్రహ్మచర్యాశ్రమ వృత్తాంతము లేనేలేదని తెలియగలదు. పండితుడు— శ్రీశైలమున జనిమించి—యావెనుక ద్రాక్షారామము నకువచ్చి ద్రాక్షారామమునకు దగ్గఱగ నున్న కోటిపల్లి యందలి ఆరాధ్యదేవరవలన దీక్షపొంది—ఆరాధ్యమత సంప్రదాయమును ప్రవర్తిల్లజేసెను. వివరములు వ్యాసవిస్తరభీతిని విరమించాను.[28]

పై విషయములన్నియు నారాధ్య సంప్రదాయ మునకు పరమప్రామాణిక గ్రంథమైన పండితారాధ్య చరిత్రనుండి నిరూపించాను. దీనివలన, పండితారాధ్య చరిత్ర — పునర్ముద్రణావశ్యకతను — సాహిత్యలోక మెఱుగగలదు.

---

27. దీనిని గూర్చి—నూతనముగా ప్రకటిత మైన—మల్లికార్జున పండితారాధ్యుని శివతత్త్వసార పీఠిక చూచునది.

28. వీనికిని పూర్వోక్త శివతత్త్వసార పీఠిక చూచునది.

ఈ యైక్యప్రతిపాదన మీ క్రింది వివరణవలన స్పష్టమగును.

నన్నెచోడకవి కుమారసంభవము — పండిత మల్లికార్జునుని బ్రహ్మచర్యాశ్రమము — జంగమ మల్లికార్జునుడు.

సోమనాథుని పండితారాధ్య చరిత్ర—గృహస్థాశ్రమము—పండిత మల్లికార్జునుడు

ఇక కుమారసంభవమునుండి కృతిపతిని వర్ణించిన విశేషణములనుండి, పండితారాధ్య చరిత్రతో సమన్వయముచేసి పై విషయమును సిద్ధాంతీకరించుచున్నాను.

**కుమారసంభవము —కృతిపతి మల్లికార్జున యోగి**

మల్లికార్జున శివయోగి [29]
భూసురకులతిలకుడు
న్యాయవైశేషికాదిషట్తర్కకర్కశుండు.

కవీంద్రుడు—కవి నీరేరుహరవి.
శమదమనియతాత్ముడు.
త్రిమలవిదూరుడు.

పర'వాదీంద్ర' ఘనాఘనానిలుడు [30]
పరవాది భయంకరుండు.

ఇహ లలాటేక్షణుడు.
మనుజాకార మహేశుడు.
మాహేశ్వర ప్రకరమాన్యుడు.

**పండితారాధ్య చరిత్రము— మల్లికార్జున పండితుడు**

మల్లికార్జున పండితుడు.
బ్రాహ్మణోత్తముడు.
న్యాయవైశేషికోదాత్తశాస్త్రానుపాయ
దర్శన పరిపాలన క్షముడు.
శివకవి మల్లయ.
శమదమోత్కృష్ట నిష్ఠాగరిష్ఠుండు.
స్వతావలోకనోత్సారిత శిష్య నికర
మలత్రయ నిరసితేంద్రియుడు
పరవాది మేఘ దుస్తర మారుతంబు
పరవాది ఘోర సాగర బడబాగ్ని
పరవాది మత్తేభ పంచాననంబు
పరవాది ఘన వన స్ఫురిత దావాగ్ని
పరవాది విషభూజ పటుకుఠారంబు
పరవాది దుష్టదుర్ధర ధూమకేతు
పరవాది భూరిభూధర కులిశంబు
పరవాది వల్మీక వరఖనిత్రంబు
ఇంకను నిట్టివి ఆరు పాదములు గలవు

సన, సర్వదోన్మాత్ర సంశయంబవగ
జనియించినట్టి సాక్షాద్రుద్రమూర్తి
వీరమాహేశ్వరాచారవర్తనుడు.

---

29. 'మల్లికార్జున శివయోగి' అని పండితారాధ్యునికి ప్రయుక్తమైన ట్లీనరకే చూపితిని.

30. 'వాదీంద్ర చూడామణి' అను జైనసమయాచార్యుడు— కవిజనాశ్రయకర్త రేచనకు గురువు.

**కుమార సంభవము**

వేదషడంగశాస్త్ర పురాణేతిహాసాగమాది
సకల కళా స్వరూపుడు
దుర్వార గభీర ఘోరతర సంసారోర్వ
కూపార సంతరణ సేతు కల్పుడు

శివధర్మార్థ ప్రవీణుడు
శివతత్త్వవిదుడు
శివతత్త్వ జ్ఞాన సన్మానసుడు
శివతత్త్వామలమతి ప్రకాశుడు

కళాభిజ్ఞుడు
కళానిధానుడు
లోకగురుడు జగద్గురుడు
అభేద్యునాద్యు
వరేణ్యుంబుణ్యు
సత్త్వాది గుణ విభూతి
మాన్యుండు ధన్యుండు
అనఘుండు

చాటుతరావ[31]దాత నుత శాశ్వత కీర్తిరస
ప్రవాహ సంపూరిత రోదసీ కుహరుడు
కాశవికాసహాసదిక్స్ఫురితచారుకీర్తి

**పండితారాధ్య చరిత్ర**

వేదవేదాంత వివిధ పురాణోప
పాదితకేవల భక్తి వర్తనుడు
ఘోర నిస్సార సంసార వారాశి
పారగత్వము
దుర్వార సంపాత దూరవిస్రవ
తోద్ధరవర్తనుండు
శైవ ధర్మోత్తమాచార్యుడు
శివతత్త్వసార సంచిత మహామహిమ
శివతత్త్వసార సత్ప్రతిని కేవల
భక్తిగతిం బ్రతిష్ఠించి
శివతత్త్వసార సంచిత మహామహిమ

కళాపరతంత్రత
లోక గురుత్వంబుం జగద్గురుడు
బరసమాభేద్యునాద్యు
సంచిత పుణ్యు లోకైక వరేణ్యు
వరసత్త్వగుణ వికస్వరుడు
ధన్యుండు లోకైక మాన్యుండు

దండితాఘుడు

శుంభద్దిగంతవిశ్రుత సితకీర్తి

**కుమార సంభవము**

జంగమ లింగంబగు మల్లికార్జునకు
శివునితో నభేదము.

**పండితారాధ్య చరిత్ర**

జంగమలింగము లింగ స్వరూపుడగు
శివునితో నభేదము.

ఇట్లు నిరూపించినది మల్లికార్జున పండితుడే— మొదట జంగమలింగమైనకాని, కేవలము లింగ స్వరూపముతో నభేదము చేయుట కవకాశములేదు కావున జంగమలింగమైన మల్లికార్జున శివయోగి పండితారాధ్యుడైన మల్లికార్జున పండితుడు:

---

31. 'చారుతరావధాన' అను ముద్రిత పాఠము సరికాదు.

పాల్కురికి సోమనాథుని పండితారాధ్య చరిత్రమును, నన్నెచోడకవి కుమారసంభవమును కూలంకషముగా పరిశీలించినయెడల, కుమారసంభవ కృతిపతి మల్లికార్జున శివయోగియు, పండితారాధ్య చరిత్ర కథానాయకుడైన మల్లికార్జున పండితుడు నొక్కరే యని నిర్వివాదముగా నేర్పడుచున్నది

నన్నెచోడకవి బసవని సమకాలీనుడయ్యెనను, నాతని గురువు ఆరాధ్యుడైన జంగమ మగుటచేత, కుమారసంభవమున బసవని ప్రశంసయుండుట కవకాశమేలేదు. ఇందువలన – నన్నెచోడకవి బసవని కాలమున ననగా క్రీ. శ. 1130 - 1160 ప్రాంతముల నుండెనని నిశ్చితముగా జెప్పవచ్చును.

మల్లికార్జున పండితారాధ్యుడును, బసవనయు సమకాలీనులేకాన — పై కాలనిర్ణయమే ధ్రువపడుచున్నది.

పై విషయములనుబట్టి కుమారసంభవమును, సాహిత్యదృష్ట్యేకాక, శైవమతసంప్రదాయిక దృష్టితో పరిశీలింపవలసిన యావశ్యకత యున్నదని విశదమగుచున్నది.

పై పరిశీలన – నన్నెచోడని కాలనిర్ణయ సమస్యయేగాక – పాఠభేద నిర్ణయమునకు గూడ తోడ్పడును

ఈ నడుమనే ఆంధ్రప్రదేశ సాహిత్యఅకాడమీవారు ప్రకటించిన నన్నెచోడని కుమారసంభవ ముద్రణమున–అనుబంధములో పాఠభేదము లుదాహృతములైనవి. అందు ముద్రితపాఠముతో శ్రీ రా. అ. శర్మగారి (శ్రీ రాళ్లపల్లి అనంతకృష్ణశర్మగారి) సవరణపాఠము లని పాఠభేదము లీయబడినవి. వానినన్నిటిని చర్చించుట యీ వ్యాసోద్దేశముకాదు. ఒక్కటి మాత్రము మచ్చునకు చూపుచున్నాను.

ఆశ్వా. పద్య పాదములు
12 - 226 - 2/3.

ముద్రిత పాఠము
కుంభజ తత్త్వజ్ఞుడు

శ్రీ అనంత కృష్ణశర్మగారి పాఠము
కంజజ తత్త్వజ్ఞుడు.

మొదట యిచట 'కంజజ తత్త్వజ్ఞుడు' అను పాఠమే – అసంబద్ధము – దీనివలన ఆ పద పాదమున యతి తప్పినది.

మ త్రిజగద్వంద్యు డనింద్యుడు.............
........ .........పాత్రుండు 'గుం
భజ తత్త్వజ్ఞుడు ప్రాజ్ఞ డీశుపద స
ద్భక్తుండు ముక్తుండు'

ఇచట 'కుంభజ'యని యున్నగాని యతి తప్పును. కావున కంజజ పాఠమున కాస్కారమే లేదు.

కుంభజతత్త్వజ్ఞుడనగా రసవాద తత్త్వజ్ఞుడని యర్థము [32] గుంభజుడైన అగస్త్యుడు- రసవాద సిద్ధాంతములు ప్రతిష్ఠించిన వారిలో నొకడు— (మూ. కుమార సంభవ ప్రథమ ముద్రణ పీఠిక– పుట 5).

ఇంతవఱకు కుమార సంభవమునకు తంజాపూరి తాళపత్ర ప్రతిననుసరించి, అందులుప్తములైన భాగములు కుండలీకరణముచేసి చూపిన ముద్రణమే లేదు. అట్టి కుండలీకరణములతో కూలంకషమైన వ్యాఖ్యానముతో సాధికారమైన సుపరిష్కృతమగు కుమార సంభవ ముద్రణ వెలువడినగాని — నన్నెచోడని గూర్చి కుమారసంభవమును గూర్చి వ్యాప్తములైన సమస్యలు పరిష్కారములు కావు. ఇంకను కుమార సంభవమును గూర్చి ఎంత పరిశ్రమ పరిశోధన జరుగవలసి యున్నదో చూపుటయే ఈ వ్యాసోద్దేశము.

కుమార సంభవ కూలంకష వ్యాఖ్యా సమేత సుపరిష్కృత సర్వంకష ముద్రణము కర్తవ్యముగా సాహిత్యలోకము భావించిన—ఆంధ్రప్రబంధ మూర్తి కీర్తి అభంకషమగును.

---

32. అగస్త్య ప్రశంస 'భవసాగర కుంభజ' అన్న కృతిపతి విశేషణమున గలదు. (4–122).

కలగూరగంప:

# వీరమాహేశ్వరాచార సంగ్రహం

ఆంధ్ర వాఙ్మయ చరిత్రలో క్రీ. శ. 1100 నుండి 1227 వరకు శివకవుల యుగమని పేర్కొనబడి యున్నది. జీవితమును మతమునకే అంకితముచేసి శివపరమైన వస్తువును స్వీకరించి దేశిరచనలను సలిపినవారు శివకవులు. శైవేతరుల దర్శన స్పర్శనాదులు పాపమని భావించినవారు. మత ప్రచారమునకెట్టి సాహస కార్యమునకైనను వెను దీయనివారు వారి కాలమునకు చెందినవాడే లింగనా మాత్యుడు. వీరమాహేశ్వరాచారసంగ్రహమునందలి ద్వితీయాశ్వాసాంత గద్యమునుబట్టి చూడ పండితా రాధ్యు డితని గురువని తెలియుచున్నది.

'ఇది శ్రీగిరీశ విశ్వేశ్వర ధ్యాన
విదిత శివాచార విశ్రుత జ్ఞాన
పండితారాధ్య శ్రీ పాదాబ్జ భృంగ
ఖండేందుధర భక్తి కామ్యాంతరంగ
శివ కృపాంచిత గాత్ర శ్రీవత్సగోత్ర
ప్రవిమల నిగమోక్త భవ్య చారిత్ర
లీల బర్వతరాజు లింగనామాత్య
విరచితమై సర్వవేదోక్తమైన
ధరణి నాచంద్ర తారార్కమగుచు
శ్రీరమ్యమై సర్వ సేవ్యమై సర్వ (సారమై)
సన్నుతాచారమై జగతి నిమ్మారు
వీరమాహేశ్వరాచార సంగ్రహ
మను పేర వెలువారు నట్టియీ చరిత
మందు రుద్రాక్ష మాహాత్మ్యంబు కీర్తి
నందమై తగ ద్వితీయాశ్వాసమయ్యె
(ఫాల్గుణ శు 12 లు శనివారము)

## కాలము

పర్వతరాజు లింగనామాత్యుడు శ్రీవత్సగోత్రు డని తెలియుచున్నది. పండితారాధ్య శ్రీ పాదాబ్జభృంగ అని చెప్పుటచే పండితారాధ్యు డితని గురువని తెలియుచున్నది. పండితారాధ్యుని కాలము క్రీ. శ. 1170 - 72 అని పెక్కుమంది అభిప్రాయపడుట చేత ఆకాలమునకు చెందినవాడేనని తెలియనగును. గ్రంథమునం దెచటను శాలివాహన శక ప్రసక్తి యైన లేనందున తెనుగు సంవత్సర మాస దివసముల నాధారముగా జేసికొని కాలమును ఖచ్చితముగా నిర్ణయించుట కష్టము. ఈ గ్రంథమునందు చతుర్థాశ్వాస రచన సాధారణ సంవత్సర అధికవైశాఖ బ 2 లు నాటికి పూర్తియైనదని తెలియుచున్నది.

## ఆశ్వాసము లెన్ని?

తాళపత్రములు కొన్నిమాత్రమే లభించినందున ఆశ్వాస సంఖ్య నిర్ణయించుటకు వీలులేదు. నాల్గవ ఆశ్వాసమువరకు విషయ వ్యక్తీకరణమునకు ఇరవై యెనిమిది తాళపత్రములు సరిపోయినవి. తరువాత 44 వ తాళపత్రము కనపడినది. పత్రసంఖ్యనుబట్టి చూడ దానియం దెనిమిది యాశ్వాసములైన నుండ వచ్చునని యూహింపవచ్చును

## లింగనామాత్యుడు వీరశైవుడే

వీరశైవమతమునందలి సంప్రదాయములలో మొదటిది జంగమ సంప్రదాయము. రెండవది ఆరాధ్య సంప్రదాయము. ఆరాధ్య సంప్రదాయమునకు మూల పురుషుడు పండితారాధ్యుడు. శివాగమములయందు స్థూలదృష్టితో సామాన్య, మిశ్ర, శుద్ధ, వీరశైవ అను చతుర్విభాగములును, మరికొన్నింటిలో శైవ, పూర్వశైవ, మిశ్రశైవ, శుద్ధశైవ, శ్రౌతశైవ, మార్గశైవ, వీరశైవ, సామాన్య వీరశైవ, విశేష వీరశైవ, నిరాభార వీరశైవ అనెడి పది భేదములు సుదాహృతము లయినవి. భస్మ రుద్రాక్ష ధారణాది చిహ్నములు శివభక్తులకు విహితమైనవి. గురుదత్త మైన భస్మమును ధరించుట, శివలింగ మెచట గన బడినను ప్రదక్షిణ ప్రణామము లాచరించుట సామాన్య

శైవ లక్షణము ఆణవ, కార్మిక, మాయామలము లను, దీక్షచే దగ్ధ మొనర్చి భౌతిక శరీరమును లింగ శరీరముగజేసి ప్రసాదించిన లింగమును కంఠమునగాని, శిరమునగాని, భుజమునగాని, వక్షమునగాని ధరించుట, అర్చించుట పంచాక్షరీ మంత్రమునే మననము చేయుట, వర్ణాశ్రమ ధర్మములు ఆ వ్యవస్థననుసరించిన కర్మములు లేవనుట తామస భక్తిని ప్రదర్శించుట అనునవి వీరశైవులు పాటింతురు. లింగనామాత్యుడుకూడ తన కృతియందు లింగమాహాత్మ్యమును పంచాక్షరీమంత్ర మాహాత్మ్యమును వివరించుచు తామస ప్రవృత్తిని ప్రదర్శించి యుండుటచే వీరశైవుడనియే చెప్పవచ్చును. పండితారాధ్యుని శిష్యుడై యుండుట పై విషయమును ధ్రువపరచుచున్నది.

### పంచ మలములు

1. ఆణవమలము: పరతత్త్వ జ్ఞానమును మఱుగు పఱచునది
2. కార్మిక మలము: సద్గురువులు బోధించు అర్థమును చొరనీయనిది.
3. మాయిక మలము: పరతత్త్వ జ్ఞానవాసనను ఉదయింప నీయనిది.
4. మాయేయ మలము: పాపపు పనులు చేయుటయందు మనస్సును ప్రవేశ పెట్టునది.
5. తిరోధానమలము: మంత్ర తంత్రముల యందు దసక్తిని గల్గించి అధోగతి పాలు చేయునది.

ఈ పంచమలములను హరింపజేసి పవిత్రత నాపాదించుట గురువు చేయవలసిన పని.

### ప్రక్రియ

కవిత్వమును సుందరమైన దేవతగాగాక మత దేవతగా జూచి దేశీయమైన ఛందస్సులో శివుని గాథలను రచించుటవలన శైవమతము వ్యాప్తి నొందినది. పాడుకొనుటకు వీలుగా నున్నందున ఈ ప్రక్రియ సామాన్యప్రజలు గూడ సులభముగా గ్రహించుటకు వీలయినది. లింగనామాత్యుడుగూడ ద్విపద లోనే రచన సాగించుటకు కారణము ఆ యుగప్రభావమే. 'ఉరుతర గద్య పద్యోక్తుల కంటె సరసమై పరగిన జాను తెనుంగు, కూర్చెద ద్విపదలు గోర్కి దైవాఱ, తెలుగు మాట లనంగవలదు వేదముల కొలదియ కాజూడు' డని పాల్కురికి సోమన చెప్పియున్నాడు గదా

### సానందుని వృత్తాంతము; పంచాక్షరి మాహాత్మ్యము

'శ్రీశైల వల్లభ శ్రీ మహాదేవ
కేశవార్చిత సర్వగీర్వాణ వంద్య
అవధారు శ్రీ రాఘవాధీశ కరయె
ప్రవిమలమతి శంభు భట్టారకుండు
అధికమైనట్టి పంచాక్షరిమహిమ
కథ తొల్లి శ్రీ మహాస్కాందంబునందు
నారూఢి నెంపొందు నట్టి సనత్కు
మార సంహితయందు మహనీయమహిమ
సానంద చరితంబు జగతీశునకును
వీనులకింపార విన్నవించెదను
శ్రీ నంది నాథుండు శివపరాయణుండు
గానవిలోలుండు కఱకంఠు మూర్తి
ధరణి జెన్నగు భరద్వాజాశ్రమమున
పరమ మునీంద్రులు ప్రముఖులు సురలు
కరమర్థి గొలువ చొక్కపు వైభవమున
పరమానురాగుడై పరమేశు జూచి
పొంపున గూర్చుండి సురమునీంద్రులకు,
యింపైన శాస్త్రంబులెల్ల జెప్పగను
అందరు వినుచుండ నందులో బ్రహ్మ
నందనుండైన సనత్కుమారుండు

విని విని సంతోష వివశుడై దేహ
మనయంబు గరుతెక్క ఆనందబాష్ప
ములు నేత్ర యుగమును ముంచి దైవార
వెలయంగ బ్రణమిల్లి వృషభేంద్రునకును
ఘనభక్తి యుక్తుడై కరములు మొగిచి
అనఘాత్మ శైవాగమార్థ విశాల
సర్వజ్ఞుడవు నీవు సర్వవేదములు
సర్వశాస్త్రంబులు చర్చ జేసితివి
హరుమంత్రమైన పంచాక్షరి మహిమ
వెరవంద మదిలోన వినవేడ్కయగును.'

## సౌనందుని వృత్తాంతము

'పుణ్యాత్మ వినవయ్య భువిమీద తొల్లి
పుణ్య సమ్మానియైన...నీకు
అనఘుండు సౌనందుడను నొక్క పుత్రు
డనుపమగుణశీలు డమర జన్మించి
ఆనంద మేఘుడై యఖిలజీవులకు
నానంద మొనరించునదిగాన యతడు
సౌనందుడనుపేర సత్కీర్తి బరగు
జాని గర్భంబున పుట్టింది మొదలు
పంకింప మదియొండు భావంబులేక
హరుడు సర్వేశ్వరుండని నిశ్చయించి
తల్లిదండ్రుల నన్నదమ్ముల హితుల
నెల్ల బాంధవులను యెల్ల సంపదల'

త్యజించి యేకాంతవనసదమలచిత్తుడై సర్వేంద్రియముల నిగ్రహించి శివుని హృదయపద్మమునందు నిలిపి ధ్యానజపార్చనాదుల కాలము గడుపుచుండెనట. శివకవుల స్వభావమును దెలుపుకథలు అనేకములు గలవు. సృష్టి స్థితి లయములకు కారణభూతులు బ్రహ్మ విష్ణు మహేశ్వరులను మాటను నిరాకరింతురు వారి మతమున శివుడే సృష్టికర్త, శివుడే పోషకుడు. లయకారుడును బ్రహ్మవిష్ణువుల ఆధిక్యమును వారంగీకరింపరు.

'సకల చరాచర సంయుక్తమైన
సకలజగంబులు సర్వదేవతలు
శివునిలో బుట్టుచు శివునిలో బొదలి
శివునిలో గలయుచు శివమయంబగుచు
సర్వేశ్వరుని లోన సర్వంబు నుండు
సర్వంబునందు దా సర్వేశు డుండు

లోకములు, వార్ధులు, శైలములు, వృక్షములు, దేవతలు, దానవులు యోగీంద్రులు, గరుడ, ఖేచర, యక్ష, గంధర్వ సిద్ధవరులు, విద్యాధరులు, కిన్నరులు పశు-పక్షి మృగ దైత్య పన్నగులు రుద్రస్వరూపమునే రూపింతురు. దేహమే చంద్రధరుని మందిరము. ప్రాణమే శివుడు--అని చెప్పి లింగన తన వీరశైవత్వమును చాటెను.

పంచాక్షరితో సమానమైన మంత్రము లేదు. శివునిబోలు దైవము, గౌరినిబోలు నైదువలు, గంగతో సమానమైన నదులు, సాగరమునుబోలు సరస్సులు, మేరునగమునుబోలు పర్వతములు, వారణాశికి సరివచ్చు తీర్థములు, శంకరునిభక్తికి సమానమైన భక్తి శంకరుపూజకు సమమైన పూజ లేవట. సకలవేదశాస్త్రాగమ పురాణముల సారాంశమే పంచాక్షరి మంత్రము. పంచమహాఘోరపాపము లాచరించినను జగత్రయమునే సంహరించినను పంచాక్షరీ మంత్ర దివ్యప్రభావముచేత విముక్తి కలుగునని వారి నమ్మకము

## సుద్యుమ్నుని చరిత్రము

'ఆ రాజు విభవంబు ఆ రాజుగుణము
ఆ రాజు పరమేశ్వరారాధమహిమ
చరితంబు లివి యెల్ల జనులచే వినుచు
అరసి వచ్చెదనంచుయుడ యొక్కనాడు
తృణబిందు డనియెడు దివ్యయోగీంద్రు
డనురాగమునవచ్చె నంత నక్కడను
భూపాలు డతిభక్తి భూరిమార్గమున
శ్రీ పరమేశ్వరుజేరి యింపార
పూజించు చుండి యా భువనేశు పాద
పూజయంతయు సంపూర్తి గావించి
మునినాథు కెదురేగి మ్రొక్కి దోడ్కొనుచు
తన నగరికివచ్చి తన సింహాస
నాసీను గావించి యర్ఘ్యపాద్యములు
భాసుర భూషణాంబరములిచ్చి
కలయంగ హస్త పంకజములు మోడ్చి

పిలిచి యో మునినాథ నీవు నామీద
కరుణించి వచ్చితి గాన నేనింక
ధరకృతార్థుడనైతి ధన్యుడనైతి
ఫలియించె నా తపఃఫలము సిద్ధించె.'

అనిన ఆ మాటలకు మునీశ్వరుడు సుద్యుమ్నునితో నిట్లు చెప్పెను 'నీవు శివపాద భక్తి యుక్తుడవు. పుణ్యాత్ముడవు. నీ సదాచార సద్గుణములు విని సంతసించి నేను వచ్చితిని. నీవు పూర్వ జన్మమందే పుణ్య మాచరించితివో చెప్పుము' అనెను.

సుద్యుమ్నుడు:–'నేను పూర్వజన్మమున వ్యాధుడను. గంగాతీరమున వసించుచు అడవుల నడుచు వారల నెల్ల జంపితిని. బ్రాహ్మణులను పశువులను జంపితిని. దోషములన్నియు నన్ను బొందుటచే మరణించితిని. కాలదూతలు కాలపాశములచే గట్టి యమునిముందట నుంచిరి అతడు చిత్రగుప్తుని బిలిచి సుద్యుమ్నుని వర్తనమెట్టిదని యడుగ నతడిట్లనెను:– 'ఇతడు చేసిన పుణ్యమును ముక్కంటి యెరుగును. హరనామస్మరణమున పాపములన్నియు పటాపంచలైనవి' అట్లు చెప్పగా పదివేల సూర్యుల ప్రకాశముతో దేజరిల్లు నొకవిమాన మచటికి వచ్చెను

'ఇంద్రగణములు సేవచేయుచుండ దేవకన్యకలు ఆడుచు పాడుచు నడువ దేవేంద్రలోకమున కరిగి యతనిచే పూజలు గొనుచు భోగము లనుభవించుచు, పదివేల యుగములుండుంటిని. తదుపరి బ్రహ్మలోకమునకు పోయి పూజ గైకొనుచు దివ్య భోగముల తృప్తి నొందుచు నొకకల్పపర్యంత మందుండి ఇంద్రద్యుమ్నుడను రాజర్షి కొడుకునై జన్మించితిని.'

అని యిట్లు సద్యుమ్ను డా తృణబిందు
కనురక్తి జెప్పిన నాశ్చర్యమంది
శ్రీ మహాదేవుని జింతించి మ్రొక్కి
ఆ మహారాజున కటు జెప్పినైచి
సన్మునీంద్రుడు నిజాశ్రమమున కరిగె
సన్మతి పరమేశు చరణపద్మముల
పొలుపార గొలుచుచు భువిని అంతయును
సుఖభుక్తై యేలుచు సుద్యుమ్నుడుండు

ననుచు సూర్యుడు తొల్లి యాపుత్రుడైన
మనువుకు హరనామ మహిమంబు జెప్పె'

అని రామచంద్రునకు శంభుభట్టు హరునామ విఖ్యాత చరితమును వినిపించెను. అతడు సంతోషమును బొంది శివరాత్రి మహిమ చరితము విన వేడుక కలదని వినిపింపుమా అని అడిగెను.

సుద్యుమ్నుని చరిత్రము. 4 అశ్వాసము.

(సాధారణ సంవత్సర అధికవైశాఖ బ 2 లు సోమవారము)

భక్తులకథలను వర్ణించుట శివకవుల సామాన్య గుణము. వీరమాహేశ్వరాచార సంగ్రహమునందును భక్తుల గాథలు కలవు.

—ఆర్. మల్లేశ్వర్.

## వేదము వేంకటరాయశాస్త్రిగారి శాకుంతలాంధ్రీకరణము

బహుభాషా కోవిదులును, తర్కవేదాంత వ్యాకరణాది శాస్త్ర పారంగతులునునగు వేదమువారి పాండిత్యమును గురించి చెప్పనక్కర లేదు వారు జగమెరిగిన బ్రాహ్మణులు. 1896 లో వారి శాకుంతలాంధ్రీకరణము వెలువడినది. మరల పునర్ముద్రణము అందినది. తెలుగున శాకుంతలమును రచించిన వారు పలువురు. అన్నింటిలో వీరేశలింగం పంతులుగారి ఆంధ్రీకరణమే మేలైనదని పలువురు మెచ్చుకొనిరి. 'ఈ యాంధ్రీకరణము లన్నిటిలో గాలమును బట్టియేకాక గుణమును బట్టికూడ శ్రీ వీరేశలింగం పంతులుగారిచే యగ్రగణ్యమైనది' అనినారు శ్రీ దివాకర్ల వేంకటావధానిగారు. 'ఆంధ్రదేశమునందు దిగ్దంతులవంటి పండితు లెందరో పంతులుగారి తరువాత శాకుంతలము నాంధ్రీకరించిరి. రాయదుర్గము నరసయ్యశాస్త్రిగారు, వేదము వేంకటరాయశాస్త్రిగారు, దాసు శ్రీరాములు పంతులుగారు, వడ్డాది సుబ్బారాయుడుగారును శాకుంతలమును అనువదించిరి. అనువాదము లన్నింటిలో వీరేశలింగముపంతులుగారిదే నాటికిని నేటికిని జనామోదము పొందినది' అని శ్రీ ఖండవల్లి లక్ష్మీరంజనముగారు వీరేశలింగము సంచికలో నుడివియున్నారు.

పంతులుగారి శాకుంతల లాంధ్రీకరణమును గురించి శ్రీ ఎస్. వి. జోగారావు భారతి (1963 ఉగాది)లో ఒక వ్యాసము వ్రాసినారు. వారి వ్యాసమే నన్నీ వ్యాసము వ్రాయ ప్రేరేచినది. నాందీశ్లోకమును పంతులుగా రనువాదించినారు. అది మూలశ్లోకము వేమఱకుండ రచియింపబడినది కాని పంతులుగారొకటి ఉపేక్షించినారు. నాందీశ్లోక చరమ పాదమున 'తాభిః ప్రత్యక్షాభిః అష్టాభిః తనుభిః' అను దానిలో 'ప్రత్యక్షాభిః' అను విశేషణము గంభీరార్థము కలది మనకు ప్రత్యక్షమగు ఈశుని యష్టతనువులద్వారా పరమేశ్వరుడు రక్షించు ననగా నాతని రక్షణ అవశ్యము లభించునని శుభప్రదమగు నాంది ధ్వనించుచున్నది. ఈ 'ప్రత్యక్ష' శబ్దమును వేదమువారుమాత్ర ముపేక్షింపలేదు.

> 'శ్రీ కిం బుట్టు వొసంగె నేది,
> యెవి వాసి వ్వేల్చు తోచున్ హవిన్,
> లోక శ్రవ్యగుణాంక మేది ,
> యెవి కొల్చున్ గాలమున్ రెండునున్
> లోకుల్ ప్రాణులు దేన,
> భూత తతి గల్గున్ దేన, ప్రత్యక్షుఁడా
> నీ కాయంబుల నెవ్వఁ డెన్మిదిట
> నా యీశుండు మి మ్మోముతన్'

అని యిందు మొదటి వాక్యము వేదమువారి సొంతము. 'యాసృష్టిః స్రష్టురాద్యా' అని మూలమున నుండ, పంతులుగారు 'ఎయ్యది యాద్యయెౌ నజుని సృష్టికి' నని యనువదించినారు కాని వేదమువారు శ్రీకారముతో కావ్యమును తప్పక ప్రారంభింపవలయునను నియమములో గాబోలు 'శ్రీకిం బుట్టు వొసంగె నేది' అని యనువదించినారు. మఱియు 'లోక శ్రవ్యగుణాంక మేది, యెవికొల్చున్ గాలమున్ రెండునున్' అనిన చోట మూలమునందలి వాక్యములు తారుమారైనవి. పంతులుగారు క్రమము నేమరక వ్రాసిన విషయమును గూర్చి చెప్పుచు 'కవిసమ్రాట్' విశ్వనాథ సత్యనారాయణగా రిట్లనినారు 'సారస్వత నీరాజనం' పీఠికలో. '''యాసృష్టి స్రష్టురాద్యా' ఇందులో పంతులుగారు క్రమము నేమరలేదు'' అని జోగారావు గారు వ్రాసిరి. 'అనాఘ్రాతం పుష్పం' అన్నదానిలో నేమరుట జరిగినది. ఇది మరీ ప్రాణాంతకము. అది యేమి పాపకాలమో వేదమువారి అనువాదము నందునునట్లేయైనది

> 'అనాఘ్రాతం పుష్పం
> కిసలయ మలూనం కరరుహై
> రనావిద్ధం రత్నం
> మధునవ మనాస్వాదిత రసమ్
> అఖండం పుణ్యానాం
> ఫలమివ చ తద్రూప మనఘం
> నజానే భోక్తారం
> కమిహ సముపస్థాస్యతి విధిః'

> 'వాసన చూడనట్టి ప్రసవంబు
> నఖంబులఁ ద్రుంపనట్టినూ
> త్నా సమ పల్లవంబుఁ
> బరులానని క్రొవ్విరి తేనె
> సూచి విన్యాసము లేని రత్నము
> మహోతత పుణ్య ఫలంబు బోలు
> నా భాసురగాత్రి సోయగ
> మెవండు భుజింప విరించి వ్రాసెనో!'

ఇది పంతులుగారి యనువాదము. దీనిని వేదమువా రిట్లనువదించినారు.

> ఉ. ఆననితావి పూవు
> నఖరాగము సోఁకని పల్లవంబు
> క్రొం దేనె రసంబు గ్రోలనిది
> తీరయి విద్ధముగాని రత్నమున్ మానిసరూపు
> పుణ్యాభరామంజుఫలం బనఘం బఖండమున్
> నేనెఱుఁగ న్విరించి
> యెవనిం బరిభోక్తను గూర్ప నెంచునో'

పంతులుగారి యనువాదముకంటె నిదియే మేలైనదిగ నున్నదని చెప్పక తప్పదు. నఖముల త్రుంపనట్టి పల్లవ మనుటకంటే 'నఖరాగము సోకని పల్లవంబ'నుటలో మార్దవము మిగుల సూచితము. తీరయి విద్ధముగాని రత్నమున్' అనుటయు నట్టిదే. కాని మూలమునందలి క్రమము రెండు పద్యములలోను తప్పినది.

దుష్యంతుడు శకుంతల తప్పక క్షత్రార్హ యని, అర్యుని మనమామె నభిలషించుటయే తార్కాణ మని యిట్లు చెప్పెను.

సతాంహి సన్దేహ పదేషు వస్తుషు
ప్రమాణ మంతః కరణ ప్రవృత్తయః'

దీనిని పంతులుగారు

'ఎందు సందేహ వస్తువులయందు
నాత్మగతులె ప్రమాణంబు లార్యులకును'

అని యనువదింప,

'సజ్జనులకు వస్తుసందేహములయందు,
దమమనః ప్రవృత్తి, దన్నివృత్తి'

యని వేదమువా రనువదించిరి.

ఇందు మూలమునందలి యంతః కరణ శబ్దమునకు 'మనః ప్రవృత్తి' యనినారు వేదమువారు. అంతః కరణమునకు మనస్సునకు భేద ముపేక్షింపబడినది.

వరనల పట్టున కొన్నియెడల వేదమువారి యనువాదము మూలము ననుసరించుచు, ఔచిత్యముతో గూడి, వర్ణనకు దగిన శైలిలో నలరారుచున్నది.

యదాలోకే సూక్ష్మం
వ్రజతి సహసా తద్విపులతాం
యదర్ధే విచ్ఛిన్నం
భవతి కృత సన్ధాన మివ తత్
ప్రకృత్యా యద్వక్రం
తదపి సమరేఖం నయనయో
ర్న మే దూరే కించి త్క్షణమపి
న పార్శ్వే రథ జవాత్'

రథ వేగమును సూచించు మనోహరమైన వర్ణన మిది. దీనిని పంతులుగారు రెండు గీత పద్యములలో ననువదించినారు. కాని వేదము వారొక్క పద్యమున దృశ్యపరిణామమును చక్కగ తోపింప జేసినారు.

'చిన్నది వోలెం దోచు నెది
చెచ్చెరఁగాలు నదే విశాలమై
పన్నుగ వంకరైనదియె
భాపిలు నెంతయుఁ దీరి తిన్ననై
చిన్నము తెంపు వోయి
సరిఁజేరిన యట్లగుఁ
దేరివేగముం దెన్నగ
దవ్వు పజ్జయును
నేర్పడ వేర నిమేష మేనియున్'

వేదము వేంకటరాయశాస్త్రిగారి యాంధ్రీకరణమున గమనింపవలసిన మరియొక సుగుణమున్నది. పంతులుగారు బేస్తవానిచేతను గ్రాంథికాంధ్ర భాష లోనే మాటాలాడింపజేసిరి. కాళిదాసాదులు పాత్రోచిత భాష వాడిరి. దాని ననుసరించి వేదము వారును ప్రవేశకమున కావలివాండ్రచేత, బెస్తవారిచేత పాత్రోచిత భాషనే మాటాడించిరి.

'ఓరేయ్, ఓరే దొంగా, శప్పరా శప్పరా. రతనాల కట్టులోన యేలినివారి పేరు శెక్కిన యీ వుంగరం నీకెక్కడ నారే దొరికింది?'

పురు : (భీతి నటించుచు) బాబులారా, నామీద్దయిశేండి. నానిలాంటిపనిశేశే వోణ్నిగానుండి.'

ఇవికాక కొన్ని ప్రసిద్ధశ్లోకముల ననువదించు పట్టున వేదమువారి అనువాదము పంతులు గారి దానికంటె గంభీరమైయున్నది. పంచమాంక ప్రారంభమునగల ప్రసిద్ధశ్లోకము :

'రమ్యాణివీక్ష్య మధురాంశ్చ నిశమ్యశబ్దాన్
పర్యుత్సుకోభవతి యత్సుఖితోఽపిజన్తుః
తచ్చేతసా స్మరతి నూనమబోధపూర్వం
భావస్థిరాణి జననాన్తర సౌహృదాని'

దీనికి పంతులుగారి యాంధ్రీకరణ మిట్లున్నది.

'మున్నెఱుఁగకయు మదినంటు పూర్వజన్మ
భవ్యసఖ్యముల్ స్మరణకు వచ్చుఁగాన
జనుఁడు సుఖితుఁడయ్యు సురూపచయముఁ గనియు
సుస్వరంబుల వినియు నుత్సుకతఁ గాంచు'

దీని నాటవెలది పద్యములో సందముగ ననువదించి నారు వేదమువారు.

'మంచిరూపుఁ గాంచి మధురశబ్దము విని
సుఖియు నుత్సుకిల్లి సుక్కు రెల్ల

భావరూఢ పూర్వభావసౌహృదంబుల
స్మరణగాదె బోధ విరహితంబు,'

వీరేశలింగం పంతులుగారి యాంధ్రీకరణము ప్రసిద్ధిగాంచుటకు గారణము వారి శైలియందలి ప్రాసాదగుణమే. శాకుంతలమున వేంకటరాయశాస్త్రి గారు సాధ్యమైనంతవరకు ప్రసన్నమైన భాషనే వాడిరిగాని పంతులుగారివలె ఆకర్షనీయమైలేదు. పంతులుగారి ఆంధ్రీకరణమునుగూర్చి విశ్వనాథ సత్యనారాయణగారు 'ఈ గ్రంథముయొక్క ప్రాశస్త్యము తక్కిన తెలుగుసేతలకంటె మూలకావ్యమును కొంత బాగుగా తెలియచేయబడెడి భాషలో వ్రాయుటయే' యనిరి. వేదమువారి అనువాదములో కొన్నియెడల భాష మూలముకంటె కఠినతరమై యుండును. దీనికి నొక్క యుదాహరణము నిచ్చి యీ వ్యాసమును ముగింతును.

సేనాని దుష్యంతుని ప్రశంసించుచు నిట్లు పలుకును.

'అనవరత ధనుర్జ్యాస్ఫాలనక్రూర పూర్వం
రవికిరణ సహిష్ణు స్వేదలేశై రభిన్నమ్,
అపచితమపిగాత్రం వ్యాయతత్వాద లక్ష్యం
గిరిచర ఇవనాగః ప్రాణసారం బిభర్తి.'

దీనికి తెనుఁగుసేత యిట్లున్నది.

మ. ప్రమదాటోప విజృంభణానిశ ధను
ర్జ్యాస్ఫాలన క్రూరపూ
ర్వము ఘర్మార్కగభస్తికాక్షమము ద
ర్భస్వేద మస్పృష్టమున్
శ్రమజిద్ వ్యాయతియై నలక్ష్యకృశతా
సంపర్కముం బ్రాణ సా
రమునా గాత్రముతో విభుండలరు గిరి
భ్రామ్యన్మదేభాకృతిన్'

ఇట్టిచోట్ల అనువదించుటకంటె మూల శ్లోకమునే యుంచిన మరింత సులభముగ అర్థమయి యుండును

— శ్రీ రాళ్లపల్లి సుందరం.



# గ్రంథ విమర్శలు

## "కృత్"

(సామాన్య భారతీయ పదనిరుక్తి)

(రచన: డా|| రఘువీర; ఆంధ్రకర్త: శ్రీ వంగల కృష్ణదత్తశర్మగారు; ఉయ్యూరు—కృష్ణాజిల్లా—వెల; 2-00. 1/8 డెమ్మీ 86 పుటలు.)

డా|| రఘువీర అనువారు Comprehensive English-Hindi Dictionary' రచించినారు. ఆ నిఘంటువు పీఠికలోని Verbal roots, Nominal Verbs, Suffixes, Prefixes —అను నాలుగు ఖండములకు 'కృత్' అను గ్రంథమాంధ్రీకరణము. కొన్ని చేర్పులు, తీసివేతలు కలవని శ్రీ శర్మగారే తెలిపినారు. దేశభాషలలో వాడుకలోనున్న పదముల వ్యుత్పత్తులను నేర్పుట మూలమున, తక్కిన దేశభాషలను సగనుస్నైవిలుకు నేర్పుట, పారిభాషిక పద నిర్మాణమునకు దోహదము చేయుట, పై నిఘంటు లక్ష్యములని డా. రఘువీరగారి ఉద్ఘాటన. ఆ మహా ప్రయత్నమునకు శ్రీ శర్మగారు తోడ్పడవలెనని ఉడుతభక్తిగా ఈ గ్రంథమును ప్రకటించినారు. మంచిదే, కాని ప్రథమ ప్రయత్నమగుటచే కాబోలు గ్రంథమంతయు పునఃపాకము నపేక్షించుచున్నది. ప్రాప్తము = పొందినది; నీతము = భూతకాలము; ఈహితము = కోరినది; కష్టము = బాధ; కరణము = పనిముట్టు; క్షారము = కారము; ఖాద్యము = మిఠాయి; గలనము = మంచు కరుగుట; గుప్తము = దాచినది; చరిత్రము = చేసినది; చ్యుతము = నీతితప్పినది; ఛందస్సు = ఇష్టము; జ్యోతి = పొరగోటు; తాపనము = ఉతుకుట; ధృష్టుడు = ధైర్యముగల వాడు; నమ్రుడు = వంగియుండువాడు, నమస్కారము; నాథుడు = రక్షకుడు; పుటము = మడత; ప్రథ = అలవాటు; భజన = భక్తుడు; మిథునము = జంట; మృగము = వెదుకబడునది; యముడు = జోడు; నియమము = మాటి వినిపించుట; రటనము = వల్లించుట; రాధ = గెలుపు; ఆలాపన = సంగీతము; లంబము = నూటి; లలితము = ఆకర్షించునది; విలాసము = తప్పుదారి పట్టించు ఆకర్షణ; విడంబన = వేళాకోళము; శీర్ణము = చితకకొట్టినది; సాంత్వన = రాజీ; స్కందుడు = రెల్లుగడ్డినుండి పొడచుకొనివచ్చినవాడు; స్థగనము = పని యెగవేయుట; స్ఫురణము = తళుకు; త్యక్త్యము = విడువబడినది; హృష్టుడు = సంతోషముతో పులకరించిన శరీరముగలవాడు; శ్లక్ష్ణము = మెత్తనిది; ప్రకటము = ప్రకటింపబడినది; పితృవ్యుడు = తండ్రివైపువాడు; ప్రదక్షిణము = కుడివైపుకు; కుట్టనము = నూరుట— మొదలగు అర్థదోషములు గలవు. కొన్నిచోట్ల అప్రసిద్ధార్థములు చేర్చబడినవి. ప్రసిద్ధార్థములు విడువబడినవి (హిందీలో ఇవి ప్రసిద్ధములేమో!) కర్తనము = నూలు వడుకుట; జంభము = దవడ. మొ||.

కీలు, పరదా, బిచ్చము, రంగు అనునవి సంస్కృత శబ్దములుగా చూపబడుట వింత. క్లిష్ = క్లేశము; గ్రస్ = గ్రాసము; దిహ్ = సున్నము చేయుట; దేహము; ద్రా = నడచుట = నిద్ర; గృధ్ = ఇతరుల ధనమును కోరుట = గృధ్రము; టం = ఠోకనము

యజస్సు, ధనస్సు ఇ ఉ ఋ ౡ ల స్థానములో వరుసగా ఐ ఔ ఆర్ ఆల్ వచ్చుట వృద్ధి సంధి ఇత్యాదులు చింత్యములు.

'వీరు శిఖాపడిన రాయి కాదట. కనుక ఆయా ధాతువులను వాని యర్థములను ధాతుపాఠముతో సరిచూచుకొనవలెను. ఆయా శబ్దములను, వాని యర్థములను, నిఘంటువులతో సంప్రతించి సరిగా వ్రాయుట అవశ్యకము కొన్ని శబ్దముల అర్థములు హిందీలో వేరుగా నుండవచ్చును అట్టివానిని సూచింపవలెను. ఇట్టి గ్రంథ రచనకు భక్తి యొక్కటి చాలదు; శిఖాపడనిరాయియగుట గుణముకాదు. భాషా పరిజ్ఞానము, దానికితోడు కృషిచేయగల ఓపిక కావలెను. ద్వితీయ ముద్రణము నిర్దుష్టముగా, సర్వాంగ సుందరముగా వెలువడునని ఆకాంక్ష.

—ఆర్. వి.

### కట్టెమ్మస్తోత్ర నక్షత్రమాల

రచయిత- శ్రీ బహాదూరు రామానుజులురెడ్డి పుటలు — 12. వెల - లేదు. ప్రాప్తిస్థానం— శ్రీ బహాదూరు రామానుజులురెడ్డి, గాంధిరోడ్డు, తిరుత్తణి, చెంగల్పట్టుజిల్లా.

### శ్రీ రామలింగేశ్వర నక్షత్రమాల

కేసనగిరి (మేడిచర్ల తాలూకా)లోని రామలింగేశ్వరస్వామి స్తోత్రం. రచయిత-శ్రీ శ్రీరంగాపురం కేశవాచార్య. పుటలు—26. వెల—లేదు ప్రాప్తిస్థానం— శ్రీ శ్రీరంగాపురం కేశవాచార్య, 5-3-160/1 ఘోషామహల్, హైదరాబాద్.

### శ్రీ రా జే శ్వ రి

శ్రీమద్రాజరాజేశ్వరీ స్తోత్ర శతకం. రచయిత - శ్రీ పెమ్మరాజు వేణుగోపాలకృష్ణమూర్తి. పుటలు— 36. వెల—తెలియదు. ప్రాప్తిస్థానం— కళాకుటీరం, తిరువూరు.

### శ్రీ త్రినాథ వ్రతకల్పము

పద్యకృతి. పూజావధానయుతము. రచయిత — శ్రీ సోమయాజుల శ్రీరామదత్తాత్రేయశర్మ పుటలు— 48 వెల—0-75. ప్రాప్తిస్థానం—శ్రీ సోమయాజుల శ్రీరామదత్తాత్రేయశర్మ, ఖండవిల్లి, పశ్చిమగోదావరి జిల్లా.

### ప్రాచీన దాంపత్య సుఖము

దాంపత్య జీవితంపై ప్రాచీన గ్రంథాలను, గాంధీజీవంటి ఆధునికులు చెప్పిన అంశాలను, కుటుంబనియంత్రణనుగూడ తెలిపే గ్రంథం. రచయిత—శ్రీ మణిమంగళం పద్మనాభం. పుటలు—140. వెల—2-00. ప్రాప్తిస్థానం - శ్రీ ఎం. పద్మనాభం, 1/55, కృష్ణప్పనాయకన్ గుంటవీధి, కొండితోపు, మద్రాను—1.

### వేణుగోపాల శతకము

రచయిత – శ్రీ వి. పి శ్రీరాములు, పుటలు— 18. వెల — తెలియదు. ప్రాప్తిస్థానం — శ్రీ వి. వి. శ్రీరాములు, కార్వేటినగరం, చిత్తూరు జిల్లా.

### మై థి లి

వచన రామాయణం, రచన—శ్రీ పర్సా దుర్గాప్రసాదరావు, పుటలు—244. వెల-5-00. ప్రాప్తిస్థానం—జయంతి పబ్లికేషన్స్, విజయవాడ-2.

### శ్రీ ప్ర భా క రా !

ప్రభాకర శతకం రచన—ఫణిదెవు ప్రభాకర శర్మ. పుటలు—42. వెల—0-65 ప్రాప్తిస్థానం— మంజరీ పబ్లికేషన్స్, మచిలీపట్నం, కృష్ణాజిల్లా.

### అ హ ల్య

ఖండకావ్యం. రచయిత—శ్రీ నల్లాన్ చక్రవర్తి వెంకటాచార్యులు. పుటలు—58. వెల—తెలియదు. ప్రాప్తిస్థానం—కళాకుటీరము, తిరువూరు

### సాంస్కృతిక వేదిక

కవితాసంకలనంగల సారస్వత సంచిక పుటలు— 18. ప్రాప్తిస్థానం—సాంస్కృతిక వేదిక, బాపట్ల.

### ధ ర్మ ధ్వ జ ము

విభీషణ శరణాగతి వస్తువయిన ఐదంకాల నాటకం. రచయిత —శ్రీ భమిడి సత్యనారాయణశర్మ. పుటలు — 126 వెల 2-00. ప్రాప్తిస్థానం ఆంధ్ర విజ్ఞాన సమితి జమ్‌షెడ్‌పూర్.

### శ్రీరామతత్త్వ రహస్యము

పద్యకృతి. రచయిత—శ్రీ పాణ్యం లక్ష్మీనరసింహయ్య, పుటలు - 20. వెల 0-25. ప్రాప్తిస్థానం—శ్రీ పాణ్యం లక్ష్మీనరసింహయ్య, ఉయ్యాలవాడ, కర్నూలుజిల్లా.

**Printed and Published For Nageswara Rao Estates (Private) Ltd., by Radhakrishna at the Andhra Patrika Press, 6 & 7, Thambu chetty Street, Madras-1.**
**Editor : S. Sambhu Prasad.**